# చలంగారి ఉత్తరాలు

## వీరేశలింగంగారికి







ప్రచురణ :

చలం ప్రచురణాలు

సాగరసంగమం - భీమ్లి

విశాఖజిల్లా.

# ప్రియ రమణా

నువ్వే అరుణాచలంలో ఆవిర్భవించి
నిరంతర మౌన సమాధిలో కూచుని—
పరమ గంభీర శాంతిని వెదజల్లుతూ
నీ సామీప్యానికి వొచ్చే ప్రతి జీవిని
కరుణామృత రసధారలతో
నిత్యమూ వర్షించి వెలిగే నేత్రాలతో
అనుగ్రహించి తీసుకుని —
నీ ఆత్మ సామ్రాజ్యాభిషిక్తుణ్ణి చేసి,
స్వాత్మైక్యానుభవానంద సాగరాలలో
ఓలలాడిస్తున్నది నువ్వే కదా భగవాన్ !
కాని ఇటువేపున మా సంగతి —
నీ కను వీక్షణాలకి మరుగై పోయిందా ?
నిన్ను చేరుకోలేని, నీ సాన్నిధ్యంలో నిలవలేని
అజ్ఞానంలోపడి దారి తప్పిన నా దుర్గతిని
ఒక్కసారైనా పరికించకపోతే ఎట్లా !

నీ విరహాగ్నితో బాధ పడుతున్నందుకైనా
నీ ప్రేమామృతరాసి వన్నాలింగనం చేసుకోదా !
లోకం ఈనాడు ప్రత్యక్ష నరకంగా
రూపు దాల్చిన రాక్షసాహంకారంతో
దిక్కులేని దీన మృదుల హృదయాల్ని కూడా
భగ్న పరుస్తోంది - అభయమిచ్చి కాపాడవా !
నీ దివ్యపాదాలకివే నా శతకోటి ప్రణామాలు —
నువ్వే గతియై రక్షించు పరమాత్మ రమణా !

— యన్. వీరేశలింగం

(31-12-64 'జ్ఞానప్రభ'లో ప్రచురితం)

శ్రీ రమణాశ్రమము
తిరువణ్ణామలై
5 - 6 - 52

వీరేశలింగంగారికి,

మీ అందమైన ఉత్తరం. మీ కెందుకోగాని నా రచనలలో చాల విశ్వాసముంది. యుగాల వరకు కాదు—అప్పుడే మరిచిపోయినారు నన్ను. నా పుస్తకాలు అచ్చుకావడమూలేదు. అదొక దిగులని కాదు. నన్ను మరిచిపోవాలనే. ఎందుకంటే జ్ఞాపకం అంటే, ఆంధ్రులకి నామీది ద్వేషం రేకెత్తడమే.

రాయగల శక్తి మీకు లేదంటారేం? ఇంత మంచి ఉత్తరం రాసి!

అదేమిటి, నా పుస్తకాలని, నా స్ట్రగుల్‌ని అంతబాగా అర్థం చేసుకుని, నేను రమణాశ్రమాన్ని చేరుకున్నానని దిగులు పడుతున్నారు?

యదార్థ ప్రపంచాన్నించి, అంతకన్న తక్కువ యదార్థమైన చీకటిలోకో, వ్యర్థ కల్పనలలోకో పోతే, దిగులు పడాలిగాని, యదార్థ మనబడే ఈ ప్రపంచంనించి ఇంతకన్న యదార్థమైన ప్రపంచాన్వేషణలో ఏ ఆశ్రమం చేరుకున్నా, చాలా సంతోషించాల్సిన విషయం.

ఇన్నేళ్ళు ప్రపంచానికీ, సృష్టికీ సరైన అర్థం కనపడక, ఏదో అర్థం ఉన్నట్టు కనిపిస్తో, అదేదో తెలీకపోవడం చాతనే, అట్లా కొట్లాటలో వెతకడంలో గడిపాను అన్నేళ్ళు, ఎవరు చెప్పిన అర్థాన్నీ నమ్మక.

"అర్థంవుంది" అనే ఒక్క కాంతిరేఖ ఎక్కడి నించో యిచ్చిన సందేశంతో, ఆ అర్థాన్ని అందుకోడానికే అక్కడ చేరాను. ఇదివరకైనా నేనేదో అందరితో కలిసేవాణ్ణనుకున్నారా? ఏ నలుగురు మిత్రులో తప్ప (వాళ్ళు, నా అభిప్రాయాలు ఒప్పుకోని వాళ్ళే) ఎవరితోనూ నా కెన్నడూ సంబంధం లేదు.- బతికి పోయినాను. అట్లాంటి వాళ్ళు నా కిప్పుడూ ఉన్నారు.

అయినా ఆ పాట ఆంధ్రుల నించి ఎందుకు "తప్పుకో"కూడదూ? అందుకు కాదులెండి నేను ఇక్కడికి వొచ్చింది. కాని నాకు ఎవరు ఏం చేశారని నాకా పట్టు మీ దేశం మీద? కుక్కల్లాగు నన్నన్నివిధాలా జోఖిల్ల చేస్తోవుంటే, ఎవరు నా సహాయానికి వొచ్చారు ఈ 30 ఏళ్ళూ! డబ్బు తీసుకోకండా, అన్నేళ్ళు రాసిన నాకు డబ్బులేని రోజున ఎవరిచ్చారు ఒక్క రూపాయి? తీరా నేను వచ్చింతర్వాత అందరూ అడిగేవాళ్ళే ఎందుకు వెళ్ళావని! ఎందుకు? నా బాధ ఇంక వుండదని రూఢే గనక! చివరిరోజుల్లో, మీ దేశంలో, నాకు డబ్బు యిస్తామని రాయించుకుని ఎగగొట్టిన గొప్ప గొప్ప పత్రికలు (స్వతంత్ర మొ॥వి) రోడ్ల మీద తిట్టే వాళ్ళూ—ఆహా ఏం దేశమయ్యా! ఈ మహావీరులైన యువతీ యువకుల కోసమేనా నేను ఆ దేశాన్ని కనిపెట్టుకుని ఉండాల్సింది? నా కిట్లాగొప్పగా ఘొగిడి వొచ్చే ఉత్తరాలు ఎన్నో! కానీ బైటికి ఒక్కడూ నోరెత్తి నన్ను defend చేసిన వాడు లేడు. నా వెనక నుంచున్నవాడు లేడు. ఇదంతా దుర్మార్గమని కాదు. లోకం తీరు ఇంతే. మీరేదో నేను పరిగెత్తుకు వచ్చానంటే సరిగా తెలుసుకోక, అసలు సంగతి విచారిద్దామనే యోచనన్నా లేకుండా, ఇట్లా మాట్లాడే యువతీ యువకుల కోసమేనా నేను కాచుకుని వుండవలసింది? నేనక్కడ వుండగా ధైర్యంగా నా ముందుకి వచ్చి నుంచున్న ఒక్క యువకుణ్ణి చూడలేదు. పైగా వాళ్ళని చూసి, వీళ్ళ కోసమా నేనంత శ్రమ పడ్డది, అన్ని కష్టాలు భరించింది అనుకున్నాను.

ఇప్పుడైనా ఇక్కడ ఎందుకున్నాను? ఏం చేస్తున్నాను? నాకోసమే కాదు. నేను నా తపస్సుతో సాధించే కాంతిని, కాంతి కోసం వెతుక్కునే ప్రజలకి ఇవ్వడానికే ఈ దాక్కోడం. అరవిందయోగి యువతీయువకుల్ని వదిలి పాండుచెరిలో దాక్కున్నాడా? బుద్ధుడు అరణ్యాల్లోకి పారిపోయినాడా?

శ్రీ భగవాన్ రమణ మహర్షిగారి సంగతి తెలిసివుంటే మీకు, ఇట్లా రాయరు. ఆయన ప్రపంచానికి గొప్ప జ్యోతిగా వెలిగారు. ఆయన పోయినారు. ఆయన తరువాత జ్ఞానాన్ని వెదజల్లేందుకు మనుషులు కావాలి. మమ్మల్ని పిలిపించారు అందుకోసం. మమ్మల్ని సాధనలో పెట్టి

(మామూలు కళ్ళకి కనపడని ఆయన) మమ్మన్ని, సౌరిస్‌నీ నన్నూ guide చేస్తున్నారు. గొప్ప సాధనలో ఉన్నాము

ఈ లోకంలో దొరికే, ఈ మురికి ఆనందాలూ, అందాలు తృప్తి నియ్యక, వాటికన్న గొప్పవీ, విశాలమైనవీ, సుందరమైనవి పవిత్రమైనవీ ఐన అనుభవాలకోసం చేతులు చాచే ప్రతి వారికీ, ధన భారంతో చచ్చే దుర్మార్గుడికీ, కుష్టురోగంతో కుమిలే ముష్టి అతనికీ, కావలసిన వారికల్లా చాలా అందుబాటులోకి ఈ ఆధ్యాత్మిక దివ్యామృతాన్ని రుచి చూపబో తున్నాము.

మీ అశాంతిని పోగొట్టే విధం చూపుతాము. ఒక్క రెండేళ్ళాగండి.

మళ్ళీ ఉత్తరం రాస్తే 'చలం' అని రాయండి నా పేరు. ఇక్కడ వెంకట చలాలు ఇంకా వున్నారు—అంటే పూర్ణో.

నన్నేం చెయ్యలేక, నా మీది కసికొద్దీ 25 ఏళ్ళ తరవాత నా డిపార్టుమెంటువాళ్ళు, ఎప్పుడో పుస్తకాలు రాశావని, నా మీద తప్పుడు ఛార్జీలు తీసుకొస్తే, నా కథలు ఉచితంగా ప్రచురించుకున్న పత్రికలు, అడిగినా ఒక్కరు ఆ సంగతి ప్రచురించలేదు. అందరూ నా admirers, నా స్నేహితులే. నా చుట్టూ తిరిగినవారే. నేను ఉద్యోగం మానేసింతరవాత మీ దేశపు గొప్పవారు మొహాలు తప్పించుకుని తిరిగారు నా నుంచి.

అదీ మీ దేశం!

అంత బెజవాడ పట్టణంలో 20 ఏళ్ళు నే నున్నాను. వెళ్ళిపోతో వుంటే ఆ పూరినించి నన్ను పలుకరించిన వారు లేరు, ఒక్క శివంగారు తప్ప.

అదీ మీ దేశం

ఆ ప్రజల్ని వదిలినందుకేనా ఏదో తప్పుకొని వచ్చేశానంటున్నారు. మీ యువతీ యువకుల దొంగ మొహాలు చూసి దిగులుపుట్టి, వొచ్చేశాను. చివరికి ఇట్లా తయారైనారా అని! ఇక్కడికి కూడా వచ్చారు నా పుస్త కాలు చదివిన ఆంధ్రా లలామలు. వొచ్చి మా అందరిమీదా అసహ్య

ప్రచారం చేశారు ఈ పూళ్ళో! నేనట ఇంకా రాస్తూ వుండాలిట. ఎందుకు-మీకు తిట్టేందుకు ఎదన్నా వుండేందుకు! మామూలే ఇది ప్రతి దేశంలో-కాని అక్కడ ఏ నలుగురో ఆ రచయితవేపు చేరి అతన్ని సమర్థిస్తారు. మీ తెలుగు దేశంలో అదీ లేదు. ఎవరి కోసమండీ నన్ను అక్కడే వుండ మంటున్నారు? నాకేమీ అక్కర్లేదు. ఎవరినీ ఏమీ అడగను - అడగలేదు. మీ దేశం స్వరూపం చూపుతున్నాను. అంతే.

చలం

*

19-6-52

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. అవును. ఇదివరకు పురుషులు భయపడే వారు, నేనూ నా పుస్తకాలూ, వాళ్ళ ఆడవాళ్ళని, వాళ్ళ ఆధీనం లోంచి, ఎక్కడ తిరుగు బాటు చేయిస్తామోనని. ఇప్పుడు స్త్రీలు భయపడుతున్నారు. (ఇంక భయ పడతారుకూడా ఎక్కువగా ముందు ముందు) తమ పురుషుల్ని ఎక్కడ సన్యాసుల్ని చేస్తానోనని.

శివంగారు కథకులు. యువకులు. నేను బెజవాడ ఇంకా మూడు నాలుగు నెలలకి వొదిలేస్తాననగా నన్ను చూడటానికి వొచ్చారు. బెజవాడలో అన్నేళ్ళు ఉండికూడా ఎన్నడూ నా వేపు రాలేదు. నాతో స్నేహమన్నా, మా ఇంటికి రావడమన్నా అంత ఘోరం కింద ప్రచారం చేస్తారు బెజవాడ ప్రజలు. అప్పుడూ ఎవరో నన్నెరిగిన వాళ్ళతో వచ్చారు. అప్పటి నుంచి నాకు అతుక్కుపోయినారు. నేను వొచ్చేసింతరవాత కూడా, నన్ను వొద లక నాకింకా బెజవాడతో వొదలని సంబంధాలు సద్ది పెడుతున్నారు.

నన్ను ఎవరైనా పొగిడినా, తిట్టినా, కూడా నాకు రాయకండి. ప్రస్తుతం నా మనసులోకి అట్లాంటివి తీసుకోడం బాధ. సాధనలో ఉన్నాను.

అవును. ఎవరికీ నేనక్కర్లేదు. నాకంతకన్నా ఎవరూ అక్కర్లేదు. ఎవరైనా నానించి ఎదన్నా నేర్చుకోవాలని సూనృతమైన కోర్కె కలవారు తప్ప నన్నింకోరు పలకరించడం నేను కోరను.

నేను రాశాను కామా! నా కోసమే కాదు, నా నించి ఏదో తెలుసు కోగలమనే వారందరికోసమూ, చేస్తున్నాను ఈ తపస్సు. ఇది కష్టతరమైన మార్గం. కాని నడిపేది ఈశ్వరుడైన భగవాన్ రమణ.

భగవాన్ బతికి వుండగా ఎవరూ ఏమీ చెయ్యనక్కర్లేక పోయింది. ఆయనే వెదజల్లారు జ్ఞానాన్ని. యాభై ఏళ్లు ఇంత కొద్ది దూరంలో వెలిగి, ప్రపంచంలో అన్ని దేశాలనించి మనుషుల్ని ఆకర్షించి తన దగ్గిర కట్టేసు కున్న భగవాన్ సంగతి మీరు వినలేదంటే ప్రజలూ, పత్రికలూ, ఏ స్థితిలో వున్నాయో ఆలోచించుకోండి. ఎలెక్షన్లలో ఎవరికి ఎన్నెన్ని వోట్లు వచ్చాయో కంఠస్థం మనుషులకి. కవీ, ప్రవక్తా-వీళ్ళ పేర్లు కూడా విని వుండరు.

మీరు కోరినట్టు మిమ్మల్ని భగవాన్‌కి వప్పచెప్పాను. ఇదివరకే మీరు వారి దృష్టిలో ఉన్నారు. రెండేళ్ళాగమను. రప్పించుకుంటానన్నారు. అప్పటికి మా సాధనా పూర్తి అవుతుంది.

అసలు ఎక్కడ శాశ్వతమైన బంధుత్వం ఏర్పాలో అక్కడే ఏర్పడింది మనకి.

ఇంకేంకావాలి ?

చలం

*

3-7-52

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. రమణభగవాన్ ఒకరిని తనలోకి తీసుకోడానికి వారికి, సంస్కారమూ, విజ్ఞానమూ అక్కర్లేదు. వాటిని పొందగల అర్హత వుంటే చాలు. (అంటే చదువుకోనక్కర్లేదు, చదువుకుంటే చదువు వొచ్చే తెలివి వుంటేచాలు. అన్నట్టు) భగవాన్ దగ్గిర ప్రవేశానికీ, ఉత్తీర్ణతకీ వేరే Qualifications- ఈ ప్రపంచానికి సంబంధించనివి కావాలి. మీరు దేనికో ఓ దానికి మీ బంధువుల్నీ, మర్యాదల్ని వొదిలారనేది ఓ గొప్ప

అర్హత. అది వొదిలిన వాళ్ళకి, తక్కినవి వొదలడం ఓ కష్టంకాదు. కాని వొదలడం అంటే భౌతికంగా వొదలడం కాదు, మానసికంగా. మనసులో పట్టు పోవడం ముఖ్యం. పట్టు వదులు కోడానికి కొంతవరకన్నా సిద్ధంగా వుండడం. పోసి వొదిలితే బావుండునని వాంఛ వుండడం. అంతే కావలసింది. తక్కింది ఆయన చూసుకుంటారు. మీకు తెలీక పోయినా మీకా అర్హత వుందన్నమాట.

రెండేళ్ళల్లో ఇక్కడికివొచ్చి సాధన ప్రారంభించ పోతున్నారు. ప్రయాణం మొదలు అప్పుడు.

"ఇదంతా నాదీ కానట్టు లేచిపోగలనా?" అంటున్నారు మీరు. అక్కడ ఏముంది మీకు? ప్రియురాలు తప్ప ! అవే బంధనాలు. బంధం మనసులో పైట వస్తువులో కాదు. అవి పీడిపోతాయి ఇక్కడ. అదే చేయించే సాధన. కనపడింది, కనపడంది అంతా అనుభవించ పోతున్నారు. అనుభవానికి అతీతమైన అనుభవానికి పోతారు. అదే ఆధ్యాత్మికం.

ఇంద్రియాలకి వశ్యులు కాకపోతే, ఈపాటికే కొండల్లో వుండే వారు! మరి సాధనలన్నీ ఎందుకు ? ఇంద్రియాలనించి తప్పించి దృష్టిని ఏ ఆధారమూలేని ఆనందంలో లయం చేయడానికేగా !

మీ ప్రేయసిని గురించి గోల పడటానికెందుకు ? పరస్పరం అవసరమైనన్నాళ్ళు ఎట్లాగూ బంధం వుండనే ఉంటుంది. మామూలు శరీర మానసికా కర్షణలనించి, ఉన్నతంగా ప్రేమించగల శక్తికి కళ్ళు తెరుచుకుంటాయి. విశ్వప్రేమజ్యోతిలో ఆమె ఒక దివ్య కిరణంగా మెరుస్తుంది మీ కళ్ళలో. మీ ప్రేమ యిట్లానే నిలిచివుంటే—ఆమెను గురించి గొడవ పడకండి. ఇది బాడిద వైరాగితనం కాదు. అన్నిటినీ Include చేసుకునే ఒక విశ్వ ఆలింగనం. ఇప్పటి మల్లె సంకుచితంగా, ఇరుకుగా గాక, విశాలంగా ప్రేమించగల దృష్టికి Lift కావడం, Expand కావడం. ఈ అగ్ని దీక్షలో నిజమైనవి నిలుస్తాయి, పూగేవి పూడతాయి, మనం ఎంత నిజమని గోల పెట్టినా అబద్ధాలు కాలిపోతాయి. మోసాలు తెగుతాయి.

"ఎక్కడ శాశ్వతమైన సంబంధం ఏర్పడాలో—" ఆ నా మాటలు అర్థం కాలేదన్నారు. భగవాన్‌లో మన సంబంధం. అంతకన్న పేరే అర్థం ఏముంది,

మీ జన్మ రహస్యాన్ని ఇప్పుడే చెప్పరు. చెప్పి ప్రయోజనంలేదు. పైగా హాని?

అవును 'భగవంతుడు' అనే record ఇచ్చాను రేడియోవాళ్ళకి.

సంవత్సరం కిందటివరకు భగవంతుడు లేడనే ప్రచారమే చేశాను. ఆ రికార్డు అంతా దేవుణ్ణి బాగా తిట్టాను. ఆ రికార్డు యిచ్చిన రెండు నెలలకే భగవాన్ మా ఇంట్లో ప్రత్యక్షమైనారు. ఏమైనా దాని కాపీ లభ్యమయ్యే విధం కనపడదు.

"నీ మీద ఎంత ప్రేమో, నాకు నీ ప్రేయసి మీదా అంతే ప్రేమ. ఆమె ఎడల నీ బాధ్యత ఏముంది? ఆమె నా బాధ్యత"

అన్నారు ఈశ్వరుడు మీకు రాయమని. భగవాన్ ఫొటో పంపుతున్నాను. దీన్ని ధ్యానంలో ఉంచుకొండి.

చలం

*

12-7-52

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఉండనీండి అవిశ్వాసం. అదీ పోతుంది. కాని పోయిందాకా బాధ తప్పదు. మీలో ఆ అశాంతీ బాధా అందుకనే. మీ అవిశ్వాసాన్ని పోగొట్టడానికే.

మీకేం చెప్పాలో, చెప్ప కూడదో, ఏది మీకెప్పుడు అవసరమో, ఏది కాదో, తెలిసిన మహాజ్ఞానం మీ హృదయంలోకి సూటిగా, అన్ని రహస్యాలూ చీలుస్తో విశదంగా చూడగల జ్యోతి ఈశ్వరుడు శ్రీ రమణ అని గట్టిగా నమ్మండి. "తప్పించుకుంటున్నారు" ఇట్లాంటి పెంకె మాటలు వాడడంవల్ల మీకే నష్టంగాని, ఎవరూ జడవరు, లొంగిపోరు. మీరు

సాధనకి ఎట్లా దిగాలో, ఎప్పుడు దిగాలో, ఏ సాధనో, అంతా ఆయన అనుగ్రహం. మీ బాధ్యతకాదు.

నాలో గాని, ఈశ్వరుడిలో గాని నమ్మకం లేకపోతే, ఈ గొడవ మానుకుంటే మంచిది. మాయలోకి దింపుతున్నామేమో అని మీరంటే, కాదని ఎవరూ ఏ రుజువూ ఇవ్వలేరు. ఇవ్వవలసిన గత్యంతరం ఎవరికీ పట్టలేదు.

ఒక గొప్ప ఆశ దొరికిందనే సంతోషం పోయింది మీలో అప్పుడే. అన్నీ అనుమానాలూ, భయాలూ, బేరాలూ, షరతులూ బైలుదేరుతున్నాయి.

మానవస్వభావం.

ఆ అనుమానాలే, ఆ షరతులు పెట్టి బేరమాడే గుణమే మీ బాధలకి మూల కారణం. ఈ మార్గంలో పూర్తిగా, ఏ సంకోచము లేకండా అర్పించుకున్నకొద్దీ సుఖం, సులభం. ఎవరికో దేనికో బైటదానికి కాదు మీ హృదయంలో వెలిగే మీ స్వంత ఆత్మకే మీ అర్పణ. ఈశ్వరుడు దానినించి వేరుకాదు.

ఆ కొంటె మనసు నోరు నొక్కండి. శాంతి వొస్తుంది.

రెండేళ్ళ తరవాత మీరు ఇక్కడికి రావడం ఎట్లానూ తప్పదు. ఈ లోపల మీరు సుఖంగా వుండాలంటే మీ అవిశ్వాసాన్నీ, భయాల్ని వొదులుకోండి, వొదులుకోరా బాధ తప్పదు.

నమ్మకపోతే మిమ్మల్ని ముందుకి ఎవరూ తొయ్యతలచుకోలేదు. మీ అశాంతే మిమల్ని తోస్తోంది.

మీకు మార్గం చూపాను, మీకు నచ్చిన మార్గం కాదది. నచ్చిన మార్గాలు చూపరు ఇక్కడ. మీకు నచ్చక పోయినా, శ్రేయస్సు నిచ్చే మార్గాలు చూపుతారు. తరవాత మీ ఇష్టం.

మళ్ళీ చెపుతున్నాను సంకోచం లేకండా, ఆయనే దిక్కని భగవాన్ని ఆశ్రయించండి. ఎప్పుడూ ఆయన్ని మీ ధ్యానంలో ఉంచుకోండి. ఆయన

రక్షించ గలరని విశ్వసించండి. ఎందుకు ? చలం చెప్పాడు కనక; చలానికి తెలుసును గనక. చలంలోనూ నమ్మకం లేదా, చలంతో స్నేహం వృథా. చలాన్ని ఇంక disturb చెయ్యకండా వుంటే మంచిది.

ఉత్తరంలో భగవాన్‌లో విశ్వసించానని రాశారు. వెంటనే విశ్వాసం లేదని రాస్తున్నారు. ఏది నమ్మడం. విశ్వాసమంటే ఏమిటి ?

మీకేదీ, ఎవరూ, సహాయం చెయ్యలేరు భగవాన్ తప్ప. అదీ వొదులుకున్నారా ? ఎన్నాళ్ళు వొదులుకోగలరు. ఇంకా అగ్నిలో మాడి మీరే వెతుక్కొంటో వొస్తారు. ఆనాడు నానించి ఉత్తరమూ రాకపోవచ్చు. మాటా రాకపోవొచ్చు, కాని ఎప్పుడూ ఈ అనంత కాలంలో ఏ నిమిషానైనాసరే, మిమ్మన్ని ఆహ్వానించి తీసుకోనే తీసుకుంటారు భగవాన్.

మీవాళ్ళమీద కసా ? ఆ కసి తీరిస్తే ఈశ్వరుడు ఇంకో కసి ! ఆ కసి అనేది పోయేదెప్పుడు మీలోంచి. మీ కసిని అసహాయంగా అట్లా అనుభవించి మగ్గడంకన్న, కోర్టులోనో, యుద్ధంలోనో, ఆ కసి తీర్చుకోవడమే నయం. అంత కసి కలవారికి, ఇంక కోర్టూ, న్యాయస్థానాలేనా, సహించరానివైనాయి !

"నాయీ న్యాయాలు నాకు వొదులు" అనే ఈశ్వరుడి మాటలు నమ్మని మీకు ఈశ్వరుడు ఎందుకు సహాయం చెయ్యాలి ?

ఇట్లాంటి కోర్కెలకీ ఐత్తులకీ, లొంగుతాడనుకొంటారా ఈశ్వరుడు? అంత గొప్ప అభిప్రాయమన్నమాట ఆయనయెడల మీకు?

భగవాన్‌కీ లేదు కోపం మీ మీద. నాకూ లేదు. సంధిలోవున్న రోగితో కఠినంగా మాట్లాడాలి. ఎంత కరుణో అంత కాఠిన్యం. ఎంత కాఠిన్యమో అంత మార్దవం. అదీ ఈశ్వరుడు. ఒక చేతిలో వరాలూ, ఇంకో చేతిలో శిక్షలు. శిక్షలు అంటే బాధా కరమైన వరాలు. వరాలకన్న ఉత్తేజమైన, ప్రేమార్ద్రమైన కన్నీటి ధారలు, ఆయన శిక్షలు.

"నా హృదయం చల్లారిస్తే భగవాన్ తప్ప గతి లేదు" అంటు న్నారు.

ఆ జేరాలే పనికిరావు. చల్లార్చడంవల్ల విషం తలకెక్కుతుందని చల్లార్చడు. ఆ బాధ పడితేగాని ఆ జరం తగ్గదు. ఆయనమిమ్మల్ని శుభ్రం చెయ్యడానికిచ్చిన అగ్నిని ఆయన ఎందుకు చల్లారుస్తారు, దాని పనికానిదే? ఆయన్ని నమ్మండి. నమ్మినకొద్దీ మీ హృదయం చల్లారుతుంది. దాన్ని ఆయన మండించవలసిన అవసరం తగ్గుతుంది. విశ్వాసాన్ని హెచ్చించ డానికే బాధలు కనక.

"ముందుకి తీసుకుపోతే"— "అర్హత నా కిస్తే?" "అప్పుడు మన బంధుత్వం నిజమని" ఏమిటీ షరతులు.

ఏ ఫరవాలేదు. మన బంధుత్వం నిజం కాకపోయినా ఎవరికీ నష్టం లేదు. మీకు విశ్వాసం రావాలని ఎవరూ కొట్టుకోవటం లేదు. వొచ్చినప్పుడే వొస్తుంది.

అవును. మాడి నశించ వలసిందే. గత్యంతరం లేదు.

ఏ షరతులూ లేకండా నువ్వే దిక్కని ఆయన పాదాలు గట్టిగా పట్టుకోండి.

మీ సందేహాలు ఉత్తరాలలో తీరవు. ఎంత మాట్లాడినా ఎవరి సందేహాలు తీరవు. దివ్యకాంతి దర్శనమైనప్పుడే తీరతాయి. తప్పకండా మీకు శాంతినీ, కాంతినీ యిస్తామంటున్నారు ఈశ్వరుడు. ఆయనలో సంపూ ర్ణంగా విశ్వసించి, ఆయన్నే స్మరించి, మీ హృదయంలో ఆయనకి చోటుని కలగ జెయ్యండి. అప్పుడు తెలుస్తుంది ఆయన ఏమి చెయ్య గలరో.

మిమ్మన్ని బాగా చివాట్లు పేశాను. మీకు అవసరమని. అదంతా నా ప్రేమగా అర్థం చేసుకోండి.

చలం

23-7-52

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం చూసి చాలా సంతోషమైంది. అవును. అన్ని జీవితాల్నీ ఒక గొప్ప విజ్ఞానం నడుపుతోనే వుంటుంది. అందులో ముఖ్యంగా ఆధ్యాత్మిక మార్గాన్ని చేరుకోవలసిన జీవితాల్ని ప్రత్యేకంగా ఒక రక్షణ హస్తం పరిశీలిస్తున్నట్టు స్పష్టంగానే కనపడుతుంది. మీ ఉత్తరం నన్నేమీ కష్టపెట్టలేదు. అవిశ్వాసంతో మీరు కష్టపడ్డారనీ, ఆ అవిశ్వాసమే మళ్ళీ మిమ్మల్ని దూరంగా తీసుకుపోతుందేమోనని కష్టపడ్డాను. అంతే. క్షమించవలిసింది ఏమీలేదు. ఈ సందేహమనేది మిమ్మన్నేకాదు, నన్నూ బాధిస్తుంది. అట్లా సందేహం నా మనసు మీదికి పాకినప్పుడల్లా గట్టి చివాట్లు తింటోవుంటాను. సునిసితమైన మేధస్సు కలవాళ్ళకీ, నాజూకు హృదయా లున్న వాళ్ళకీ సందేహాలెక్కువ. ముఖ్యంగా అవిశ్వాసం ప్రబలివున్న ఈ కాలంలో, ఈశ్వరుడి సంపూర్ణానుగ్రహం మీవెంటనే ఉన్నది. నేను పంపిన భగవాన్ ఫోటో మీలో స్థావర మేర్పరుచుకుంటే ఇంక అవిశ్వాసమనేది ఏముంది? సందేహాలు కలుగుతున్నా అవి చాలా పై పై విషయాలు. సత్యదర్శనమయేవరకు సందేహాలు వొస్తోనే వుంటాయి. ప్రశ్నించడం, సందేహించడం మనసు గుణం. కాని ఆ గుణం మనసు విశ్వాసాన్ని కదపకూడదు. దాన్ని తాత్కాలికమైన వికారం కింద చూడడం నేర్చుకోవాలి.

రెండేళ్ళల్లోకాదు, భగవాన్ పటం మీ కందినప్పటినుంచి మీ సాధన ప్రారంభమయిందన్నమాటే. ఆయనని మనసులో నిలుపుకోడంకన్నా ఉన్నతమైన సాధన లేనేలేదు. ఆయన్ని హృదయంలో చూసుకోగల శక్తి స్థిరంగా రావడానికే తక్కిన పై సాధనలన్నీ.

పుస్తకం ఇంకా అందలేదా? ఈసారి మీ నించి ఉత్తరం రాగానే కొత్త కాపీ పంపుతాను. నా ఉత్తరాలు చిన్నవిగా ఉంటే ఏమీ కించపడకండి. రాసేందుకు ఏమీ వుండదు.

చలం

4-10-52

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం, నిన్న ఓ కార్డు మీకు రాశాను. ఇవాళ మీకు ఉత్తరం ప్రారంభించాను కొంచెం తెరిపి ఇచ్చేప్పటికి. ఇవాళే ముగించగలనో లేదో! నా బాధ ఇంకేంకాదు. ఈ సాధన నించి బాధ. సాధన అంటే ముక్కు మూసుకుని కూచోడమో, ఏదో నామ జపమో అనుకోకండి. అంత సులభంకాదు. నేనెవరు? అనడం మాత్రమేకాదు. ఆ ప్రశ్న వేసు కున్నకొద్దీ, అగ్నులు బైలుదేరుతాయి. మనసు నాశనం కావడం ప్రారం భిస్తుంది. అగ్ని పరీక్షలు జరుగుతాయి. శరీరానికి గట్టి శ్రమ తగులు తుంది. వేసిచేసి జ్వరాలు వచ్చినట్టువుతుంది. మనసు తనపట్లన్నీ వొదులు కోలేక, గిలగిల కొట్టుకుంటుంది. దీనికంతా తట్టుకుని నిలబడ్డ వాళ్ళకే ఫలితం. పురాణాల్లో ఋషులకి అప్సరసల పరీక్షలూ అవీ జరిగేవే, వాటి కన్న మించినవి. చుట్టూ అగ్ని బైట వెలిగించరు. లోపల వెలిగిస్తారు. ఇవాళ నయం. నాకు. ఆ బాధ.

మీరు ఉత్తరం ఇక్కడికి రాయడం నాకు కాదు, ఈశ్వరుడికి. ఆయన చూస్తున్నారు మీ ఉత్తరాల్ని, మీరు ఇన్నాళ్ళు రాయకపోయిన కారణం చూచి "అవునుమరి! ఇక్కడికి ఉత్తరం రాయడంకన్న ఆ చిక్కులూ, ఆ ప్రయత్నాలూ బలమైనాయి" అన్నారు. కాని రాయడానికి మన స్తిమితం దొరకలేదేమో ననుకున్నాను. ఇన్నాళ్ళు రాయకపోతే, మీరే మైనారో అని ఆదుర్దా పడవలసిందేనేనే. మీ H. M. కో ఎవరికో మీ సంగతి రాయమని రాయవలసిందే. ఏమి జబ్బు చేసిందో ఏమో అను అనుకున్నాను. కాని ఈశ్వరుడు ఊరుకోమన్నారు. ఆలిస్యంగా మీరు రాస్తారని చెప్పారు. భగవాన్ ఏమన్నారు. "పులి నోటి మాంసంముక్క కన్న నేను నా భక్తుణ్ణి గటిగా పట్టుకుంటాను. మీరు నన్ను మరిచిపోయినా నేను, మిమ్మన్నెప్పటికీ మరవను" మరవరు. నా ఆదుర్దాని మీరే తెలుసు కోవలసింది. ఓ కార్డు రాయాలి. తరవాత రాస్తానని. నేను రాయలేదూ? ఉత్తరానికి జవాబు రాయకపోవడం నా దృష్టిలో అవమర్యాద. పిలిస్తే పలకనట్టు.

నేనూరుకోడానికి ఇంకో కారణం. నా జీవితమంతా నాకోసం వొచ్చి, స్నేహం చేసుకుని, ఎదో విని, లేక నేను నచ్చక, నన్ను వొదిలి మారుమాట లేకండా మాయమైన వాళ్ళ లెఖ్ఖలేదు. అందుకని ఆశ్చర్యం కలగదు మిత్రులు వీపు తిప్పి మాయమైనప్పుడు.

అప్పుడప్పుడు మిమ్మన్ని దిద్దుతాను. కోప్పడనూ కోప్పడతాను. మీరు వాటి spirit గ్రహించి, సహించాలి.

మీ బదిలీని భగవాన్ అనుగ్రహించలేదంటారా? మామూలు మనుషుల ప్రార్థనల్ని కటాక్షిస్తారు భగవాన్. కాని భక్తుల ప్రార్థనలని సాధారణంగా నిరాకరిస్తారు ఎందుకు?

"నా క్షుద్రప్రార్థనలని నిరంతమూ నిరాకరించి నన్ను కాపాడు" అన్నారు టాగూరు. మీరు కోరిన బదిలీవల్ల మీకంతా సౌఖ్యమే. క్షేమమే కనపడుతుంది. కాని భగవాన్‌కి ఏమి కనపడుతోందో! ఒక వరం ప్రసాదిస్తే ఇంకోటి అడుగుతాము. అట్లా అడిగి అడిగి ఉత్త దేవిరింపులు ప్రారంభిస్తాము. ఈశ్వరుడి దగ్గరైనా మన self-respect ఆత్మ గౌరవం మనకి ఉండాలి. అదీగాక తక్కినవాళ్ళ కోర్కెల్ని తీరుస్తారు. కాని ఎవరికి గట్టి ఉపకారం ముందుకాలంలో చెయ్యతలుచుకున్నారో వాళ్ళ యడల కఠినత్వం చూపుతారు. వాళ్ళని కఠినమైన disciplineలో వుంచుతారు. మీకు ఎవరూలేరు అని రాస్తారేమిటి? ఈశ్వరుడే మీపట్ల వుంటే. ఆయన మన యడల వున్నాడలి, ఆయన ఇచ్చే నిరాకరణలలో, కష్టాలలో కూడా చూడ గలగాలి. అది అమితంగా కష్టం. అది చాతకాకనే నేనట్లా బాధ పడుతున్నాను. చివాట్లు తింటాను ఆయననించి.

మళ్ళీ ప్రశ్నిస్తున్నారు మీరు. "ఈశ్వరుడి సంపూర్ణానుగ్రహం ఎట్లా అందుతుంది" అని. అది మీ వెంటనేవుంది. దృష్టి మారాలి. ఆయన యెడల తెలుసుకోవాలి. ఆ ఎదురుచూసే శక్తి ఇవ్వమంటున్నారు మీరు. ఇస్తోనే ఉన్నారు. మన కళ్ళు ఇంకా తెరుచుకోలేదు. కాలం పడుతుంది. పచ్చి మొగ్గ ఒక్కరోజులో విచ్చుకోదు. నేనేం పెద్దవరాలు కోర

టంలేదు- శాంతీ, కాంతీ, మాత్రమే అంటున్నారు మీరు. అంతకన్న పెద్ద వరాలేమున్నాయి? డబ్బు, ఉద్యోగం బదిలీ, ఇవి చాలా సులభం. ఏ మనిషైనా ఇవ్వగలడు. శాంతీ, కాంతీ ఎవరివ్వగలరు? అవే ఈశ్వరుడిచ్చే చివరివరాలు. శాంతీ, కాంతీ అంటే అర్థం తెలీక, అవి లోకంలో బజారులో ధర గలవి కావుగనక ఇంతేకదా కోరుతున్నది అనుకుంటాము. కానీ ఇక్కడి శాంతికీ అక్కడి శాంతికీ చాలా వ్యత్యాసం. Peace the tpasseth understanding (Bible) ఇక్కడ దొరికేది.

మీ సంసార విషయమైకాని, దేనివిషయమైకాని ఇప్పుడు ఏం చెయ్యడం అని ఆలోచించకండి. మీరు చెయ్యవలసిందీ, ఆలోచించవలసిందీ ఏమీ లేదు. చేసేవారు వేరే వున్నారు. సమయం రాగానే వారే చేస్తారు ఏం చెయ్యాలో!

మీ ప్రయత్నం ఇట్లా విఫలమైపోవడం శుభ సూచకం. ప్రయత్నాలు ఫలించేవాళ్లు వాళ్ళ కోర్కెలనించీ, ప్రయత్నాలనించీ తప్పించుకోలేరు ఎన్నాళ్ళకీ.

ప్రపంచంలో నలిగి, కాగి, దిక్కులేనివాళ్ళకే ఈ ఆధ్యాత్మిక ప్రపంచం. "మాధుర్యమనీ, ప్రేమ అనీ, వ్యవహరించిన సాహసం" చాలా గొప్పది! కళ్ళు తెలీక అనకండి అంతకన్న గొప్పది ఏముంది ప్రపంచంలో. అది విఫలమై భారమైతేనేంగాక? ఆ సాహసమే, నాలుగు నాళ్ళైనా, అనుభవించిన ఆ అమృతం ఎవరికి దొరుకుతుంది? ఇప్పుడు దానికన్న గొప్పమార్గం ఆ ప్రేమని అంగీకరించి విస్తీర్ణత చేసే కాంతి దొరికింది కనక ఆ ప్రేమని దీంటో లీనం చేసెయ్యాలి.

మీ సహాయానికి భగవాన్ తప్ప ఎవరు వొస్తారని అనేకాదు, విశ్వాసం వుంచుకుంటే తప్పక వొస్తారు చాలా త్వరలో. కాని ఆ సహాయానికి రావడం, మనం కోరినట్లు, మనమనుకున్న మార్గాన రావడం, అదంతా ఆయనకి వొదిలెయ్యాలి. తోవ చూపమని మీరు నన్ను అడగనక్కర్లేదు. అది నావిధి, నాధర్మం. నాకు ఈశ్వరుడు తోవ చూపినప్పుడు, మరి నేను నన్ను నమ్మిన మిత్రుడికి తోవ చూపకపోతే నన్ను క్షమిస్తారా?

మీకు వొచ్చినకలకి implication స్పష్టం. నాతో సంబంధం ఏర్పడుతోంది మీకు లోపలినించి.

మీకు ముందు వొచ్చిన కల కూడ రాయండి. మీమిత్రుడు సూర్యనారాయణగార్ని ఇక్కడికి రానీలేదు ఈశ్వరుడు. ఆయనకి ఇక్కడి అనుభవం వల్ల ఉపయోగం పొందే అర్హత లేదన్నారు ఆయన. అంత గొప్ప ఉత్తరం మీరు రాసినా, దాని అర్థాన్ని తీసుకోలేక, ఇక్కడికి రాకుండా వెళ్ళడంలోనే తెలీటంలేదా ఆయన యోగ్యత! ఆ ఉత్తరం పైన నా అభిప్రాయం ఏముంది? నన్నుగురించి మీకెంత గొప్ప అభిప్రాయం వుందో చూపుతోంది.

రాసినది మళ్ళా చదవటం నా కలవాటు లేదు. తప్పులుంటాయి ఉత్తరం నిండా.

మీకు బదిలీలు కటాక్షించే మనిషి ఉద్యోగం పేరేమిటి? ఆయన పేరేమిటి ?

చలం

*

21-10-52

వీరేశలింగంగారికి,

చక్కని మీ ఉత్తరం. ఈసారి నా జవాబు ఆలస్యమయింది. అది గాక రాయడానికి ఏమీ లేదు కూడాను. భగవాన్ అంతే. తనవేపు మనసు లాక్కుంటారు. ఇంకా కొంచెంగా ఆనందం కూడా చవి చూపుతారు. ఆధ్యాత్మికానుభవం అంటే ఏమిటో తెలీడానికి; మనని ఆకర్షించడానికి కాని మెల్లిగా ఎప్పుడో అది మాయమవుతుంది. చీకట్లో పడ్డట్టవుతుంది. అది పరీక్ష. అప్పుడూ ఆయన్ని విడవకూడదు. చాలా ఏడిపిస్తారు. కాని కన పడకపోయినా మన పక్కనే వుంటారు. ఆయన ఇచ్చే ఆకర్షణని మనం మన సాధనతో మన సొంతం చేసుకుని నిలుపుకోవాలి.

ఈ సారి మీ మిత్రుడు వొస్తే, అక్కడికి వొచ్చేందుకు వీలు చేస్తానన్నారు ఈశ్వరుడు.

మీ అప్సరసల కల—అదీ ఓ పరీక్ష అన్నారు ఈశ్వరుడు. అనేక అందాలు చూపుతారు: అన్ని అందాలు ఆయనేనని తెలపడానికి. నా అనుగ్రహమేమిటి ? నా అనుగ్రహం ఏపాటిది? ఈశ్వరుడి అనుగ్రహమే మీతో వుంది. విశ్వసించండి-తర్వాలో అన్నీ జరుగుతాయి.

మీ బదిలీ సంగతి—ఈశ్వరుణ్ణి అడిగాను ప్రయత్నించనా ? అని? నన్నూ మిమ్మల్నీ కూడా కోప్పడ్డారు. ఆ బదిలీ మీ శ్రేయస్సు ఐతే, తానే చేసివుండరా, మీరు ప్రయత్నించారో ? ఎప్పుడు ఆ బదిలీ కావాలో అప్పుడు చేయించే బాధ్యత తనది అనీ, ఆ విశ్వాసంలో మీరు నిలవాలనీ రాయమన్నారు.

చలం

*

16-11-52

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నేను మీకు రాసిన భవిష్యత్తులో గట్టిగా విశ్వసించిన కొద్దీ (అంటే ఈశ్వరుడి మాటలో) మీకు మనస్తిమితం కలుగుతుంది. రెండేళ్ళకి ఇక్కడికి వొస్తావన్నారు. రెండేళ్ళేకదా ఈ బాధలు ? అని నెలలు లెఖ్ఖపెట్టుకుంటో ఉండండి. మనస్తిమితం లేకపోవడం గొప్ప వరం మనస్తిమితం గల మనుషులు, టీచర్లుగాని, మంత్రులుగాని, ముష్టివాళ్ళుగాని, ఎట్లా వారి జీవితాలలో తృప్తిపడి, కొవ్వెక్కి, సుఖంలో కూరుకుపోయి, నిద్ర పోతున్నారో చూడండి. జీవితం కాల్చుకుతింటేనే గాని, ఎక్కడ ? అని పరిగెత్తం. మీకే మీ స్తానంలో సుఖముంటే, రెండేళ్ళయిన తరవాత కూడ, మిమ్మల్ని కదల్చడం చాలా కష్టమవుతుంది. నా మీద మీకు ఆకర్షణ కలిగిందంటే, మీలోని అసంతృప్తివల్లనే.

మీ ఉత్తరాలు నాకేమీచిరాకు కాదు. "నన్నెందుకు భగవాన్ కఠినంగా పరీక్షించాలి ?" అని గొప్పగా అడుగుతున్నారు. 'నన్నెందుకు పరీక్షించాలి'? అని S. S. L. C. Board వాళ్ళని అడిగారా ? చవకగా వారి కారా భగవాన్. అవును. ఆయనలోకి మీరు తప్పించుకుంటారనే భయంతో

మిమ్మల్ని లోకం తన కౌగిలిలోకి గుంజుతోంది. అట్లాంటి Pull లేకపోతే మనుషులు చాలా సులభంగా యోగులౌతారు. ఎక్కడో కోటి మందిలో ఒక్కరూ ఈ పరీక్షలో నెగ్గేది.

ఆ శాంతమ్మగారి సంగతి నాకు అర్థం కాలేదు. తనకోసం ఆమె ఎందువు ప్రార్థన చెయ్యమంది ? ఆమెకి వొచ్చిన కష్టమేమిటి ? ఆ శాంతమ్మగారికి ఏమన్నా కావలిస్తే ఆమెనే బతిమాలమనండి అన్నారు ఈశ్వరుడు. మాకు రాయమనండి. కాకపోతే ఈశ్వరాలయానికి వెళ్ళి చెప్పుకోమనండి. విశ్వాసముంటే చాలు ఎక్కడలేరు ఈశ్వరుడు ?

మిమ్మల్ని insure చెయ్య వొద్దన్నారు ఈశ్వరుడు. మీ class లో జరిగిన మహిమ గొప్పగావుంది. ఇట్లాటివి ఎన్నో జరుగుతాయి విశ్వాసం స్థిరమైన కొద్దీ. కానీ ప్రతిసారి జరుగుతాయి అనుకోకండి, జరిగితే గర్వమెక్కుతుంది.

రెండేళ్ళే కద ఇంక అని సంతోషంగా ఉండండి. మళ్ళీ మళ్ళీ తలుచుకోండి. ఈశ్వరుడు అంటున్నారు. "రెండేళ్ళు అన్నానుకాని ! తన విశ్వాసం బలమైన కొద్దీ ఇక్కడికి రావడం చాలా సులభమవుతుంది. పక్కవూరికన్న అరుణాచలం దగ్గిరౌతుంది" అన్నారు ఈశ్వరుడు.

చలం

*

19-12-52

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నంది అంటే అర్థం ఆ నంది-అంటే ఎప్పుడూ ఈశ్వరుడికి ఎదురుగా కూచుని ఆయని నించి ఆనందాన్ని అనుభవించే వాడు. నంది కనబడితే ఆనంద స్వరూపం కనపడ్డదన్న మాట. ఇది ఈశ్వరుడు చెప్పారు. ఇదినరే. కాని ఇట్లా ఎన్నో కలలు వొస్తోవుంటాయి. వాటన్నిటికీ అర్థాలు చెప్పడం కష్టం, అర్థం వుండకనూ పోవచ్చును.

ఆ వూరునించి భగవాన్ మిమ్మల్ని కదిలిస్తే భయంకర సంఘటనలు జరుగుతాయని మీరు ఎందు కనుకుంటున్నారు? ఇంతకీ మీరు ఎందుకు అట్లా

భయపడుతున్నారో తెలీదు. బహుశా మీ మిత్రురాలిని వొదలవలసి వస్తుం దనా, ఇంకే మనాన్నా? లేక కారణం లేకండా అట్లా అనిపిస్తోందా ?

మీకు మొదట్లోనే రాశాను. దేనినీ వొదలనఖ్ఖర్లేదు. వొదలడం వొదలకపోవడం మీ చేతుల్లోనే వుంటుంది. ఇంతకన్నా ఏమి రాయను? అంత స్పష్టంగా నేను రాసిన తరవాత, ఆ సందేహం మళ్ళీ ఎందుకు వచ్చిందో తెలీటంలేదు. ఆధ్యాత్మికం కోసం, ఇక్కడికి రావడం కోసం, ఆమె నే మాత్రమూ వొదలనఖ్ఖర్లేదు.

మీకీసారి చిన్నా ఉత్తరమే అయింది. ఇంతకన్నా మీకు రాయవల సింది కనపట్టంలేదు.

భగవాన్ మీపైన ఇంతదయ చూపిస్తోవుండగా మీకెందుకు ఏ భయాలైనా?

శరీరమూ, మనసూ మొద్దెక్కాయి. ఏమీ రాయలేను ఆలోచించి అందుకనే ఉత్తరం ఇంత చిన్నదీ ఆలస్యమూ అయింది. ఏమీ సందేహాలు పెట్టుకోకండి. ఇక్కడికి రావడం కోసం దేన్నీ వొదులుకోనఖ్ఖర్లేదు. మీకే ఆపదా రాబోవటంలేదు ఈమార్పు వల్ల. కష్టపడి సాధన మాత్రం చెయ్యాలి. ఆ మార్పూ బలమూ ఈశ్వరుడే ఇస్తాడు.

చలం

*

27 - 1 - 53

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. విశాఖపట్నంనుంచి ఓ మిత్రుడు వొచ్చి పదిరోజులు మాతో వుండి ఇవాళ పొద్దున్నే వెళ్ళారు. ఈ కాలంలో నేను సరైన తీరు బడి లేకుండావున్నాను. నా సాధనా, దాని ఫలితంగా-అలసటా నా కాలా న్నంతా తీసుకొంటున్నాయి. ఇప్పుడిక్కడికి వొచ్చిన మిత్రుడు, ఉద్యో గాన్ని వొదిలి, భార్యా పిల్లలతోనహా మూడేళ్ళల్లో ఇక్కడికి వొచ్చేస్తారని చెప్పారు ఈశ్వరుడు. ఒకాయన ఇక్కడే వున్నారు సాధన చేస్తో. కనక ఇప్పటికి ముగ్గురైనారు.

చింతా దీక్షితులుగారు వొస్తున్నామని రాశారు. ఆయన మీకు వినికిడిఐ వుంటుంది. ఆయనా ఇక్కడవుండబోయేవారే. ఇదంతా మీకింకా encouragement కోసం రాస్తున్నాను.

మీరు చాలా అదృష్టవంతులు, ఈశ్వరుడు మీ యడల ప్రసన్నులౌతున్నారు. మీ విశ్వాసం అట్లాంటిదీ. మీరు ఓపాట వినపడ్డదని రాశారే. ఆ పాటని మీరు పూర్తి చేస్తారనీ, అదీ ప్రసిద్ధిలోకి వొచ్చేట్టు మాట్లాడారు ఈశ్వరుడు. ఆ పాటని సౌరిస్ చాలా ఇష్టపడ్డది.

మీరు సందేశం రాసిన పాపాయికి నాలుగేళ్ళు. పేరు డాలీ. అసలు పేరు చంద్ర. ఆ చంద్ర తరవాత లేఖో, రేఖో, ఏదో వుండాలి. మరిచిపోయినాను. ఆ పాపాయి నన్ను 'నాన్నా' అని పిలుస్తుంది. కాని తక్కిన వాళ్ళు నన్ను 'తాత'గా భావిస్తారు.

బాధ్యతా, ప్రేమ కలిగిన మనుషులకి, పిల్లలు సంతోషంకన్న, వేదనని ఎక్కువ కలిగిస్తారు. కనక పిల్లల్ని కోరుకోకండి. ప్రియురాలి మీదే, మీ కంత బాధ్యతా, ఆమెభవిష్యత్తుమీద అంత Anxiety వున్నదే, శిశువనే మధురమైన బంధనం ఎంత భారమో ఆలోచించుకోండి. శిశువుని ఈ లోకానికి ఆహ్వానించినందుకు, ఇంక ఎన్నేళ్ళైనా ఆ శిశువు జీవితం మీ గుండెల మీద నడుస్తుంది.

ప్రేమించడానికి లోకమంతా శిశువులే.

అరుణాచలేశ్వరుడు తన భక్తుల్ని ఎన్నడూ వొదలడు. దాగుడుమూత లాడతాడు. భక్తులే ఆయన్ని సులభంగా మరిచేది.

చలం

*

9 - 2 - 53

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం ఇవాళ. మీకు ఆలస్యంగా జవాబు రాశాను మీ ముందు ఉత్తరానికి.

మీరేమాత్రం భయపడకండి. అసలే నేను ఏ మిత్రుణ్ణీ వొదలని మనిషిని, మిత్రులు నన్ను వదలడమేగాని. ఉత్తరానికి జవాబు రాసి తీరాలి అనేది (ఎవరికైనా సరే, ఎన్నిసార్లుఐనా సరే, పనిలేకంటా రాసినా సరే) నాకో నియమం. పైగా మిమ్మన్ని నాకు వొప్పజెప్పి జాగ్రత్తగా చూడమని ఆనతిచ్చారు ఈశ్వరుడు. చివరికి నేను లేకపోయినా నేను వొదిలినా, ఈశ్వరుడు నిరంతరమూ మిమ్మన్ని చూస్తోనే వున్నారు. సంతోషంగా కాలం గడపండి. ఏ చింతా పడవలసిన అగత్యం మీకు లేదు.

చలం

*

9 - 3 - 53

వీరేశలింగంగారికి,

ఉండుండి మీకు కొత్త సందేహాలూ, భయాలూ కలుగుతో వుంటాయి. అవును మరి.

ఇంకా కొత్త. చిన్నవారు. ఈశ్వరుణ్ణి ఇప్పుడే తెలుసుకున్నారు.

అన్నీ ఈశ్వరుడుకి వదిలి మాట్లాడకంటా వూరుకోండి. ఏదైనా ఆయన ఇష్టం అని వదలండి నిశ్చింతగా. ఎట్లాగా ఆయన ఇష్టమే జరుగుతుంది. మన ఇష్టం జరగాలని మనం ప్రయత్నించడం వల్లా ప్రార్థించడం వల్లా మారేదేమీ లేదు గాని, మనకి నిరాశా, వ్యథా, శ్రమా.

భగవాన్ని బతికి వుండగా చూడలేకపోవడం లోపమే కాని ఇక్కడ చాలామంది చచ్చిపోయింతరవాత చూడలేక పోతున్నారు. అంతకన్న అనేక వేలు బతికివుండగా, భగవాన్ని చూసికూడా, ఎవర్ని చూస్తున్నారో గుర్తించలేక పోయినారు. వాళ్ళ కన్న చాలా అదృష్టవంతులే మీరు.

సంసారాన్ని తెంచుకునే శక్తి లేదంటున్నారు. అసలు మిమ్మన్నెవరు తెంచుకోమన్నారు ? ఎందుకా ప్రయత్నం ? దాంటోంచి వొచ్చే బాధలు పడలేకనా ? అది ఏమన్నా ధీరత్వమా ? తను తెచ్చుకున్నదీ, నిర్మించు

కున్నదీ మనకి సౌఖ్యమిచ్చినన్నాళ్లేనా, మనం ఆదరించేది ? బాధ కలగ గానే తెంచుకోవాలని చూడడమా ? బిడ్డని కనేదీ, ఏడిస్తే, అల్లరిచేస్తే, తన్నేదీ-ఇంకా చాతకాకపోతే సస్యసించేదీనా ? చాలా భీరుత్వం, అపచారం అది ఎందుకు తెంచుకోవడం సంసారాన్ని ! చాలా ఘోరం ఆ పని.

మీ భార్య మీకు ఆనందమో, బాధో, ఇచ్చేది ఈశ్వరుడు, ఆ బాధని సౌఖ్యంగా మార్చుకోగల ప్రజ్ఞ మీలో వుండాలి. లేదాఅను భవించాలి. జంకకూడదు. లోకాన్నైనా అంతే. లోకాన్ని మించాలి. కాని లోకాన్ని విడిచి పరిగెత్తడం పిరికితనం.

మీ భార్య మనసు మార్చాలా ఈశ్వరుడు ? మీ పైని ఎంత ప్రేమో ఈశ్వరుడికి, మీ భార్యపైనా అంతే ప్రేమ. మీ భార్య మనసు మార్చడ మేమీ. మీ మనసు ఆమెకి అనుగుణ్యంగా ఎందుకు మార్చకూడదు ? మన కోసం ఎవరినీ ఏమీ మార్చరు. ఆ ప్రకారం లోకాన్నే మార్చాలి మనకోసం అనుకూలంగా. అంతకన్న మీ ఒక్కరిని మార్చడం సులభం. అదే ఈశ్వరుడు చెయ్యబోతున్న పని.

ప్రస్తుతం ఈ జన్మకి కొన్నేళ్ళు మీరిద్దరూ కలిసి వుండడం జరిగినా, ఎవరిత్రోవ వారిదీ, ఎక్కడా ఎవరికోసమూ ఏ మార్పూ జరగదు. జరగకుండానే manage చెయ్యడం ఈశ్వరుడికి చాతనవును. ఇదంతా ఎందుకు రాస్తున్నానంటే ఈశ్వరుడు లోకాన్ని ఎట్లా పాలిస్తున్నారో మీకు కొంత అర్థం కావడంకోసం. ఇట్లానే మనిషి తన ప్రత్యేకపు కోర్కెల ప్రకారం ఈశ్వరుడు నడిపించలేదనీ, తన ప్రత్యేకదృష్టి ప్రకారం ఈ సృష్టి నిర్మించబడలేదనీ, ఈశ్వరుణ్ణి వాదులుకుంటున్నారు.

విశాఖపట్నం నించి వొచ్చిన మిత్రుడు long leave పెట్టి విశాఖ పట్నం వొదిలేశారు. ఇంకెక్కడికో posting orders expect చేస్తు న్నాడు. పైగా నాకు ఉత్తరం కూడా లేదు అతనినించి.

అవును. సౌరిస్ ఆధ్యాత్మికంలో చాలా చివరి స్థితిలో ఉంది. ఆమెతోనే ఈశ్వరుడు మాట్లాడేది. నాతో కాదు. నాకింకా ఆ అర్హతలేదు.

ఎప్పటికో! కాని సౌరిస్‌తో మాట్లాడుతో వుండడంవల్ల నాతో మాట్లాడని లోపం నాకు కనిపించడంలేదు.

నిరంజనానంద్ చచ్చిపోయారు, మీరేమో ఆయన ఆత్మకి శాంతి కలగాలని కోరుతున్నారు. మామూలు మీటింగు పేపరు మాట అది. "ఆత్మకి శాంతి కలగాలని" ఆ మాటలకి అసలు అర్థమేమిటో యోచించండి. ఎంత మనకి తెలీదో అర్థమవుతుంది. ఆ ఆత్మ ఏమిటి? ఏమయింది? దానికి శాంతి ఏమిటి? శాంతి ఏ విధంగా కలుగుతుంది? శాంతి కలుగుగాక, అంటే ఏమైనా కలుగుతుందా? ఇట్లాంటివి.

తరవాత ఆశ్రమాధికారి ఆయన కొడుకు. ఆయన పేరు. వెం. కాని ఆశ్రమంతో దాంటో జరిగే వ్యవహారాలతో, పూజలతో మాకేమీ సంబంధం లేదు. ఎప్పుడన్నా బుద్ధిపుడితే, ఈశ్వరుడు వెళ్ళమంటే వెడతాము ఆశ్రమానికి. ఈ వూరే ఈశ్వర నిలయం. ఈ వాతావరణమే ఆధ్యాత్మిక శక్తితో ప్రజ్వలిస్తో వుంటుంది. ఈశ్వర రూపమే అరుణాచలం (కొండ) కాని ఆశ్రమంలో భగవాన్ సమాధి దగ్గిర అన్నిటికన్నా ఎక్కువగా ఈశ్వరానుగ్రహం, మనని కావిలించుకుంటుంది. అందుకని వెళ్ళి కూచుని వొస్తాము ఆశ్రమంలో. కాని ఆ మనుషులతో మాకు మాటగాని, చూపుగాని, పరిచయముగాని లేదు. ఇన్నేళ్ళకీ కూడా మాకు మేమే.

చలం

*

31-3-53

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం అందింది. అవును. బాధలు తప్పవు. ఈ బాధలు చెడ్డ కలలు. night mare. కాని ఆ చెడ్డకలలు వొస్తేతప్ప వాస్తవానికి మేలుకోము. సుఖమైన కలగా వుంటే జీవితం మనదబ్బు సోదరులమల్లే మనమూ ఆ మాయనే కావిలించుకుని కూచునేవాళ్ళం. బాధలే మనని ఇంకా గట్టిగా ఈశ్వరుడి ఆలింగనంలోకి నెట్టేది. బాధలు పడలేక, ఇంక మన శక్యం కాక, నిస్సహాయులమై, నువ్వే గతి అని ఆ పాదాల్ని పట్టుకొంటామని విడవకండా. ఆయనలో మనం ఐక్యం అయిపోయినకొద్దీ మనకి బాధలు

తెలీనూ తెలీవు. మనకి తెలీని రోజున sting మనం feel కాని రోజున సిగ్గుపడి ఆపే పోతాయి.

మొదట్లో మీ భార్యని వొదలాల్సి వొస్తుందేమోనని సందేహించి బాధ పడ్డారు. తరవాత ఆమె భారమయింది. ఎట్లా తప్పించుకోవడం అని బాధ పడ్డారు. చూశారా మనసు ఎట్లాంటి కోరికల్ని కోరుతుందో ? ఏ స్థితిలో వున్నా ఆ మనసు ఎట్లా బాధని అల్లుకుంటుందో !

ప్రతి మన ప్రార్థననీ grant చేసేది ఈశ్వరుడే ఐతేమందు మీ ప్రార్థన ప్రకారం మీ భార్యని మీకు గట్టిగా అతికించాలి. తరవాత ఆమె నించి మిమ్మన్ని తప్పించాలి. తరవాత వొంటరిగా వున్నానో అంపే, ఇంకో స్త్రీని తీసుకురావాలి. ఈ విధంగా లోక పరిపాలనా కర్త చేస్తోవుండాలి. అర్థమవుతోందా మనసు తత్వం.

ఆ స్ఫోటకం సంగతి నాకు రాయడానికి ఇంత సంకోచమెందుకు ? ముందే రాస్తే, టెలిగ్రాం ఇస్తే మీకు ఈశ్వర సహాయం లభించేది కద. ఆ బాధా తగ్గేది. దాని after effects కూడా సులువుగా పోయేవి.

మీ రూపం మీద ఎంత పట్టో మీకు ! ఈ ప్రజలకి పై రూపం ముఖ్యం. అదీ మనం అనుకునేటంత ముఖ్యంకాదు. మీ అద్దంలో ప్రతి బింబం మీకు ముఖ్యం. అది ప్రేమే ఐతే స్త్రీకి అసలు రూపం ముఖ్యం కానేకాదు. గొప్ప ప్రేమని స్త్రీని అనుభవించిన వాళ్ళకి ముప్పాతిక మందికి రూపమేలేదు. ఈశ్వరుడు మన రూపాన్ని చూడనే చూడరు. ఎందుకా దిగులు. మరి రూపం మీద అంత పట్టు మీకు వుంపే: దాన్ని వొదిలించ డానికి ఇట్లాంటివి జరుగుతూ వుంటాయి. లోకంలో అందరికీ జరగవు. కాని ఈశ్వరుణ్ణి కావాలని కోరేవాళ్ళకి జరుగుతాయి. ఇట్లా దేహం మీద బంధువులమీద ఆస్తిమీద పట్లన్నీ వొదిలితేనేగాని ఈశ్వరానుగ్రహం తెలుసుకునే యోగ్యత మనసుకి రాదు. ఈ బంధనాలన్నీ అట్లాంటివే. ఇవి వొదిలితే ఈశ్వరుడు సులభం. ఇవి వొదలకండానే ఈశ్వరుణ్ణి మనం ఆహ్వానిస్తే, ఈశ్వరుడే వాటిని వొదులుస్తారు.

పొదలించి తను ప్రవేశించ డానికి మార్గాన్ని సరిచేసుకుంటారు ఈ జబ్బే రాకపోతే. మీ రూపానికి లొంగిపోయి ఆహా, ఏం అందం అని కులుకుతో వుండేవారు మీరు. అట్లాంటి గుణం లేకపోతే, ఇట్లా కుంగి పోరు. మీ రూపాన్ని చూసుకుని ఖేద పడకండా, ఈశ్వరుడు మీదృష్టిని మీ పైరూపం మీదనుంచి తీసేసి లోపలి రూపం మీద నిలప బోతున్నారు. ఆ రూపమెంత తేజోవంతమో చూపబోతున్నారు. ఆరూపాన్ని ఏదీ వికార పరచలేదు. మీరు చేసిన అపచారమా? అపచారాలే లెక్కకి తీసుకుంటే ఎన్ని జన్మలలో ఎన్ని అపచారాలు చేశారో మీకెట్లా తెలుస్తుంది? కర్మా, పాపము అనేవి అర్థం వున్నట్టుగా తీసుకుంటే, వాటి అర్థం వుంటుంది. వాటిని మరిచిపోతే వాటికి అర్థమేలేదు. కర్మా ఈశ్వరుడే. ఆయననుమించి ఏదీలేదు. ఈశ్వరుడు మనసునించి తొలగినప్పుడే కర్మా, గ్రామదేవతలూ పైకివొచ్చి భయపెడతారు.

ఏ దేవతలూ, ఏ దెయ్యాలూ వున్నా, అన్నీ ఈశ్వరాధీనమే. ఈశ్వరాజ్ఞ లేకండా ఏదీ జరగదు ఇంక వాళ్ళు వుంటేనేం లేకపోతేనేం? మనని సుఖవంతులుగా చెయ్యాలంటే ఈశ్వరుడే చెయ్యగలరు, దేవతలు చెయ్యడమెందుకు?

ఆయన ఇష్టానికి వ్యతిరిక్తంగా ఏదీ జరగదు. మీకు స్ఫోటకం వొచ్చిందంటే అది ఆయన అనుమతితోనే జరిగింది. అది ఆయన ప్రేమ గానూ, ఉపకారంగానూ చూసుకోగలగడం మీరు నేర్చుకోవాలి?

హాని చేసే మనుషులు లేరూ ప్రపంచంలో! ఇంక దేవతలుంటే నేం? హాని చేసే మనుషులు ఎవరా? మీరూ నేనూ. మనవల్ల ఎంతమందికి హానీ, కష్టాలూ జరుగుతున్నాయో యోచించండి. మనుషులకే కాదు, మృగాలకీ, కీటకాలకి, వృక్షాలకీ, గడ్డికి.

నేను Councils కీ, సభలకీ ప్రసంగాలకీ, ఎప్పుడూ చాలాదూరం, ఇప్పుడు మరీనీ. నేను కాదు. తిరువన్నామలైలో తప్ప మీరు నా పేరు ఎక్కడ విన్నా నేను కాదనుకోండి.

సాహిత్యం బాధల్ని మరిపిస్తుంది కాని, నా సాహిత్యం మరిపించదు. మీరన్నట్టు అది తోవ వెతుక్కునే వెలుగునే ఇస్తే తోవంతా బాధలే. కదలని వాళ్ళకే సుఖం, కదిలితే బాధలే.

మీరు హైస్కూలికి వెళ్ళాలని అంటున్నారు. ఆ విషయమై ఈశ్వరుడి ఉద్దేశ్యం తెలీదంటారేమిటి? మీరు వెళ్ళకూడదనే. అందుకనే వెళ్ళలేదు ఎంత ప్రయత్నించినా. ఈశ్వరుడిలో విశ్వాసం వుంటే యీ సదుపాయాలు జరుగవా అంటున్నారు మీరు. సదుపాయాలు జరుగుతోనే వుంటాయి. కానీ మీరు కోరే సదుపాయాలు జరుగవు. ఆ బేరం బుద్ధి మానుకోవాలి.

నేను నీకు ఇంత విశ్వాసాన్నిస్తాను. నాకిన్ని సదుపాయాలు చేసి పెట్టు ఉద్యోగమైతే పది టెంకాయలు కొడతానన్న బేరంలాగే వుంటుంది. టెంకాయలుగాని, చివరికి విశ్వాసంగాని ఈశ్వరుడికి అవసరమైనట్టు. విశ్వాసం మనని ఉద్ధరించుకోడం కోసం, ఈశ్వరుడి కోసం కాదు. నిజమో కథో ఇది——

"కొడుకు చచ్చిపోయినాడుకదా నీకు, ఇంత పూజ చేసేవాడికి? ఇంకా ఈశ్వరుడిలో విశ్వాసం పోలేదా?" అంటే ఆయన "పోయిన కొడుకు పోనే పోయినాడు. కొడుకునేకాక, నా ఈశ్వరుణ్ణి కూడా వొదులుకోనా?" అన్నాడట.

ఆ హైస్కూలికి వెళ్ళింతరువాత్త అక్కడ బాధలు వొస్తే, మళ్ళీ ఇంకో చోటికి మార్చమనరా?

ఇట్లాంటి బేరాలు మామూలు మనుషులకి, మనకి కాదు. ఏ ఉద్యోగంలో, ఎక్కడ, ఎట్లా వున్నా ధీరంగా ఈశ్వరుడిలో నిలబడగల శక్తికి మనని తయారు చేస్తున్నారు. కష్టాలనించి తప్పించమని కాదు ప్రార్థన. వొచ్చాక కష్టాలను నిర్లక్ష్యంగా ఓర్చుకునే శక్తి నిమ్మని. కష్టమే. కానీ కష్టపడందీ ఏదీ రాదు. సులభంగా వొచ్చేవి విలవేలేవు. మరిచిపోకండి. "ఈశ్వరుడిలో విశ్వాసం వుంచే నాకు" అంటున్నారు. అదేం విశ్వాసం?

ప్రతిదీ ఆయన చూస్తున్నారనీ, ఏది ఎప్పుడు జరగడం మీకు శ్రేయస్సో అది జరుపుతున్నారనీ గ్రహించకపోతే ఇంక విశ్వాసమేమిటి? ఓ ఈశ్వరుడున్నారు అనుకోడం విశ్వాసమా? భగవాన్‌కి దయవుంది. మనం అనుకున్న ప్రకారం జరపకపోతే అది దయలాగు కనిపించదు.

ఆ మాటలకి భగవాన్ కోప్పడతారేమోనని రాశారు అయన కోప్పడలేదు. నా ఉత్తరంలో ఏమన్నా కోపమో దండనో వుంటే అది నాదీ. ఆయన ఏమీ కోప్పడలేదు.

అవును. పాపం. అవస్థలు పడుతున్నారు, ఎంతైనా ఇంక రెండేళ్ళ లోపునేకద! తరవాత గొప్ప సుఖం రాబోతోంది. దూకేవాడు కిందికి వొంగి మరీ దూకాలి కద!

వోపిక పట్టండి. మౌనంగా సహించండి. ఈశ్వరుడు వెయ్యి కళ్ళతో చూస్తున్నారు మిమ్మల్ని.

చలం

*

1-5-53

వీరేశలింగంగారికి,

మీ కార్డు. దిగులు పడకండి. ఈశ్వరుడు వుండగా మీకు వొచ్చిన భయం ఏమీ లేదు. ధైర్యంగా వుండండి. ఈశ్వరుడు విభూది పంపు తున్నారు. యీ విభూతిని కొంచెం నోట్లో వేసుకుని కొంచెం నుదుటి మీద పెట్టుకోండి.

తరుచూ చెయ్యండి ఆ పని.

త్వరలో నయమౌతుంది. ఏమీ భయపడకండి. మీరు మామూలుగా చేసుకునే వైద్యం చేయించుకోండి.

ఆహారం - ఉప్పూ, కారం, పులుపూ పనికిరావు.

అన్నం ఉడికే చిట్టుడుకు నీళ్ళల్లో వేసుకుని తాగండి. పాల whey- అంటే పాలు విరక్కొట్టిన నీళ్ళు (పాల కుదపలు లేకుండా) తాగండి. ఇది తప్పకండా తాగండి.

చలం

*

3-5-53

వీరేశలింగంగారికి,

మీ వాళ్ళు నయం కాగానే మిమ్మన్ని ఇక్కడికి ఓసారి రమ్మ న్నారు ఈశ్వరుడు.

ఈ కార్డు అందేటప్పటికి మీకు నయమైవుంటుందనుకుంటున్నాను.

చలం

*

16-5-53

వీరేశలింగంగారికి,

మీ దగ్గిర్నించి ఉత్తరంలేక మీరు ఎట్లావున్నారో తెలీక నేనే రాద్దామనుకుంటున్నాను రెండురోజులనించి. మీ ఉత్తరం రాకపోతే ఇవాళ నేను మీకు రాసేవాణ్ణి. ఇంతకుముందే మీరు నాకు రాసి వుండవలసింది, మీకు కొంచం నయం కాగానే, మీకు ఎట్లా వుందోనని మేము ఆదుర్దా పడతాము.

విభూతి పంపుతున్నాను. ఈశ్వరుడు వెంటనే పంపమన్నారు. త్వరలో సరైన ఆరోగ్యం వొస్తుంది. పత్యంజాగ్రత్త పత్యం చెయ్యక పోతే మళ్ళీ తిరగ బెడుతుంది. కారం పులుపూ అజీర్ణం వొస్తువులూ పనికిరావు. కారం ఏ మాత్రం దగ్గరికి చేరకూడదు.

ఇదివరకే రాశాను మీకు ఎన్నిసార్లో! ఈశ్వరుడు ప్రేమమయుడు. ఎవరినీ శిక్షించరు. శిక్ష అనేది ప్రపంచంలో లేదు. అదంతా శిక్షణ.

ఈ బాధ punishment కాదు. dicipline లేక correction లేక trininag for better life, for improvement.

పూర్వ జన్మలోనో ఈ జన్మలోనో మనం చేసిన దుర్మార్గానికి బాధ పర్యవసానం. ఆ బాధ పడడంవల్ల ఆ దుర్మార్గగుణం మనలో అంత రిస్తుంది. మనమే మనని శిక్షించుకుని, మనని బాగు చేసుకుంటాము. అది మన నైజం. ఎవరూ ఏ శిక్షా విధించటంలేదు మనపైని. దుర్గుణం కుదిరే దాకా బాధలు తప్పవు.

ఇంత cool గా explaian చేస్తున్నాను కాని, మీ బాధ ఎంత బాధో నేను feel కావటం లేదనుకోకండి. నేనైనా ఇంతవరకు బాధకి reconcile కాలేదు. Reconile అయితేనే గాని బాధ భరించటం రాదు అంటారు ఈశ్వరుడు. బాధనీ కర్మ మార్గాన్ని తప్పించరు ఈశ్వరుడు. తప్పిస్తే బుద్ధిలేని తలిదండ్రుల గారాబపుపిల్లలు మల్లేనే తయారవుతాము మనం. కాని ఈశ్వరుడిలో విశ్వాసం వున్న కొద్దీ troubles మనని బాధించడం తగ్గుతుంది. దిక్కూ మొక్కూ లేని, అర్థంలేని, దరి దాపూ లేని బాధ పడడం వేరు. ప్రతి బాధతోనూ అవతల గట్టుకి దగ్గిరౌతున్నా మని మనం పడే ప్రతి బాధతోనూ బాధపడే ఈశ్వరుడు ప్రతి నిమిషం మనని కనిపెట్టి వున్నారనే విశ్వాసంతో బాధపడడంవేరు. దెబ్బ తగిలితే వొచ్చే బాధ వేరు. వ్యాయామంలో మనకి మనం పడే బాధవేరు. ప్రేమించే పిల్లని శిక్షించి, ఆ శిక్షనంతా తనే అనుభవించే తండ్రిని ఆలో చించుకోండి. మనం మనపైని విధించుకున్న బాధనే అంత దయతోనూ అనుభవిస్తారు ఈశ్వరుడు. ఇదంతా నా మనసుకి తడుతున్నవి, నాకు పూర్ణంగా తెలిసిన సంగతులు కావు నేను రాస్తున్నవి.

మీరు చేసిన పాపం ఏమిటో ఎందు కిప్పుడు? తెలిసి ఏం ప్రయో జనం? అట్లాంటి పాపం చేశామనే అనో దిగులా, ఉన్నదిచాలక! వెనక సంగతి ఎందుకు ముందుసంగతి యోచించాలి గాని!

మీరేమంటారో, మిమ్మల్ని పరీక్షించడానికి ఇక్కడికి నిమ్మల్ని రమ్మన్నారు ఈశ్వరుడు. అంతేకాని, మీ పరిస్థితులు తేలీకకాదు. రావ

జానికి మీ సంసిద్ధతకు సంతోషించారు. మీరిప్పుడు రానక్కర్లేదు. మీరు రావలసిన నిమిషాన అన్ని పీఠ్యా కలగచేసి ఆయనే రప్పించుకుంటారు.

ఏ సంగతీ నాకు రాయడానికి సిగ్గెందుకు? నాకు కాదు మీరు రాస్తున్నది ఈశ్వరుడికి.

డిశ్పెంట్రీ సంగతి మీకు తెలీదు. మీకు తేలికగా పోయిందన్న మాట. అది ఏళ్ళకి ఏళ్ళువొదలదు. జాగ్రత్త పత్యంగా వుండండి. కారం తినకండి.

దిగులు పడకండి. ఈశ్వరుడు చూస్తున్నారు మిమ్మల్ని చాలా కొద్ది కాలమే మీరే బాధపడ్డా. అదృష్టవంతులు. చిన్నతనంలోనే మీకు ఈశ్వరానుగ్రహం దొరికింది.

నేను నా జీవితమంతా, ఏమేం పడ్డానో మీకు తెలిస్తే మీవి ఒక బాధ లనడానికి సాహసించరు మీరు. కాని ఏబాధ కాబాధే. ఎవరికి వాళ్ళ బాధలు అంత ఎక్కువ. ఒకరి బాధ ఇంకొకరికి సహాయం చెయ్యదు.

ఇవన్నీ ఈశ్వరానుగ్రహంలో కరిగి పోయేనాటి వరకే! మీ మాటలూ మీ వోదార్పులూ, మీ ఉత్తరాలూ-

చలం

*

8-6-53

వీరేశలింగంగారికి,

ఏమిటి మీ దగ్గిర్నించి ఉత్తరమేలేదు. ఎట్లా ఉన్నారు? మీ ఆరోగ్యం ఎట్లా వుంది? వెంటనే జవాబు రాయండి.

చలం

*

వీరేశలింగంగారికి,

అవును. మీరు ఉత్తరం రాయకపోవడం క్షమార్హంకాదు. కాని ఇక్కడ మీ ఉత్తరాలని స్వీకరించేదీ, క్షమా సముద్రుడు, ఈశ్వరుడు.

పెద్ద ఉత్తరానికి బద్ధకించవొచ్చు. ఎన్ని నెలలైనా ! కాని ఒక కార్డులో "బావున్నాను. మెల్లగా పెద్ద ఉత్తరం రాస్తాను" అని అయినా రాయలేక పోవడాన్ని నేను బద్ధకమనను. దానికి గట్టి పేర్లే పెటతాను, నేనైతే. కాని నే నేముంది ? ఈశ్వరుడు చేతిలో కలాన్ని "అశ్రద్ధ" అనే ఒక్క మాటలో పోదు. అశ్రద్ధకి కారణ మేమిటో, దేనిమీద శ్రద్ధ వుండదో ఆలోచించుకోండి. ఇది మీ కళ్ళు విప్పడానికి రాస్తున్నాను కాని, మీపైని కోపించి, బాధించడానికి కాదు. ఎవరిని ఉద్ధరించడానికి బతకడం అవి అడుగుతున్నారు. ఎవరినుద్ధరింఛానికి ? మిమ్మన్ని ఉద్ధరించుకోడానికే. ఎవరిని ఉద్ధరించగలం, ఉద్ధరించాలని పూనుకున్నా. మామూలు మనుషుల యోచనలు మానెయ్యండి. ప్రతి మాటకీ అర్థం యోచించుకోండి. ఎవరినీ ఏమీ ఉద్ధరించలేమని పూర్తిగా తెలిసి, ఉన్న భారాలనే ఈశ్వరుడికి వప్ప చెపుతున్నారు బుద్ధిమంతులు. ఉద్ధరించ పూనుకోడమంటే భారాన్ని నెత్తి మీదికి తీసుకోడం. మీరే ఇట్లా ఏకాకిగా నిలిచి ఇంకా భారాలుకూడానా ? అవి లేకపోవడం గొప్ప అదృష్టం. అందరూ మిమ్మన్ని వొదిలారంటే, వాళ్ళు మీకో మహోపకారం చేశారన్నమాట. వాళ్ళే వదలక వాళ్ళ బంధనాలే ఇంకా వుంటే మీకి అరుణాచలం దృష్టిలోకి వొచ్చేది కాదు. వొచ్చినా, మీ ప్రియ బంధువులూ, మిత్రులూ సందేహాలు రేపి బంధనాలు ఇంకా బిగించే వారు, ప్రస్తుతం నా మిత్రులకి జరుగుతున్న పనే అది. ఇక్కడికి వొచ్చి వుండాలంటే వొదలరు, ఇన్నాళ్ళ సహాయంచేసిన బంధువులు.

ఈశ్వరుడి మీద విశ్వాసం వుంటే, దుర్గుణాలూ, దుర్మార్గాలూ ఏమీ చెయ్యలేవు. అవే పూడిపోతాయి మనకి తెలీకండానే. 'అక్షరాభిషేకం' అనే పుస్తకం నాకూ ఒక కాపీ పంపారు. చెప్పతలుచుకున్నదేదో నిర్భయంగా if లూ but లూ ever so లూ లేకండా సూటిగా చెప్పేవాడు ఆయన.

ఆ ఫోటో ఇప్పుడు నా రూపానికి చాలా దూరమనుకుంటాను.

చలం

16-7-53

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీకిదివరకు ఓసారి రాశాను- నా వొళ్ళు బావుండక పోవడం - నేను చేసే సాధనలో పుట్టే అలసటవల్లా, వేడి వల్లా, అంటే దినదినమూ ఇన్నేళ్ళల్లో కూడబెట్టుకున్న కల్మషం వొదిలిపోయి, ఆరోగ్యం వొస్తోందని. ఈశ్వరుడి చేతుల్లో మెలుగుతున్న మాకు ఏ కష్టమూ రాదు.

నేనిప్పుడు రాయనూ లేను. రాసినా, రాసేది ఎవరికీ అక్కర్లేదు, పత్రికలు అచ్చూ వెయ్యవు. నన్ను నిజంగా నమ్మిన వారుంటే, అంటే నేను మోసపోననీ, మోసపుచ్చననే నమ్మకం వున్నవాళ్ళుంటే వాళ్ళు నేనేమి తెలియ చేసినా నమ్ముతారు మీకుమల్లే. అట్లాంటి వాళ్ళు ఎందరున్నారు ? వాళ్ళకి నచ్చింది చెప్పినన్నాళ్ళు 'ఓహో' అన్నారు. అచంచలమైన విశ్వాసమున్న ఏ పదిమందో నాతో సంబంధం పెట్టుకునే వున్నారు. అవును ! ఇక ముందు నేనేం రాయాలో, ఎప్పుడు రాయాలో, అక్కర్లేదో అంతా ఈశ్వరుడి హస్తాల్లోకి వెళ్ళిపోయింది.

మీ శరీర మనో ఆరోగ్యాలు బావున్నాయనుకుంటాను.

చలం

*

7-8-53

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. సంసారమంటే, మీరూ మీ భార్యే కదా ? బంధువులూ మిత్రులూ మిమ్మన్ని వొదిలేశారు కదా ! మీ ఇద్దరికే అంత తొందరలు వొచ్చి పడుతున్నాయా ? పాపం !

మిమ్మన్ని పరీక్షలకి చదవమని మీ మనసు నిశ్చయిస్తోందని రాశారు. అంత నిశ్చయమైన దాని విషయమై ఇతరుల్ని, ఈశ్వరుణ్నైనా, ప్రశ్నించవలసిందిలేదు. మనకు నిశ్చయంకానివే, ఈశ్వరుణ్ణి అడుగుతాము.

ఈశ్వరభక్తుడి మనసు తానే నిశ్చయించుకోదు. ఈశ్వరుడికే వొదులుతుంది. పైగా మీ మనసు ఆదేశిస్తోందికూడాను. అట్లాంటప్పుడు ఎవరు వొద్దన్నా వినదు, వినకూడదు. సరే కానీండి. ఇంతలో పోయిందేముంది ? కొంత డబ్బూ, శ్రమా !

మీ మనసు అంత దృఢ సంకల్పంనించి తప్పుకుని, ఈశ్వరా ఏమీ ఆజ్ఞ ? అన్నప్పుడే ఈశ్వరుణ్ణి అడగండి. ఎందుకంటే ఒకవేళ ఈశ్వరుడు ఆ ప్రయత్నాలు మానుకోమంటే మీ మనసు చాలా ఖిన్న పడుతుంది. ఈశ్వరాజ్ఞని ఏ పరితాపమూ లేకంటా సంతోషంగా స్వీకరించ గలిగినప్పుడే ఈశ్వరుణ్ణి సమీపించడం. అంతేగాని ఓ ఉత్తరంతో ఈశ్వ రుడి ఉద్దేశ్యం ఎట్లా ఉంటుందో, చూద్దాం, ఆ సంగతి కూడా తెలుసు కుంటే పోయిందే మున్నది ? అనే పద్ధతిలో రాసి ఈశ్వరుణ్ణి చవక చేసు కుంటే మీకేనష్టం.

ఈశ్వరుడు ఏ ఆజ్ఞ ఇవ్వాలని మీకు ఉన్నదో మీ ఉత్తరంలో తెలుస్తోనే వుంది. ఇదివరకటి ఉత్తరాలూ, ఈశ్వరుడు ముఖ్యమైన విషయా లుగా చెప్పినవి జాగ్రత్తగా చదివి చూసుకుంటే ఆయన ఉద్దేశ్యం మీకే వ్యక్తమవుతుంది. ఆశ కళ్ళకి కప్పినప్పుడు ముందు వున్న వెలుగే కన పడదు.

ఇంతకీ ఈశ్వరుడు ఎట్లా చెపితే అట్లా చేస్తానన్నమాట మీ ఉత్త రంలో లేనేలేదు.

చలం

*

21 _ 8 — 53

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నేను రాసింది అర్థం చేసుకోకంటా, మళ్ళా అవే ప్రశ్నలు వేస్తున్నారు మీరు. మిమ్మన్ని పరీక్షలకి చదవవొద్దని ఎవరూ అనలేదు. మీ మనసు అట్లా ఎందుకు అంటుందో మీ మనసే చెప్పాలి గాని, ఈశ్వరాజ్ఞ ఏమున్నదీ దీంటో! ఈశ్వరుడు మీకే ఆజ్ఞా పెట్టలేదు.

పెట్టరు. ఎదన్నా సందిగ్ధంలో ఉన్నపుడు అడిగితే సలహా ఇస్తారు. ఆయనకి మన పైని ఉన్న ప్రేమవల్ల. 'మామూలు స్వల్ప కోరికలు' ఉండడంలోనూ ఏమీ తప్పులేదు. లోక సంబంధాలు వొదలవు, ఒక పట్టాన.

చదివే ప్రయత్నాలు మీకు మంచివా, చెడ్డవా? అని అడుగు తున్నారు. చదువులో పరీక్షలలో మంచి ఏముంది? చెడ్డఏముంది? అర్థ మేమిటి? అట్లాంటి ప్రశ్నలకి.

ఈశ్వరాజ్ఞ ఎట్లా వుందో తెలుసుకోమంటారు.... ఏ విషయమై? ఇంకా స్పష్టంలేదు మీ మనసులో.

ఈశ్వరానుగ్రహం ఎవరిమీదా, ఎప్పుడూ తప్పిపోదు. మనమే దూరమౌతో వుంటాము, మన కోరికలతో. ఈశ్వరుడు ఏమంటున్నారు? ఏమీ అనటంలేదు. అనవసరంగా ఏదో ఒకటి అంటో వుండరు.

మనం ప్రశ్నలతో సమీపించేది ఈశ్వరుడని మరిచిపోకూడదు. ఆయని జ్యోతిష్కులు కారు. మన కోర్కెలవల్లా చెల్లింపుల వల్లా, మనం ఆయనని ఏమీ తిప్పుకోలేము. ఆయన తలుచుకుంటేనే గాని ఆయన నించి ఒక్కమాటని తెప్పించుకోలేము.

ఆయన అందరి యెడలా ప్రసన్నులే ప్రసన్నులని మనంప్రశ్నించి నప్పుడల్లా జవాబు చెప్పరు, ఆయన అవసరమని తోస్తేనే తప్ప. మీకు విజ్ఞాన మిమ్మంటున్నారా? అదెట్లానూ ఇస్తారు. మీరుపడే బాధలేమిటి? ఆయన విజ్ఞాన మివ్వడమే. మంచి మాటలతో బుద్ధి తెచ్చుకోకపోతే, బుద్ధితెప్పించే మార్గం ఆయనకి చాతకాక పోలేదు. లోకంలో బాధలన్నీ ఏమిటి?

ఈశ్వరుడి పైని మీభక్తి సంగతి మీరు రాశారే, అదంతా నిజమేనని తనికి తెలుసునని చెపుతున్నారు ఈశ్వరుడు. అట్లాంటి భక్తి పట్టావుండ బట్టే, ఈశ్వరుడికి ఆప్తులైనారు మీరు. మీకు తెలీక ముందే; అప్పుడే తెలుసును ఆయనకి, మీరు ఆయన భక్తులని. ఎన్ని జన్మలనించి ఆయన

పైపు మీరు వెతుక్కుంటో చేస్తున్న progress ఆయన ప్రేమతో **watch** చేస్తున్నారో!

మీ మనసు స్పష్టం చేసుకోండి.

ఈశ్వరుడి పైన భారం వేయండి.

ఆయనే నడుపుతారు. కాని మనం ఇష్టపడే పనులు ఆయన చేయిస్తున్నారనే, భక్తులు చాలామంది పడే పొరబాటులో పడకండి. ఈశ్వరుడి మాట శిరసావహించ తలుచుకున్నప్పుడే ఆయనని ప్రశ్నించండి. అంతే గాని ఏమంటారో, అదీ చూద్దాం అన్నట్టు సమీపించకండి ఆయనని.

చలం

*

14 - 9 - 53

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మంచి నిశ్చయానికి వొచ్చారు. త్వరలో ఉద్యోగం వొదిలేసి మీరిక్కడికి చేరుకొంటారని ఈశ్వరుడు చెప్పిన తరవాత, ఆ పరీక్షలు ఏం వుపయోగం మీకు? మరి ఈశ్వరుడి మాటలో నమ్మకం వున్నట్టేనా ఆ ప్రయత్నం?

అవును. ఈ ఆధ్యాత్మిక సాధనలో ఇట్లాంటి పరీక్షలు ఎన్నో జరుగుతాయి. ఇక్కడికి వొచ్చిందాకా ఎందుకు? మీకు అక్కడేసాధన ప్రారంభమయి జరుగుతోందన్నమాట. ఈశ్వరుడి ఆజ్ఞకి ఎదురు తిరగడం మానవ స్వభావం. మీరన్నట్టు ఈశ్వర సహాయం లేందీ, మన మనసునీ దానికోరికల్నీ జయించలేము.

ప్రశ్నలు వేసినందుకు చిరాకు రాదు. కాని స్పష్టంగా తెలుస్తున్న దాన్ని కప్పిపుచ్చుకొని చూడ్డం ఇష్టంలేక ఏవోముసుగు పెట్టి, ఆ కోర్కెల్ని నేనుగాని, ఈశ్వరుడుగాని, సమర్థించాలని ఎట్లాగో అంగీకారాన్ని సంపాయించాలని చూస్తే, కొంత ఆగ్రహం వొస్తుంది. అతని మనసేమిటి,

మన మనసూ ఇట్లాంటి జిత్తులే చేస్తుంది కదా! అని నవ్వేస్తే ఆకాస్తకోపం పోతుంది.

మీకూ, మీ ప్రేయసికి ఇద్దరికీ ఒక రాత్రే అట్లాంటి కలలు రావడం, ఈశ్వరానుగ్రహం మీ మీద గట్టిగా పనిచేస్తోందని తెలుపుతోంది. మీ మూలాన మీ భార్యలో కూడా ఎంత భక్తి ప్రబలుతోందో చూడండి.

బోధించ వలసింది తెలుస్తోనే వుంది ఆ కలలో. పర్యవసానం మీ మనసు మారడం. దివ్యదర్శనం. అంతకన్న తెలుసుకోవలిసింది ఏముంది?

అసలు ఈశ్వరుణ్ణి ప్రశ్నించ నక్కర్లేదుకూడాను. ప్రతి నిమిషం ఆయనే నడిపిస్తున్నారని, నిర్ణయిస్తున్నారని తెలిసిన కొద్దీ ప్రశ్నలు వెయ్యము. కాని దూరాన వుండడంవల్లా, ఏ పరిస్థితిలో ఆయన ఆజ్ఞ ఎట్లా వుంటుందో తెలీకపోవడంవల్లా ప్రశ్నించవలసి వస్తోంటుంది మీకు.

ప్రతి సందేహాన్ని తీర్చుకోండి. ఈశ్వరుణ్ణి అడగండి ఏమి చెయ్యాలని. కాని ఆయన ఆజ్ఞ ప్రకారం నడుచుకోండి.

ఈశ్వరాశీర్వచనాలతో

చలం

*

17 - 10 - 53

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం వొచ్చి వారంపైగా అయింది. జవాబు రాయవలసిన విషయాలు ఏమీలేక రాయలేదు. అన్ని సత్యాలూ మీరే తెలుసుకున్నారు. మీరు రాసిన విషయాలు నాకే బోధకరంగావుంటే నాకు రాసేందుకు ఏముంది ? ఆ విధమైన మనోనిశ్చయంతో విశ్వాసంతో వుండడం గొప్ప అదృష్టం.

మిమ్మల్ని త్వరలోనే ఇక్కడికి ప్రయాణం చేయిస్తానంటున్నారు ఈశ్వరుడు. వొచ్చే వేసవిలో జరగవచ్చు. హాయిగా అట్లానే వుండమని.

ఈశ్వరాశీర్వాదంతో

చలం

*

6-11-53

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరు రాస్తున్న గొప్ప వాక్యాలు నాకేమిటి ? మీకేమిటి ? ఒకరి కొకరు నిరంతరం జ్ఞాపకం చేసుకోవలసినవే. మీ కళ్ళు తెరిచింది ఈశ్వరుడు. నేనెక్కడ ? అక్షరాలు మాత్రం నావి. డాక్టరు రంగనాయకమ్మగారు ఏ ఆసుపత్రిలోనూ ఇటువేపుల ఉద్యోగం చెయ్య లేదు. ఆ రంగనాయకమ్మగారు ఎవరో ఇంకో పుణ్యాత్ములు. ఆమె నా వొదినగారు, భార్యకి అక్కగారు. ఆమే మమ్మన్నందరినీ పెంచి పెద్దల్ని చేశారు.

చప్పున ఏదో జరుగుతుందనే ఆశ పెట్టుకోకండి. చాలా సాధన చెయ్యాలి, చాలా దూరం నడవాలి గర్భాలయం చేరుకోడానికి.

చలం

*

1-12-53

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరు సౌఖ్యంగా ఉన్నారంటే, చాలా సంతోషంగా వుంది. కష్టాలు వొచ్చినప్పుడుకూడా ఈశ్వరుడి పాదాలు వొదలకపోతే, ఆ హృదయంలో ఈశ్వరానుగ్రహం ఇట్లానే ప్రవహిస్తుంది. ఆ విశ్వాసం చెదరకండా బోధ చెయ్యడమే హితుడి ధర్మం. అందరం ఆరోగ్యంగా వున్నాము. ఫొటోలు లేవు. ఈమధ్య ఒకరు మా అందరికీ Group snap తీశారు. ఆ తాలూకు కాపీలు మా చేతికి వొస్తే మీకు పంపిస్తాను. కాని

సందేహం. అవును. ఆ elctric record ఇచ్చి రెండేళ్ళ పైన అయింది. నా వాక్కు స్పష్టంగా పడలేదు. వాళ్ళ దగ్గిర ఇంకా కాపీలు వుంటాయా? వున్నా పంపుతారా?

మ్యూజింగ్స్ అచ్చు కావడానికి ఇంకా కనీసం ఒక ఏడాది పడుతుందేమో. విజిలీ వాళ్ళ పుస్తకాలు మీరు చూశారా? ప్రస్తుతం బిడ్డల శిక్షణ అచ్చుకు వెళ్ళింది.

ఎంతాకాలంలో మీరు రావడానికి వీలు అవుతుందనే చెపుతున్నారు ఈశ్వరుడు.

చలం

*

1-1-54

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరమూ కార్డూ, మీరు సుఖంగా వున్నందుకు సంతోషం. మీ గీతాన్ని ఈశ్వరుడు మెచ్చుకున్నారు. ఆపాటని పలికించింది మీ భక్తే. ఆశ్చర్యమూ సందేహమూ ఏమివుంది దాంటో! రేడియో వాళ్ళు నాకు తెలీదు.

అయినా వాళ్లెందుకు ప్రచురిస్తారు నా వ్యాసాల్ని!

నా దగ్గిరవున్న కాపీలు చించేశాను ఎప్పుడో! అవి వున్నా వాటిని ప్రచురించే పత్రికలు నాకు తెలీవు.

నే నెప్పుడు ఏ పత్రికనీ నేను రాసినవి ప్రచురించమని కోరలేదు.

నేను ఇంకా అనుకొంటున్నాను. musings ఏడాదిలో అచ్చు కావొచ్చునని.

బిడ్డల శిక్షణ ఇంకో ఆయన అచ్చు వేస్తున్నారు. విజిలీ వాళ్ళు నావేమీ ఇంక అచ్చువెయ్యడంలేదు, పుస్తకాన్ని తీసుకున్నారు అచ్చు వేస్తామని. తరవాత ఏమయిందో నాకు తెలీదు.

నేను రాశాను కదూ ఆ ఫొటో మీద ఆ ఒక్క ఆమె తప్ప తక్కిన వాళ్ళందరూ నా కుటుంబమే అని.

రంగనాయకమ్మగార్లు ఇద్దరు. ఒకరు చచ్చిపోయినారు. చిత్ర మా అమ్మాయి.

అవును మీకు సందేశం పంపింది శాలీ ఏ. అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

6-2-54

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీ వ్యవహారాలు కూడా అనుకూలం చేస్తున్నారు ఈశ్వరుడు. అదృష్టవంతులు. మీరిక్కడికి రావడానికి అన్ని అనుకూలాలు ఏర్పాటవుతున్నాయి.

ఈశ్వరుడే మీ జీవితంలో రాకపోయినట్టయితే, మొన్న జరిగిన కఠిన పరీక్షలో ఎటు మొగ్గేవారో మీరు. డబ్బూ, పెళ్ళీ, వీటిని నిగ్రహించ గల వారెందరు ? మీ నైతిక విజయానికి మిమల్ని congratulate చేస్తున్నారు ఈశ్వరుడు.

ఇట్లా జీవితాన్ని సత్ నియమబద్ధం చేసి మామూలు ప్రపంచపు విలువల్ని వృత్త గడ్డికింద తోసేసే, అనామకులైన ధీరుల్ని, ఏ పత్రికలూ, ప్రభుత్వాలూ గుర్తించక పోవచ్చునుగాని, వారిలో వుండే వెలుగూ, వారి అంతరాత్మలో వెలిగే ఈశ్వర సౌందర్యం ఎవరికి అర్థం కావు: ఎంతో దూరంగా నైనాసరే !

ఇదంతా మీ భార్యగారి సుకృతం, మీవంటి పురుషుడు ఆమెకి తటస్థించడం. మీ పురోభివృద్ధికి ఆమె అనుకూలించ వలసిన రోజువాస్తే

ఆమె జ్ఞాపక ముంచుకోవాలి. ఆమెకి ఈశ్వరుడు ఈనాడు చేసిన సహాయం ఆరోజు ఆమె ఈశ్వరుడికి సహాయం చెయ్యాలి, ధర్మపత్నికింద ఈశ్వరుడి ముందు నిలబడాలంటే.

ఇంకా మూడు నెలలన్నమాట మీరిక్కడికి రావడం. మానసికంగా ఇప్పటినించి ఆ వొచ్చే ఆనందాన్ని పొందండి.

చలం

*

26-2-54

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఇక్కడికి రానీండి మీభార్యా ఎంతమారిపోతారో. శివరాత్రికి మద్రాసు నించి ఓ బృందం కవులూ, వారూ, ఈశ్వర దర్శనానికి మా అతిథులుగా రాబోతున్నామని రాశారు. ఆ రోజు గిరి ప్రదక్షిణం పెట్టుకున్నాము, వాళ్ళతో చాలామందిమి ఈశ్వర భజన చేస్తో.

విభూది నోట్లో ఒక్క రవ్వ వేసుకోండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

8-3-54

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం ఇవాళే. మీరు వొస్తున్నారంటే సంతోషం, మీతో ఇంకెవరు వొస్తామన్నా తీసుకురండి.

మద్రాసునించి ఇద్దరు కవులూ (రేడియోవారు) ఒకరు పాటకులూ (రేడియోవారు) వారి కుటుంబమూ వొచ్చారు. వారూ, మేమూ, ఇంకా ఒక వందమంది భక్తులూ కలిసి భజనచేస్తో గిరి ప్రదక్షిణ చేశాము శివరాత్రికి. చాలా బాగా జరిగింది.

విదేశాలనించి వొచ్చినవారు ఒకరిద్దరు ఇక్కడే స్థిరంగా నిలిచి పోయినారు. ఇంకా ప్రతి సంవత్సరం ఓ అయిదారుగురు వొచ్చి పోతూ వుంటారు. అంతా బావున్నాము.

ఇవాళే తెనాలి నించి సూర్యనారాయణగారనే (భక్తులూ, మిత్రులూ కవీ, గాయకులూ,) ఆయన వొచ్చారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

23-3-54

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఆ ఇంగ్లీషు పద్యం రాసింది మన దీక్షితులుగారే. దీక్షితులుగారు ఆశ్రమానికి ఎపుడన్నా వొచ్చి నర్సాపురం వెడుతో వుంటారు. ఆయనకి ఇక్కడే ఉండి పోవడానికి వీలు పడదుట.

అవును. B.V. నరసింహారావుగారు నాకు దగ్గిర స్నేహితులు. ఆయనని కలుసుకోండి. నా సంగతి చెప్పండి. ఆయన వినేట్టుగా వుంటే ఈశ్వరుడి సంగతి చెప్పండి.

ఈ కాలంలో కూడా, టీచర్ల కోసం, వాళ్ళ security కోసం అనేకమంది Department లో ప్రయత్నాలు చేసినా ఈ free indiaలో ఇంకా టీచర్లని బోర్డువారు ఇట్లా treat చేస్తున్నారంటే, మళ్ళీ నావొళ్ళు ఓసారి మండింది.

మీకు ఉద్యోగంపోతే, పోవొచ్చు, వుంటే వుండవొచ్చు, కాని మీకు రక్షణ లేదనుకోకండి. అట్లా రాయకండి. సర్వేశ్వరుడే మీ రక్షణ భారాన్ని తీసుకున్నారు. ఏమాత్రం భయపడకండి. సంశయించకండి, దిగులుపడ కండి. ఈశ్వర సంకల్పం మీకు చెప్పవలసిన అవసర మేముంది? మీ జాగ్రత్త తీసుకోడమే ఈశ్వర సంకల్పం. పరిస్థితిలు ఎటువచ్చినా, మిమ్మి

విరిగి మీదపడ్డా ఆయనలో విశ్వాసాన్ని మీరు వొదలకూడదనే ఈశ్వర సంకల్పం. మరి ఆ సంకల్పంలో మీ part ని మీరు నెరవేర్చాలి.

ఉద్యోగం లేకపోతే చిక్కుల్లో పడతామనేది మామూలు మనుష్యులనవలసిన మాట. మీవంటి భక్తులనవలసింది కాదు. ఉద్యోగంలో వుండడం వల్లనే చిక్కులూ రావొచ్చు. ఉద్యోగం పోవడం వల్ల చిక్కులూ పోవచ్చు. ఉద్యోగం తీసెయ్యగలరు గాని చిక్కులు పెట్టటం ఎవరితరం? ఈశ్వరుడు పెడితేనేగాని, ఈశ్వరుడే చిక్కులు పెడితే, అది ఆయన కరుణ. ఆయన ప్రేమ. ఆయన పరిశీలన.

అవును. ఏమైనా ఆయనకే వొదలండి. నవ్వుతో హాయిగా తిరగండి. ఆడుకోండి. బైట ఆడుకునే బిడ్డ సందేహిస్తుందా, ఇంట్లోవున్న తల్లి వేళకి అన్నం పెడుతుందో లేదో అని. ఆలస్యమయిందా ఆ రోజు పండగ అన్నమాట. పరవాన్నంతో వడలతో వస్తుంది భోజనం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7-4-54

వీరేశలింగంగారికి,

ఈసారి మీరు రాసిన ఉత్తరాన్ని ఎక్కడో పారేసుకున్నాను. కనక జవాబు లోపంగా వుండవచ్చు. 'భగవాన్ పాదాలముందు' మీకు అంత నచ్చినందుకు సంతోషంగావుంది. వాటిని రాసినందుకు నాకే మాత్రమూ credit లేదు. కలంమాత్రం నాది. రాయించింది భగవాన్. అవి ఈనాటివి కావు. పుస్తకంగా (ఆ మాత్రం పుస్తకంగా) ఈనాడు వొచ్చాయి. అవన్నీ ఆధ్యాత్మిక మార్గంలోని అనుభవాలు. అవి అంత సూటిగా మీ హృదయంలోకి వెళ్ళాయంటే పూర్వజన్మలలో మీరుచేసిన ఆధ్యాత్మిక కృషి ఫలితమూ ఈనాటి మీ విశ్వాసమూ కారణమై వుండాలి.

ఏ విషయమై మీరు దిగులుపడకండి. ఈశ్వరుడు మీ వెంటనే వున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-4-54

వీరేశలింగంగారికి,

ఎందుకు ఆ ఉత్తరంలో సంగతులన్నీ మళ్ళీ రాశారు? నేను చదివిన తరవాతే పోయింది ఆ ఉత్తరం. కాని సంగతులన్నీ జ్ఞాపకంలేవు. ఏవన్నా జవాబు రాయవలసినవి miss అయినానేమోనని మీకు రాశాను. కృష్ణుడు గోపికల బట్టలు తీసెయ్యమనడం మీరు చక్కగా interpret చేశారు.

మరి 'మే' నెలలో మీ ప్రయాణం వుంది కద!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

1-5-54

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీ కోసం చూస్తున్నాము. మాల పిచ్చమ్మగారు ఇప్పుడు లేరు. చచ్చిపోయినారు. ఇక్కడ ఈశ్వరుడే కాదు, ఈ వూళ్ళో మంచి సాధకులున్నారు. వారి దర్శనం కూడా లభిస్తుంది మీకు.

B. V. నరసింహారావు నాకు రాస్తో మీ పేరు కూడా రాశారు.

అవును తిరిగి వెడుతో మిత్రుల్ని చూడవొచ్చు. ముందు ఇక్కడికి రండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

27-5-54

వీరేశలింగంగారికి,

ప్రతిరోజు మీరు వ్రాస్తున్నారని చూశాను. నిన్న మీ ఉత్తరం. ఈశ్వరుడు ఇట్లా రాయమన్నారు -

మీకు గనక ఇక్కడికి రావాలనివుంటే, తప్పకంటా వెళ్ళి తీరాలని వుంటే వెంటనే నిశ్చయంగా బైలుదేరండి. అన్ని సౌకర్యాలూ ఏర్పాటవుతాయి- "డబ్బుతో సహా" !

మీరు ఉత్తరం 21 రాశారు. 24thన post అయింది అక్కడ. అందుకని ఇంత ఆలస్యంగా అందింది నాకు.

మీరు వ్రాస్తోవుంటే, మీతో వ్రాస్తానన్న మిత్రుల్ని కూడా ప్రయాణం చెయ్యండి.

ఈశ్వరుడు అంటున్నారు.

"నాకు వాగ్దానం చేశానే అని, వీరేశలింగం: బెంగపడనఖ్ఖర్లేదు. బైలుదేరనూ అఖ్ఖర్లేదు. నా అనుగ్రహం అతని పైన ఎట్లాగూ వుంటుంది. కాని ఇక్కడికి వొచ్చి నన్ను స్వయంగా కలుసుకోవాలని వుంటే మాత్రం, తప్పకండా రమ్మను" అన్నారు.

నరసింహారావు గారితో మీపరిచయం చాలా interestingగా వుంది. ఇంత విన్నాక ఇంక ఆయన భగవాన్ని ఎక్కడ వొదలగలరు? ఆయనకి జన్మలో ఏ మనిషీ చెయ్యని, చెయ్యలేని ఉపకారం చేశారు మీరు.

Step by step అక్కడ ఏమి జరిగిందో, మీరేం చేశారో ఆయనలో ఎట్లా మార్పువచ్చిందో చాలా చక్కగా trace చేశారు మీరు. అంతే. అట్లాగే మోసపుచ్చుకుంటో వుంటారు మనుషులు. మనిషి జీవితానికి mission వుంటే, ఆ mission ఏర్పరిచిందెవరు? అది కొనసాగించేందుకు ఎవరి సహాయం కావాలి? అట్లాంటి ఈశ్వరుడేలేకపోతే ఎందుకు ఈ చదలపుట్టలో mission సాగించడం?

నేను దూరంగా వొచ్చేశానని చాలామంది నిందించారు, నిందిస్తున్నారు. కాని వాళ్ళకి దగ్గిరిగా ఉన్నప్పుడు ఎంతమంది నాకు ఎన్నిసార్లు దగ్గిరగా వొచ్చారు. ఆ నరసింహారావుగారు మొదట నన్ను కలుసుకోడమే chance. అక్కడవున్నా వొంటరినే; ఇక్కడా అంతే. ఇప్పుడే నాకు ఎంతో నిజమైన మిత్రులు— ఈశ్వరుడి వల్ల.

ఈశ్వరుడనేది వాళ్ళ జీవితాల్లోకి ఓ గొప్ప శక్తిగా ప్రవేశిస్తే, కలిగే మార్పులకి వాళ్ళు సిద్ధంకారు. అందుకని ఈ వాదనలూ, ఈ దాక్కోడాలూ.

మీ ఉత్తరం చివర రాసిన సత్యాన్ని చదివి ఈశ్వరుడు మెచ్చుకున్నారు. మెచ్చుకున్నానని మీకు రాయమన్నారు. చాలా బాగా వాదించారు మీరు నరసింహారావుగారితో. విశ్వాసమంటే అట్లాఉండాలి. మీ విశ్వాసమే అతనిలో అంతమార్పు తీసుకొచ్చింది. అట్లా ఈశ్వరుడి పతాకాన్ని ధరించి మూర్ఖాన్ని, మోహాన్ని, జయించడానికి, మృదువైన యుద్ధాలు చేసే, యోధులం కావాలి మనం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

26-1-54

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఎంతో బాగా రాశారు. అందరమూ చదివి ఆనందపడ్డాము.

మీరు ఈశ్వరుడి ఆహ్వానముపై వొచ్చి ఇంతదూరం కొన్నిరోజులు వుండలేక పోయినారే, వుండడానికి మీకు వ్యవధి లేకపోయిందే అని కించపడ్డాను. కొంతకాలం వుంటేనేగాని, ఈపూరి వాతావరణంతో, భగవాన్‌తో, మాతో పూర్తి పరిచయం కాదు. అని. అంతే.

మీ postiug మీకు అనుకూలంగా రావడం సంతోషం. దానికంతా ఈశ్వరుడిలో మీ విశ్వాసబలమే కారణం.

ఈశ్వరుడికి మానవుడిపైన, ముఖ్యం తన భక్తులపైన నిర్వ్యాజమైన కరుణ లేకపోతే, ఏ మానవుడూ ఆయన ప్రేమకి అర్హుడు కాదు. మీ రాక్కరేకాదు. ఎవరూను, ఈశ్వరుడిలో విశ్వాసం ఎక్కువైన కొద్దీ, అన్ని దుర్గుణాలు పోతాయి.

ఈఇల్లు మాదెవరిదీ కాదు. మాదే ఐతే మీరు రావడానికే వీలుపడేది కాదు. మేము రానీము అని కాదు. అంతదూరంనించి అంత ఖర్చు పెట్టు కుని మీరు రాతగ్గవారంకాదు. మీరు ఈశ్వరుడి ఆహ్వానంపైన, ఈశ్వరుడి అతిథులుగా వొచ్చారు. ఈశ్వర దృష్టిలో అందరం ఆయనకి సమానులం. అంటే అన్ని విధాల సమానులం. లోకంలో హెచ్చు తగ్గులున్నాయి. కాని ఇది ఆ లోకం కాదు. ఇది ఆశ్రమం-ఇక్కడ భేదాలు లేవు.

అరుణాచలాన్ని మీరు చూడగానే ఈశ్వరుడికింద అంత దగ్గరిగా గుర్తించగలగడం ఏదో పూర్వజన్మ విశేషం.

ఒకటి రాయండి. గిరి ప్రదక్షిణంలో మీ వెంబడి వొచ్చిన ఆయన పేరు, ఆయన ఆకారం, ఎంత దగ్గిరగా వర్ణించగలిగితే అంత దగ్గిరిగా వర్ణించి రాయండి. మీరు ఆయన్ని ఎక్కడ కలుసుకున్నారు? ఎక్కడ ఆయన మిమ్మల్ని వొదిలారు?

అవును. నాకూ తెలీలేదు మీతో ఏం మాట్లాడాలో! ఎవరన్నా నన్ను పలకరిస్తేనేగాని వాళ్ళతో మాట్టాడడం నాకెన్నడూ చాతకాదు. ప్రస్తుతం ఎక్కువ మాట్టాడడం నాకు వీలుపడటంలేదు. సహజంగా మాటలు కలవ నిది, ఏదో మాట్లాడడం నామతం కాదు.

ఈశ్వరాశీర్వచనాలతో

చలం

*

23-7-54

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నిన్న మీ M.O. ఈశ్వరుడిపైన భక్తి వుంటే చాలు'

ఎందుకు డబ్బు పంపుతారు? మిగిలివుంటే దాచండి. అవసరం వొచ్చేకాలం రావొచ్చు. అంటే కష్టాలవల్ల కాదు. సద్వినియోగం నిమిత్తమే.

మీ కల చాలా సూచకం అన్నారు ఈశ్వరుడు.

వీలైతే రమణగారిని ఆగస్టు 15కి రమ్మనండి ఇక్కడికి. దగ్గిరగా వున్న భక్తుల్ని ఆహ్వానిస్తున్నారు ఈశ్వరుడు ఆనాటికి.

ఆ రోజు ఈశ్వరుడు మా ఇంటో అవతరించిన దినం. యీ ఏటికి ఆయన వొచ్చి మూడేళ్ళు.

ఈ మూడేళ్ళలో ఎంత మారిపోయినామో, ఎన్ని విచిత్రాలు, మహిమలు జరిగాయో, ఎందరి హృదయాలకి ఈశ్వరవాక్కు ద్వారా శాంతినీ శుభ భవిష్యత్తునూ ఇవ్వగలిగామో! బసవరాజుగారు ఇక్కడే వున్నారు. ఆయన భార్యా కొడుకూ మొన్ననే ఆయన్ని వెతుక్కుంటో వొచ్చి ఆయనతో స్థిరపడ్డారు. వీరేశలింగంగారికి జవాబు రాయలేదేమని బసవరాజుగారిని అడిగితే, రాయలేదు అన్నారు. బసవరాజుగారు తన పనులకి కారణాలు చెప్పరు. ఈఏడు ఇక్కడ చక్కని వానలు కురుస్తున్నాయి. అరుణాచలం ఆకుపచ్చని అంబరం కప్పుకుంది. అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7 - 9 - 54

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఏమీ రాయడానికి లేనప్పుడు అవును, ఏం రాస్తాము? రాసుకోవాలనీ పలకరించాలనీవున్నా, ఏమీ తోచదు. రాస్తున్నాను కదూ, ఇక్కడ ఏమీ సంగతులు రాయడానికి లేవని. అట్లా ఏమీ విశేషాలు లేకుండా జీవితం గడవడ మనేదే గొప్ప విశేషం. అంటే మనసులోకి ఏ విశేషాలూ వెళ్ళని స్థితి.

ఈశ్వరుడే అన్నీ చెపుతో వుండగా స్వయంగా, మిమ్మన్ని చూస్తో వుండగా నా నించి తెలుసుకోతగినది ఏమి మిగులుతుంది నా నించి కాని ఎవరినించి కాని! ఏవి ఎప్పుడు తెలియచేయవలసి వుంటుందో అని తెలియ జేయ బడేట్టు, ఈశ్వరుడే చూస్తారు. ఈశ్వరుడిపైన భారంవేసి జీవించడం కన్న గొప్ప సాధన ఏం వుంది ఆధ్యాత్మికానందానికి! ఏదీ లేదు.

ఏమీ విశేషాలు వుండటం లేదు. రాయటానికి ఏమీ లేనప్పుడు నేను మాత్రం ఏం రాయగలను?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

2 - 11 - 54

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం నరే. వీలైనంత త్వరలో విశాఖపట్నం వెళ్ళండి.

మీరు ఇక్కడికి ఎప్పుడువస్తారో ఈశ్వరుడు చెప్పలేదు మాకు. జరుగుతాయి అంటారుగాని ఎప్పుడు జరుగుతాయో సాధారణంగా ఆయన ఎవరి విషయంలోనూ చెప్పడంలేదు. ఇక్కడ ఈశ్వర ఆశ్రయంలో ఉండగలగడం సులభమైన పని కాదు; ముఖ్యం ఇంకా జీవితంలోనే గట్టి సాధన జరగనివారికి. ఈనాడు ఇక్కడ బసవరాజుగారు పడుతున్న నలిగిడి చూస్తేచాలు తెలుస్తుంది. మీ రక్కడ జీవిస్తున్నారంటే ఈశ్వరుడు మిమ్మన్ని అక్కడ వూరికే వుంచలేదు. మీకు తెలియకుండానే రాపిడి జరుగుతోంది. సాధన జరుగుతోంది. తయారు కాబడుతున్నారు.

సిద్ధమైన మర్నాడు మీ రక్కడ నిలవరు. సిద్ధం కాకండానే తొందరపడి వొచ్చారా వెనక్కి పంప పడతారు. మీరే వెడతారు. భగవాన్ కాలం నించీ ఎప్పుడూ జరుగుతున్న విషయమే అది, చివరికి సౌరిస్ని కూడా. ఎప్పుడు అక్కడికి వొచ్చిపోనా అని ఎప్పుడూ తపన పడేది. 14 ఏళ్ళు బెజవాడలో వుంచారు.

మీకూ అట్లా ఆలిస్యమౌతుందని కాదు. ఈశ్వరుడు వొచ్చి ఇప్పు డన్నీ speed up చేస్తున్నారు.

'భగవాన్ పాదాల దగ్గిర' కాపీలు రాలేదు. ఎన్నటికి వొస్తాయో ? వొస్తాయో రావో !

నా పుస్తకాలు అచ్చు కావడం లేదంటే వాటి అవసరం మనుషులకి లేదన్నమాట. వాటి ప్రచురణ సంగతి నాకేమాత్రం పట్టలేదు. పైగా ఇప్పు డది ఈశ్వరుడి వ్యవహారం అయిపోయింది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

21-11-54

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నేను రాశానుకాదా, మీ కిప్పుడు జరుగుతున్న దంతా సాధనే అని. ఈశ్వరుడిలో అంత విశ్వాసం పెట్టుకుని, ఆశా ఆశయమూ మీవి ఫలించ వంటారేమిటి ? అదంతా మీ విరహం. ఆ విరహం అతీతమై జీవితాన్ని ముంచేవేసినప్పుడే సంయోగం దేదీప్యమానమవుతుంది. ఆయన ఇచ్చిన జీవన శక్తిని ఎట్లా వినియోగించుకోవాలో ఆయనే చూసుకుంటు న్నారు. వృథా కావడ మేముంది ?

ఏ క్షణాన మీరు సిద్ధ మవుతారో, తరవాత, ఒక్క క్షణం మీ రక్కడ నిలవరు. మన ఆరాటమే మన కొలత గాని నిజంగా మనం ఎప్పుడు నంసిద్ధులమో అది మనకేం తెలుసు ? ఇంక వెనక్కి చూడవాలు లేకంతా, అన్ని బంధనాల్ని తీర్చి, సిద్ధంచేసి మిమ్మన్ని తెచ్చుకోబోతు న్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

12-12-54

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. దీపం ఉత్సవాలు అయిపోయినాయి. వాన వల్ల దీపం ఒక్క రాత్రే కనపడ్డది. దీపానికి రుక్మిణీనాథ శాస్త్రిగారు, మురళి, పద్మనాభస్వామిగారు మద్రాసునించి వొచ్చారు. శాస్త్రిగారు ఇంకా వున్నారు. రేపు వెడతారు. మళ్ళీ అందరూ జయంతికి వొస్తారుట. ఇంకా కొందరు మిత్రులతో సహా. నండూరి సుబ్బారావుగారిని ఈ లోపల expect చేస్తున్నాము. జయంతి జనవరి 9న. ఆ రోజు మా ఇంటోనూ ఉత్సవం. అవును. పాపం. మీరు చాలా దూరం ఇక్కడికి. ఆ దూరమనేది కూడా ఈశ్వరుడు ఉద్దేశించినది గానే తెలుసుకోండి. కారణం మనకి తెలీదు. ఈశ్వరుడు రాయమన్నారు "నేను చెప్పి నట్టుజపం ధ్యానం చెయ్యి. నేను చూస్తున్నాను. బాగాఉండు. జనవరి 9 న రమణ జయంతి ఇంటో చెయ్యి" అని.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

21-12-54

వీరేశలింగంగారికి,

మీ కార్డు అందింది. పుస్తకం అందింది. అది రంగ నాయకమ్మ గారికి కదా అని నేను అందిందని రాయలేదు. రంగనాయకమ్మగారు రెండు నెలలయింది హైదరాబాదు వెళ్ళి. ఇంకా తిరిగి రాలేదు.

ఈశ్వరుడు ఎవరికీ సులభులు కాదు. సులభులు లాగు కనపడతారు తక్కినవారికి. తనకి సులభుడు అని ఎవరన్నా అనుకున్నారా, అయిందే వారి పని.

మీరిక్కడికి వొచ్చినప్పుడు ఏం జపం చెయ్యాలో చెప్పారుగా ! అదే చెయ్యండి.

జయంతి తొమ్మిదిన. అప్పటికిచాలామంది మిత్రుల్ని expect చేస్తున్నాము. కవులూ మిత్రులూ ఈనాడు నాకోసం ఎవరూరావడం లేదు. తీరా వొస్తారు గనక నన్ను చూస్తారు. మరి అదే సాధన. నేను 'చలం' అని మరిచిపోవడమే. మీకు మొదట్లో రాశాను 'ఓం నమో భగవతే రమణాయ' అని చెయ్యమని—అదే చెయ్యమంటున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

20-2-55

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఏ పనికైనా మనం ఈశ్వరుణ్ణి ప్రార్థిస్తే చాలదు. ఆ విషయమై మనం చేయగలిగినదంతా ముందు చెయ్యాలి. మనం ఏమీ చెయ్యలేని విషయాలలో మాత్రమే సర్వమూ ఆయనపైన వేసి చేతులు కట్టుకుని కూచోడం. మనం బద్ధకించి, ఆయనని ప్రార్థించడం ఆధ్యాత్మిక సాధన కాదు. మీ భార్య ఆరోగ్యం విషయంలోనూ అంతే. అవును. బాధ్యతల మీద అశ్రద్ధ ఉండకూడదు.

ప్రతిదీ ఈశ్వరుడి మీద వేసి, నిర్లక్ష్యంగా కూచోవడం తప్పు. భారాలు ఆయనపైన వెయ్యాలి ! కాని బాధ్యతలన్నీ మనవే.

పైగా మీ భార్యని విశాఖపట్నం ఆస్పత్రికి తీసుకొని పొమ్మని ఈశ్వరుడు మిమ్మల్ని ఆజ్ఞాపించారు. మీ రిట్లా ఉపేక్ష చెయ్యడము భావ్యంకాదు. ఆధ్యాత్మిక సాధన ఎక్కువైతే ప్రేమ తగ్గనక్కర్లేదు.

మనని కూర్చోపెట్టడానికి కాదు ఈశ్వరుడు వొచ్చింది. మనని సరైన ఆచరణలో పెట్టడానికి. మనని కూచోపెట్టి ఈశ్వరుడెన్నడూ మన పనుల్ని చేసి పెట్టరు. ఆయన మన పనుల్ని చెయ్యడం, కూచోపెట్టడానికి మనం అనేది లేకుండా పోయినప్పుడు. ఆ స్థితి మనకి మానసాతీతం.

కనక అశ్రద్ధ చెయ్యకండి. ఇక్కడికి వొచ్చేముందు, ఆ ఖర్చును విశాఖ పట్టణ ప్రయాణానికి వినియోగించండి.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

15-3-55

వీరేశలింగంగారికి,

మీ కార్డు. కలలో దేవతలూ వాళ్ళూ కనపడితే శుభమే కాని తక్కిన కలలకి ఏమీ అర్థం లేదు. కలకి ఎదన్నా గొప్ప అర్థమున్నదీ, వొచ్చి నప్పుడు మనసుకి అదే తెలుస్తుంది.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

29-3-55

వీరేశలింగంగారికి,

మీ కార్డు అందింది. మీరు బాపున్నందుకు సంతోషం. భగవాన్‌ని చూడనందుకు దిగులు ఎందుకు పడతారు. చూసి అనేక కాలాలు ఆయన పాదాలవద్ద కూచున్న వారికంటె కూడా ఆయన అనుగ్రహం మీతోనే ఎక్కువగా వుందికదా!

గడిచిన దానికీ దేనికి వగవక పోవడమూ, రాబోయేదానికి ఆశించక పోవడమూ, భయపడక పోవడమూ, శాంతికి ముఖ్యసాధనాలు. నాకిదంతా చేతకాలేదనుకోండి అదీ, కాని భగవాన్ వాక్యాలు మీకు జ్ఞాపకంచేస్తున్నాను.

అంతా ఈశ్వరేచ్ఛవల్ల జరిగింది. జరుగబోతోంది. మన ధర్మాలు మనం నిర్వర్తించడంలో తప్ప మనం. దేనికీ బాధ్యులంకాము, అనే సంగతి తెలుసుకోవాలి.

ఈశ్వరాశీర్వచనాలతో
చలం

*

10-4-55

వీరేశలింగంగారికి,

వొళ్ళు బాగాలేదు. పక్కమీదనించి రాస్తున్నాను. మీ రెండు కార్డులూ.

అవును. అవసరమైనప్పుడు మాట్లాడడమే నిజమైన మౌనం అన్నారు భగవాన్. అవసరమైతేకాని ఆలోచించక పోవడం తరవాత మెట్టు.

అందరం బావున్నాము.

రంగనాయకమ్మగారు పదిరోజులైంది వొచ్చి. 14న మిత్రులు ఇక్కడ కూడతారనుకుంటున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

12-4-55

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మొదటినుంచీ నాకు ఈ గ్రంథాలయ సేవలు మొదలైన వాటిపైన నాకు సానుభూతి తక్కువ. కాని ఎవరికన్న దాంటోనే సేవలోంచి ఆనందం కలిగితే, సంతోషం. మానవసేవకి అంతకన్న direct అయినవీ, అవసరమైనవీ మార్గాలున్నాయని.

భగవాన్ పాదాలముందు - కాపీలు ఎవరో నాకిస్తున్న భిక్ష. దాంటో సగం పోస్టువారే దారిలో తీసుకుంటున్నారు.

కాని మీరు రికమెండు చేస్తే నేను సరే, ఈశ్వరుడు వూరుకోరు, పుస్తకం పంపకపోతే.... గ్రంథాలయాలకి నేను నాజీవితంలో నేను రాసిన పుస్తకాలని ఇవ్వలేదు. ఇదే మొదటిసారి!

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

11-5-55

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నిప్పు అంటుకున్నా మీరేమీ నష్టపడక సుఖంగా వుండడం మీ విశ్వాసబలం, ఈశ్వర కరుణా.

ఇక్కడ పదిరోజులనించి మా ఇంటికి దొంగలబాధ. కానీ మీకు మల్లేనే మేమూ సుఖంగా నిశ్చింతగా వున్నాము.

మీరు తెలుసుకుని రాసినట్టే అంతా ఈశ్వర కరుణ.

ఇక్కడ ప్రతి సాయంత్రము వానలు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-5-55

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. దొంగలు వరసగా వొచ్చారు పదిరోజులు. ఇంకా ఆగారోలేదో తెలీదు. బైటపడేసివున్న వడ్లమూటని తీసుకుని వెళ్ళారు. నా అతిథుల బట్టలూ పెన్నూ తీసుకుపోయినారు. వాళ్ళు మా కంటపడలేదు. మమ్మన్నేమీ చెయ్యలేదు. మాకేం భయంగాని అదుర్దాకాని రాలేదు. అంటే ఇదంతా ఈశ్వరుడి దయే.

ఈ చెడ్డకంతా కారణం ఈశ్వరుడుకాదు. మనుషులు చేసుకున్న కర్మ. ఆ కర్మఫలితమే మనని సరైన మార్గానికి తిప్పే శిక్షణగా ఈశ్వర కరుణగా manifest అవుతుంది. మీరు గొడవ పడకండి. ఈ గొడవ ఏమీ మమ్మన్ని అంటలేదు, ఈశ్వరుడి దయవల్ల.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

30-6-55

పీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నరసింహారావుగారి కార్డులో ఒక్క అక్షరం అర్థం కాలేదు. కాని మీ ఉత్తరంనించి ఆయన ఏమి రాసివుంటారో గ్రహించాను. మీ ప్రత్యుత్తరం గొప్పగావుంది. ఆధ్యాత్మికతత్వమంటే ఏమిటో బాగా గ్రహించారు. మీ ఉత్తరాన్ని ఈశ్వరుడు కూడా మెచ్చుకున్నారు.

మీవల్ల ఆయనకి ఏదో ఉపయోగం వున్నట్టుంది: ఆయన చేతుల్లోంచి తప్పించుకుంటారేమోనని బెంగ పడుతున్నారు.

మిమ్మల్ని Challenge చేస్తే ఏం లాభం ? Challenge వెనక ఓ risk వుండాలి. "సరే, నేను చలంగారి దగ్గరికి వెడతాను, మీరుకూడా వొస్తారా ?" అనండి. అంతేకాని "ఏదీ వురుకు నేను గట్టున కూచుని "వురకగలవేమో చూస్తాను." అంటే అదేం Challenge ?

ఆయనేకాదు. ఎవరూ వొప్పుకోరు ఆధ్యాత్మికానికి జీవితం అర్పించబోతున్నానంటే. బాగా అన్నారు అదేం circus feat కాదని. ప్రతి వాక్యం మీ ఉత్తరంలో సరిగా సూటిగా సత్యాన్ని చాటుతున్నాయి నరసింహారావుగారికి. కాని ఆయన యత్నాలకి ఎంత దూరమో అదీ, ఆయన యత్నాలు విఫలమయ్యో, సఫలమయ్యో, వాటిల్లోని శూన్యత్వాన్ని ఆయన గ్రహించగల మహోదృష్టి ఆయనకి తటస్థిస్తేనే తప్ప మీ ఉత్తరాలు ఆయనకెట్లా అర్థమౌతాయి ? మనని అర్థంచేసుకున్నా చేసుకోక పోయినా మన గొంతుని వినేవాళ్ళకి ఈశ్వరవాణిని వినిపించడం మనకి ఉత్తమమైన ధర్మం.

మీ అంత దృఢంగా, స్పష్టంగా, చూడగలిగే వారికి జ్ఞానం అట్టే దూరంలో వుండదు, బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-7-55

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మిమ్మల్ని నరసింహారావు గారు కాదుకదా, ముల్లోకాలలో ఎవరూ ఆపివుంచలేరు. మిమ్మల్ని లాగుతున్నది పరేశ్వరుడు.

బదిలీకి ఈశ్వరుణ్ణి అడగకుండా ఎందుకు ప్రయత్నించారు ? అడగడం ధర్మం, పైగా సాధన. అడిగివుంటే మీకా శ్రమా, ఆశా తప్పిపోయేవి.

అవును. ఒకేచోట విసుకు పుడుతుంది. variety బాగా మనసుకి అలవాటు కావడం చేత మార్పులు కోరుతో వుంటుంది. నాకు ఏనాడూ ప్రయాణం చాలా శ్రమ మనసుకి. కాని రైలో బస్సో ఎక్కిపోవాలనిపిస్తో వుంటుంది, ఏమీ పనిలేకుండానే. ఈశ్వరుడికి వొదిలెయ్యండి ఆ సంగతులన్నీ. బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

26-7-55

వీరేశలింగంగారికి,

మీ కార్డు. రుక్మాంగదరావుగారు కాకినాడ కాలేజీలో చేరారు. నాకూ ఆయన ఉత్తరంరాసి కొన్నిరోజులయింది. అరుణాచలం ఆయన రాలేదు.

కొన్నేళ్ళు లీలగారు పూర్వపు మిత్రులలో ముఖ్యులు. ఆమె పిఠాపురంలో వున్నారు. ఈ వూరు వొచ్చిన తరవాత వారిని నేను చూడలేదు. ఉత్తరాలూ లేవు. అవును ఆ రోజుల్లో ఆమెమీద నాకు చచ్చేటంత ప్రేమ-గౌరవమూను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

5-8-55

పీరేశలింగంగారికి,

భార్యగారికి, ఆగష్టు 15 ఈశ్వరుడు ఈయుగానికి భూమికి అవత రించిన దినం. ఆ రోజున మాయింట్లో జరిగే ఉత్సవానికి మీరు ఆహ్వా నితులు.

మీరు ఆరోజున ఇక్కడికి రాలేకపోతే మీ ఇంట్లో ఉత్సవం జరి పించండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

9 - 8 - 55

పీరేశలింగంగారికి,

మీ కార్డు. నా ఆహ్వాన పత్రిక అందేవుంటుంది.

గీతాంజలి మీకు వెంటనే అంత చక్కగా అర్థంకావడం మీ పూర్వ జన్మకృత విశేషమూ; ఈ జన్మలో ఈశ్వరానుగ్రహమూ, మీఆత్మ పైకాల్యానుభవమూ అనాలి. ఎంతెంతమంది విద్యాధికులకూ, ఆధ్యాత్మిక సాధకులకూ కవులకూ్కూడా అర్థం కనపడదు గీతాంజలిలో. యూరపుమీదా, అమెరికాలోనూ, బెంగాల్‌లోనూ కొత్తకాంతి ఈ ప్రపంచంమీదనే పడ్డదా అనిపించిన గీతాంజలి ముఖ్యం ఆంధ్రదేశంలో ఏ కదలికా లేకుండా పోయింది.

పైగా శ్రీశ్రీ school వాళ్ళు దాన్ని అసహ్యించుకుంటారు. కమ్యూనిజం వల్ల కలిగే అనర్థాలలో అది ముఖ్యం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10 - 9 - 55

వీరేశలింగంగారికి,

మీ రెండు కార్డులూ, మీరే వెళ్ళారా స్వామిగారి దగ్గరికి. పైగా నన్ను గురించి గొప్పగా మాట్లాడి నట్లున్నారు.

ఏంలేదు. ఎంత మంచివారైనా N.R. ప్రపంచం మనుషులు మీలో అరుణాచలం మీది పట్టువొదిలించ లేక పోయినారు. మీమీదా ఆయనకి ఇష్టమైవుంటుంది; లేక ప్రయోజనం వుంటుందో మీవల్ల.... మీభక్తివల్ల ఆయనకి ఆయన ప్రేమకి ఆటంకమయింది వొదిలేశారు. లోకం వాళ్ళ సంగతి మీకింకా అర్థం కాలేదా!

ఆయన ఈశ్వరుడికి పనికిరాకేం? ఆయనా మీమల్లేనే ఇక్కడ చేరుకునే వారే. కాని మకిలి వొదల వొద్దా! ఈ ఆశ పుట్టవొద్దా. ఏ పూర్వ జన్మలోనో మీకూ వారికీ చాలా దగ్గిర సంబంధం వుండివుంటుంది. అందు వల్లనే మీకీ వేదన.

ఆయనలో కొన్ని సుగుణాలేం? చాలా వున్నాయి. మనుషుల్ని ఆకర్షించే talents గుణాలూవున్నాయి. ఎంత బాగా పాడతారు. ఆ కంఠం వినాలని నాకెంతో వుంటుంది. ఎప్పుడూ ప్రేమని ఎవరిమీదా తగ్గించు కోకండి; వారెంత మారుపలక్క పోయినాసరే. మీకు రాస్తున్నాను కాని నాకది చాతకాక కొట్టుకొంటున్నాను. పర్యవసానం ఇదికాదు ఇంకా చాలా వుంది.

అందరికీ ఇక్కడ మీరు జ్ఞాపకమే. అవును చంపక పకపకే. వైద్యానికి వొచ్చిన ఆమె నిర్మల, నామేనకోడలు. వోపిక ఏదీ? వెళ్ళింది సగంలోనే.

నరసింహారావు ఈగారికి ఈశ్వరుడు రాయమంటే రాస్తాను. ఆయన చిరునామా ఏమిటి? ప్రేమకి ప్రేమే సఫలత్వం, నిరాశపడకండి, లోకంలో ఎన్నిపడాలో ఇట్లాంటివి. ఈశ్వరుడు చేసేది ఏముంది దీంటో! మనుషుల రకమే అంత. ప్రేమించే హృదయానికి శాంతి అని ఎవరన్నారు? ఎప్పుడూ అశాంతే ఈశ్వరుణ్ణి ప్రేమిస్తే తప్ప.

మనిషిని ప్రేమిస్తే అశాంతే, వారిలో ఈశ్వరుణ్ణి మనం ప్రేమిస్తే తప్ప. మీకు ఈ విషయాలు అనుభవం తక్కువ లాగుంది. కాకపోతే ఇట్లా బాధపడరు. మీకో పాఠం నేర్పడానికే ఈశ్వరుడట్లా చేసి వుంటారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-9-55

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఇవాళే నరసింహారావుగారికి రాస్తున్నాను. ఎవరి సంగతి చెప్పగలం జ్ఞానం అర్హతా నాకెక్కడ వున్నాయి.? ఈశ్వరుడు చెప్పిందే. ఆయన ఇక్కడికే చేరుకుంటారని. అంటే అరుణాచలానికి, మా దగ్గరికి.

ఏమీ బాధపడకండి.

అదంతా ఈశ్వరుడిపైపు తిప్పడం-ఆ విరహం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

28-9-55

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును. నరసింహారావుగారు నాకూ రాశారు. నేనేం చెయ్యడంలేదు మీకు. చేస్తున్నదంతా ఈశ్వరుడు. మీ విశ్వాసానికి ఆయన ఎంతో ప్రేమగా వుంటారు మీ పైన.

మీరు నన్ను జన్మలవించి వెతుక్కుంటో వ్రాస్తున్నమాట నిజమే నన్నారు ఈశ్వరుడు. ఇట్లా నన్ను మీవంటివారు ప్రేమించగల అర్హతని నాకివ్వడం ఆయనకి నాపైని వుండే అనుగ్రహం-నిర్వ్యాజంగా వొచ్చే అనుగ్రహం.

స్కూలుపనీ-సంసారమూ అన్నీ నిస్సారమై పోవడం చాలా శుభ సూచకం. అప్పుడేకద, అసలు సారంకోసం మన అన్వేషణ!

అవును. జీవితంలో ఒక్క పరమార్ధంతప్ప ఇంకేఅర్ధమూ లేదు. అది తెలుసుకున్నవారు ధన్యులు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-10-55

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అంతే. ఆంధ్రదేశం పబ్లిషర్లు.

ఈశ్వరుణ్ణి నమ్మిన వారికి రానిదేదీలేదు. బుద్ధిరాలేదనుకోడమే బుద్ధి రావడం. అన్నీ సరిగా వొస్తాయి. రోజూ ఈశ్వరుడితో చెప్పుకోండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

28-10-55

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఆ విద్యార్థులు ఏణ్ణర్థంనించి నన్నూ ఈశ్వరుణ్ణి బలి మాలగా, ఈశ్వరుడు ఆ మాత్రం నాచేత రాయించారు.

ఈనాడు దేశమంతా రాజకీయాలలో మునిగివుంది. సారస్వతమైనా politics లో భాగమే. ఆధ్యాత్మిక విషయం ఎవరికోగాని అక్కర్లేదు. ఆ విషయాలు అచ్చువేస్తే పత్రికలు ఎవరూ కొనరు. సినిమా, politics రెండే రాజ్యం చేస్తున్నాయి మనోవీధుల్లో.

ఈసారినించి ఇంక ఏ పత్రికలూ నన్ను రాయమని అడగవు.

అంతా ఈశ్వరుడు చూసుకుంటున్నారు. మనకెందుకు ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

5-11-55

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం, మీరు ఇంకా మీభార్య ఆరోగ్యాన్ని అట్లా ఉపేక్ష చేశారంటె దిగులు వేస్తోంది. ఆమె ఏమనుకుంటున్నారో ! కాని భార్యలు పాపం, పూర్వోత్తరం వారు అంతే ! దృష్టి తమ సుఖం మీద వుండదు. భర్త సుఖం మీదనే కాని ! చాలామందిని చూశాను జాలిపడుతో !

ఈశ్వరుడి యెడలా, ప్రేమయెడలా అశ్రద్ధ క్షమించ తగిందికాదు. శ్రద్ధ లేని ప్రేమ ప్రేమ అనిపించుకోదు. శ్రద్ధ పొందని స్త్రీ భార్యాకాదు, ప్రియురాలూకాదు. ఇప్పటికన్నా వాయిదాలు వెయ్యక త్వరపడండి.

పురుషుడినించి విధి అన్నిటికీ తోడ్పడుతుంది. అశ్రద్ధకి తోడ్పడదు, అభ్యంతరాలూ, అడ్డాలూ వొచ్చినప్పుడే విధి అనుకూలమూ ప్రతికూలమూ. మనలోని అశ్రద్ధకి విధితో సంబంధమేమిటి ? విధి బైటి పరిస్థితులకి. మన లోపలి పరిస్థితుల మీద విధి ప్రభావం ఏముంది ? మన will అనే ఒక చిన్న భాగాన్నే మనకి వొదిలేసింది విధి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

14-11-55

వీరేశలింగంగారికి,

మీ కార్డు చూసి చాలా సంతోషమయింది.

అట్లాగే కానీండి.

ఇక్కడ దీపావళి అడావిడి, ఈ మూలకూడా. తరవాత దీపానికి పది పన్నెండు రోజులు చాలా పెద్ద ఉత్సవాలు. వూరంతా సిద్ధ మౌతోంది. ఆశ్రమంలో కూడా కొంత అడావిడి.

మీరు టపాకాయలు కొన్నారా ? మీ దేశంలో టపాకాయలు సొంతంగా తయారు చేసుకుంటారా ?

ఇక్కడ ఎవరికీ తెలీదు. ఆ సరదాకూడా లేదు.

చిత్ర వెళ్ళినా, డాలీ వుండిపోవడంవల్ల, దీపావళి చాలా హడావిడి మాకు కూడా.

డాలీకంటే కూడా ఈశ్వరుడిది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

22-11-55

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును. ఆకాశంలో నక్షత్రాల్ని చూసి ఆనందించగలి గిన వాడికి ఏ దీపావళి అవసరంలేదు. వాళ్ళకి నిత్య దీపావళి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

2-12-55

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఎంత పిచ్చివారండీ. ఆ ప్రకటన చూసి నమ్ముతున్నారా ? ఏడు నెలలయింది. నన్ను తిప్పలుపెట్టి పెట్టి 4 పుస్తకాలు అచ్చువేశాడు ఆ మహామహుడు. ప్రకటన చేసుకోడం మాత్రం నా పుస్తకాల దొరికిన పేర్ల లిస్టంతా వేసుకొంటాడు. ఇట్లా వుంటుంది మనవాళ్ళ Business—

honesty Private honesty సరేసరి. ఎప్పటికో నా పుస్తకాలన్నీ అచ్చు కావడం. ఈలోపల వాళ్ళతో ఎంత కిందా పైనా పడాలో! ఇప్పుడప్పుడే ఏమీ ఆశపడకండి.

బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

24-12-55

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. జయంతికి మేము పంపినఆహ్వానం అందే వుంటుంది. మీరేదో agitationలో పడి రాశారు వుత్తరాన్ని. అదేదో ఎందుకా విధంగా కదలిపోయినారో. అది ఈశ్వరుడికి తెలిపి, తప్పించమనో, ఉద్ధరించమనో రాస్తే బావుండేది.

కటాక్షించండి-ఇంకా కటాక్షించండి అంటున్నారు. ఆ కటాక్షమే, మీ అలవాట్లూ, కోర్కెలూ, ఆలోచనలూ. బాధపెట్టేట్టు చేసేది. అందర్నీ బాధిస్తాయా? ప్రపంచానికి, మనిషి కోర్కెలకీ, ఆశలకీ అతని ఆత్మకీ జరిగే యుద్ధమేకదా, సాధన అంటే. ఈశ్వరకరుణ అనే ఆయుధంతో వాటిని జయించాలి. విశ్వాసమనే గుర్రంపైన ఎక్కారా సులభంగా దాటుతారు యుద్ధభూమిని. ఈశ్వరుడే చూపాలి (కాదు) చూపుతున్నారు. కనకనే ఈ తబ్బిబ్బులు.

మీరు ఇప్పుడు, మంత్రం జపిస్తున్నారో లేదో, ఎంత కాలం జపిస్తున్నారో, దాని ఫలితమేమిటో వివరంగా రాయండి.

ఈ ఆధ్యాత్మిక మార్గంలో త్వరగా అనేది లేదు. త్వరగా అనగానే వేగం ఎక్కువ కావొచ్చు. వేగం ఎక్కువైతే భరించలేము-బాధ ఎక్కువవుతుంది. అదేదో అశాంతి వొస్తే తగ్గుతుందని ఆశపడతాము. కాని ఈ

బాధామార్గమంతా నడిచి పరిశుద్ధులమైతే గాని అశాంతిని దూరంగా నైనా సమీపించలేము.

నేను రాసేదానికి మీరురాసిన సాల్ బ్రంటనే ఉదాహరణ. అతను క్రమంగా తయారు కానిదే, గురువు అనుగ్రహం అతని మీదికి పొర్లింది. తబ్బిబ్బులైనాడు. తను మహాజ్ఞానినైనా ననుకుని లోకానికి బోధించడం ప్రారంభించాడు. అంతటితో ఆగాడు.

"అట్లా చెప్పగలగడం రాయగలగడం బ్రంటనుగారి ఆధ్యాత్మి కౌన్నత్యానికి నిదర్శనం" కాదు. ఆయన గురువు మహోన్నత్యానికి, బ్రంటను వాక్శక్తికీ నిదర్శనం.

బ్రంటనుగారి విషయం, భగవాన్‌ని అడగడమా ? అడిగితే "బ్రంటన్ సంగతి సరేలే ముందు నీసంగతి ఏమిటి ? అది చూసుకో" అని జవాబు వొస్తుంది.

ఒక మూల "నాలో దయా లేదు. ధర్మం లేదు" అని రాస్తున్నారు. ఒక మూల "త్వరగా ఆత్మ సాక్షాత్కారం చెయ్యమనండి" అంటున్నారు. రెంటికీ ఎంత వ్యతిరేకం. దయా ధర్మాలు తెచ్చుకోండి.

ఈ గొడవ అంతా మానుకోండి. ఆయన మనని నడిపిస్తున్నారు. ఏం జరిగినా ఆయనే జరుపుతున్నారు. విశ్వాసంతో ఏ ప్రశ్నాలేకుండా నడవడమే మన పని. ఈ జన్మో ఏ జన్మో ఎప్పుడో అంతా ఆయన చూసుకుంటారు. అందరమూ దుర్మార్గులమే. సన్మార్గులమైతే పూర్తిగా ఈ సాధన అంతా ఎందుకు ? కాని ఎదో ఒక 'మార్గులం' అంటే మార్గంలో వున్నవాళ్ళం. అది చాలు మనకి. తక్కిందింతా ఈశ్వరుడి అనుగ్రహం. ఆయన చెప్పినట్టు చెయ్యడమే మన విధి.

విశ్వాశంతో బలంగా వుండండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

4-1-56

వీరేశలింగంగారికి,

మీ కార్డు. బ్రంటను గారికి కలిగిన అనుభవమంతా మహర్షిగారి అనుగ్రహంవల్ల కలిగింది. దానిని నిలుపుకునే యోగ్యత ఆయనలో లేనట్టుంది. బ్రంటనుగారు వున్నారు ఎక్కడెక్కడో తిరుగుతో వుంటారు.

మంత్రం చాలా బాగా ఫలిస్తోంది మీలో. అంత గొప్ప అనుభవం పొందుతో ఇంకా సందేహపడతారేమిటి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

12-1-56

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. 'వంటింటో భగవాన్'లో నేను రాసిన దేముంది ? ఆ సంగతులన్నీ నాకేంతెలుసు? అన్నీ సుబ్బలక్ష్మిగారు చెప్పినవే. వాటిని అక్షరాలలో పెట్టాను నేను. మీకు బావున్నందుకు సంతోషం. ఆ పత్రిక లక్షమంది చేతుల్లో పడివుంటుంది. నాలుగో వంతన్నా చదివి వుంటారు. వాళ్ళల్లో ఓ పదిమందికన్నా మీ హృదయం కదిలినట్టు కదిలితే నా కష్టం ఫలించినట్టు.

అవును. 'భగవాన్ పాదాలముందు' నేను పంపాను. కొత్తగీతాలు రాయగల అదృష్టాన్ని నా కివ్వవద్దా ఈశ్వరుడు.

ఆ పుస్తకం తన ఖర్చుతో అచ్చువేసినవారు పెద్ద కుంటుంబం కలవారు. ధనవంతులు కారు అంతబాగా వేశారంటే ఆయన భక్తిశ్రద్ధలు.

మీ కల గొప్పగావుంది. మీ అభివృద్ధిని సూచించి మీకు స్పష్టం చెయ్యటానికి ఆ అందమైన కలలు వొస్తాయి.

అప్పుడే నా పీఠిక వున్న పుస్తకం అందిందా నరసింహారావు

గారికి ! నే నింతవరకు ఆ పుస్తకాన్ని చూడనేలేదు. మన పబ్లిషర్లు అట్లాంటి మహానీయులు.

బావున్నాము ఈశ్వరాశీర్వాదాలవల్ల. ఇప్పటినుంచి తన భక్తులకి ఇంకా బావుంటుందని చెప్పారు ఈశ్వరుడు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

20-1-56

వీరేశలింగంగారికి,

మీ కార్డు. జలాలుద్దీన్ రూమీ ని quote చేశారే, ఆ పుస్తకం గాని అతని నించి selections కాని మీ దగ్గర ఉన్నాయా? ఎక్కడన్నా చదివారా? ఏళ్ళనించి అతనికోసం వెతుకుతున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

14 - 2 - 56

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. అందరం సుఖంగా ఉన్నాము. మిమ్మల్ని ఎట్లా మరిచిపోతాను? నేను మరిచినా ఈశ్వరుడు మరవనిస్తారా?

జలాలుద్దీనుని ఆ 16 పంక్తులూ రాసి పంపండి. అతనిది ఒక్క పంక్తిఐనా సరే మహాభాగ్యం.

హాయిగా వున్నారా?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

21 - 2 - 56

వీరేశలింగంగారికి,

మీ కార్డు. జలాలుద్దీన్ పద్యం అందింది. బావుంది. మీరు సూఫీల్ని గురించి రాశినవిధం ఎంతో బావుంది. మీరే రాతకి పూనుకుంటే ఎంతో బాగా రాయగలరనిపించింది. కాని రాత వ్యవహారాల్లోకి divert కాకండి; ఈశ్వరుడి అనుజ్ఞలేంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

28-2-56

వీరేశలింగంగారికి,

మీ కార్డు చేరింది. మీమనసు ఆకర్షణ ఆపుకోవలసిందే. మిమ్మన్ని ఆ రాత diversion లో పడవొద్దన్నారు కద ఈశ్వరుడు! ఏ మార్గాన ఆయన మీకు సన్నిహితం కావాలో ఆయనే నిర్ణయించుకుంటారు.

మిమ్మన్ని ఆ జపం చెయ్యమన్నారుకదా? చేస్తున్నారా? దానివల్ల అన్ని గొప్ప ఫలితాలు కనపడి కూడా ఇంకా తెలీని స్థితి ఏమిటి?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

6-3-56

వీరేశలింగంగారికి,

మీ కార్డు. జపానికైనా దేనికైనా ఫలితాలు ఈశ్వరుడికి వొదలండి. ఇంకారావాలని, త్వరగా రావాలని ఆశించడం మంచి విషయం. కాని ఏమీ రాలేదే అని నిరాశ పడకూడదు. మీరు పడరులెండి. జపం బాగా చెయ్యండి, ఎక్కువగా.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-3-56

వీరేశలింగంగారికి,

అనుకోకండా పెద్ద surprise కింద పుస్తకం వొచ్చింది మీ నించి. నాకు రూమీ మీద వుండే ఇష్టం, ఇన్నేళ్ళుగా నాకు రూమీని ఇచ్చుకోలేక పోయింది.

కాని మీకు నా మీద వుండే ప్రేమ రూమీని నా వొళ్ళోకి దింపింది.

చూశారా ప్రేమబలం.

ఢిల్లీలో ఎట్లా తెలుసుకున్నారు, రూమీ ఎక్కడ దొరుకుతుందో! బాగా ఖరీదూఐ వుంటుంది.

ఎన్నేళ్ళ కలో నాకు రూమీ.

చదువుతాను— మెల్లిగా, అమూల్యంగా: నేను మీకు దొరికినట్టు నాకూ పూర్వం ఒకరు దొరికివుంటే, ఎంత బావుండేది జీవితం.

భగవాన్ దొరికారు 20 ఏళ్ళకిందట— కాని ఎన్ని ప్రశ్నలు— సందేహాలు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

27-3-56

వీరేశలింగంగారికి,

మీ కార్డు. రూమీని అమూల్యంగా కొంచెం కొంచెంగా చదువుతున్నాను.

అంతే! సృష్టి అంతేకద! ఇన్నిరూపాలు తీసుకుని ఒకరిలోంచి ఒకరు ప్రేమించు కుంటున్నట్టూ, ద్వేషించుకుంటున్నట్టూ నాటకమాడి గంతులెయ్యడమేగా !

April 13 సౌరిస్ పుట్టినరోజు. మిత్రుల్ని expect చేస్తున్నాం. ఎట్లా వుంటోంది జీవితం?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

3-4-56

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఎప్పే! ఎంతోమంచిదికాదు. మద్రాసునించి ఒక రిద్దరు మిత్రులు వొస్తారనుకుంటున్నాము 13 కి, మీరు రాసిన గీతం చాలా బావుందన్నారు ఈశ్వరుడు. Sentiment ఉన్నంతగా వుంది కవిత్వం ఇంకా తక్కువ అన్నాను నేను.

భవిష్యత్తు ఈశ్వరుడి చేతులో వొదిలి వర్తమానం ఇంకా అర్థ యుక్తంగా చేసుకోరాదా అనుకుంటాను నేను. మీ బడిపిల్లల్ని టీచర్లని కలిపి వారానికోసారో, ప్రతి రాత్రినో, భజన ఏర్పాటు చెయ్యరాదా! మీవూరి బిచ్చగాళ్ళ బీదవాళ్ళ వాళ్ళతో పరిచయం చేసుకుని వాళ్ళ జీవితా-లతో సానుభూతి సంబంధం ఏర్పరచుకోరాదా? ఇవి నా సలహాలు. మీ Temper కి Suit అవుతాయో లేవో.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10-4-56

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మనం ఉన్నచోటే మనచుట్టూ వుండే వాటిలో ఈశ్వ రాంశని చూడడం సాధన చేసుకుంటే, దిబిలీ అరుణాచలం అవుతుంది. వేటిల్లో ఈశ్వరుణ్ణి చూడడం సులభమవుతుందో, ఆ Suggestions

ఇచ్చాను అట్లాంటివి ఎదన్నా చేస్తే మీరు, మీ విరహం కొంత తగ్గుతుందనీ, సాధన ఇంకా తొరగా ఫలిస్తుందనీ—

ఈశ్వరాశీర్వాదలతో

చలం

*

27-4-56

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీరు దీక్షితులుగారి పుస్తకానికి నేను రాసిన ప్రస్తావన చాలా ఇష్టపడుతున్నారు. నాకు సంతోషంగావుంది. అధికారం గలవారు ఎప్పుడూ అంతే. D. H. లారెన్సు జీవితచరిత్ర చదివి ముగించాను, మొన్న మొన్న ఇంగ్లీషువాళ్ళ ఆయన్ని ఏ విధంగా కాల్చుకు తిన్నారో, అంత గొప్ప genious ని. అంతేలోకం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

5-5-56

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నేను లారెన్సు Dead man చదవలేదు. అది పేరుకి రాలేదు కూడాను. గొప్పదికనకనేమో ! అతను ఇండియాలో పుట్టివుంటే ఎప్పుడో అయ్యేవాడు యోగి. ఆ వ్యాసం (mystic) వున్న పుస్తకం పంపండి. వీలైతే తిరిగి పంపుతాను.

మీరు దీక్షితులుగార్నీ లారెన్సునీ చాలా చక్కగా అర్థం చేసుకున్నారు. పెద్ద చదువు సాగక ఆ చిన్నవూళ్ళో లారెన్సు మల్లే ఓ చిన్న ఉద్యోగంలో ఇరుక్కున్నారు గాని మీకే సరైన opportunities వుంటే ఈసరికే మీరు ఏదో గట్టి సారస్వత కృషిచేసి వుండేవారను కుంటాను. అందులో చక్కని బరువైన శైలి కూడా వుంది మీచేతిలో. కాని మీ భవి

షత్తు పేరుగా ఉద్దేశించారు. కనకనే, మిమ్మల్ని భౌతికంగా అణిచేశారు- తక్కిన వ్యామోహాల్లో పడకండా-మీ గీతం-చాలాబావుంది ; మొదటి మూడు పద్యాల echo తక్కిన మూడు పద్యాలు, తాను మెచ్చుకున్న గీతాన్ని భద్రంగా దాచి వుంచమన్నారు ఈశ్వరుడు మిమ్మల్ని.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10-5-56

వీరేశలింగంగారికి,

మీ కార్డు. P. F. deductionకి అంగీకరించమన్నారు ఈశ్వరుడు. మీరు విశాఖపట్నం కదులుతున్నందుకు సంతోషం. ఇద్దరు influence వున్న మిత్రులకి ఉత్తరాలు పెడుతున్నాను మీకవరులో. అవి మీకు ఉప యోగపడ గలవని నమ్మకం. వెళ్ళిరమ్మన్నారు ఈశ్వరుడు. వెళ్ళడం ఆలస్యం చేయకండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-5-56

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నేను ఎవరికి మీకోసం ఉత్తరం రాశానో ఆ మిత్రు లిద్దరూ శరీరకంగా బతికివుండి మీకుసహాయ పడినప్పుడు కద, నాకు సంతోషం. మీకెందుకు సందేహం ? ఇంత గొప్ప విశ్వాసం కలిగిన మిమ్మల్ని ఏ నిమిషమూ ఈశ్వరుడు వొదిలి వుండరు. ఎట్లాగూ మీరిక్క డికి రాబోతున్నారు. మీకు తయారు కావాలి. ఇక్కడి పరిస్థితులు అను కూలంగా ఏర్పడాలి అదే ఆలిస్యం. ఆ కాలం రావడమూ, అన్నీ జరగ డమూ ఈశ్వరుడి హస్తాల్లో వుంది.

సంతోషంగా వుండండి. నాకు పుస్తకాలు పంపడం సంగతి ఏమీ గొడవ పడకండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

6-7-56

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఈ సంగతులు  మీ భార్యకు  బాగా మనసుకి ఎక్కి, మనసులో నిలిచేటట్టు చెప్పండి. ఈశ్వరాజ్ఞ.

1. మీరు ఉన్న స్థితిలో మాటికి ముందు విశాఖపట్నం వెళ్ళి వైద్యం చేయించడం మాటలుకాదు. మిమ్మన్ని  ఆ విధంగా శ్రమపెట్టకూడదు ఆమె.

2. చిన్న విషయాల్లో శ్రద్ధ లేకపోతే, పెద్దవిషయాల్లో కలుగుతుందా ? అశ్రద్ధ మంచిలక్షణం కాదు.

ఏ ప్రయత్నానికీ ఈ దేహమే ఉపకరణం.

3. మీరెప్పుడూ ఈ టీచరుగా  వుండబోవటం లేదు. మీరు గొప్ప ప్రయత్నాలకి ఉద్దేశింప బడ్డారు. అట్లాంటప్పుడు మీకు సహధర్మచారిణిగా వుండాలంటే ఆమెకూడా ఈశ్వరాజ్ఞల్ని  పరిపాలించాలి. ఇప్పుడు ఆమె చెయ్యవలసిన సాధన :-ప్రతిచిన్న  విషయంలోనూ శ్రద్ధ తీసుకోవడమే. ముఖ్యం ఆరోగ్య విషయం.

ఈశ్వరుడు ఏం చెయ్యగలరు అని సందేహపడకండి. ఈశ్వరుడు చెయ్యలేనిదేముంది ? బుద్ధిలేదంటున్నారే, దాని ఫలితమే కద ఈజబ్బు ! ఆయన చేతిలో బ్రహ్మాండమైన అస్త్రం వుంది-బాధ.

మీ విషయం-సమస్తము ఈశ్వరుడికి వొదలండి. ఆయన మిమ్మన్ని

సదా కనిపెట్టి చూస్తోనేవున్నారు. ఇంకా తెలుసుకోవాలంటే detailed గా రాయండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-7-56

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నిన్న నేను మీకు రాసిన కార్డు అందివుంటుంది. మీరు రాసిన పద్యం చాలాచాలా బావుంది.

మీ భార్య సంగతి మీరు రాసిందంతా నిజమే. అట్లాచూడటం **nobility in man.**

పూర్వం స్త్రీ లిట్లాకాదు. పురాణాలలో పురుషుణ్ణి encourage చేసేవారు. ఆ పని చెయ్యలేక పోయినా, అతని ఉద్దేశ్యానికి అతిక్రమించి ఆమెకి ఇంకో ఆలోచన వొచ్చేదికాదు. ఆనాటి ధర్మానికి అందరు పురుషులూ స్త్రీలూ కట్టుబడేవారు.

ఇంకముందు పూర్వపు పద్ధతిని అమలు పరచబోతున్ననంటున్నారు ఈశ్వరుడు.

మీ అడుగుల్లో నడవడానికి నిరాకరిస్తే ఆమెకే నష్టం, ఎవరేం చెయ్యగలరు ?

నేను రాసింది ప్రస్తుతం ఆమె తన ఆరోగ్య విషయమై డాక్టర్లుచెప్పి నట్టు నడుచుకోవాలని. మీ కోర్కెపైన అన్నా ఆమె శ్రద్ధ పెట్టాలి. కాకపోతే మీరు పడుతున్న శ్రమ వృథాకద! ఆ మాటే పదే పదే చెప్పి చూడండి.

భక్తిలో శ్రద్ధవుండాలి. ఎవరి పైన భక్తివుందో, వారి మాటలో

విశ్వాసంవుండి, వారి ఆజ్ఞను పరిపాలించి నప్పుడే భక్తికి ఓ అర్థం వుంటుంది.

ఈశ్వరాశ్వీరాదాలతో

చలం

*

9-8-56

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీ గీతం బావుంది. ఈశ్వరుడు అభినందించారు.

ఆగస్టు 15 సంగతి మీకు తెలుసుననుకున్నాను. ఈశ్వరుడు నాకు ప్రత్యక్షమా? నాకా అర్హత ఎక్కడిది? సౌరిస్‌కి ప్రత్యక్షమైనారు 5 ఏళ్ళ కిందట. రూపం లేని ఈశ్వరుడు సౌరిస్‌ని నమ్మించడానికై రూపం ధరించి వొచ్చానన్నారు. ఆనాటినించి సౌరిస్‌ద్వారా తనని నమ్మిన వారందరినీ ఉద్ధరిస్తానని చెప్పారు. వారి ఆజ్ఞ ప్రకారం ఆరోజు ఉత్సవం జరుపు తున్నాము. తక్కిన వివరాలు ముఖతః తెలుసుకోవలసిందే. చాలా వున్నాయి. ఉత్సవం చేసుకోండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

9-9-56

వీరేశలింగంగారికి,

ఇన్నాళ్ళకి, ఇన్నేళ్ళకి ఇప్పుడే సందేహం మిమ్మన్ని కలత పెట్టిం దేమిటి? మహాయుద్ధాలు, భూకంపాలు, వరదలు, ఇన్నిభీభత్సాలు జరిగాయే మీకు బుద్ధి తెలిసిన తరవాత! ప్రతి గంటా ఎంత మంది చచ్చిపోతున్నారు. ఎన్ని జంతువులు, మొక్కలు; ఆశయాలు, కలలు మరణిస్తున్నాయి!

చావులోకాదు, బతుకులో ఎన్ని బాధలు. ఏళ్ళ తరబడి ఎడతెగని బాధలు! ఒక రైలుప్రమాదం ఇంత ఘనమై నిలిచిందేం మీకళ్ళ ముందు?

దీనికంతా, ఈ విషాదానికంతా, ఇన్నేళ్ళ మట్టీ విన్నదీ, చూసిందీ అంతా కలిసి ఈ accident వెనక నిలుచుని ప్రశ్నింపచేసిందా?

ఇట్లాంటి ప్రశ్న చాలాత్వరలోనే రావాలి. ఇట్లాంటి సందేహాలు కలగంది ఈశ్వర భక్తిలో విజ్ఞానం కలగదు. వీటిని మనం సమర్థించుకోనూ సమర్థించుకోవాలి.

దీనినే టాగోర్ problem of evil అన్నారు. దీనినే అనాదిగా సాధకులు, భక్తులు, Philosophers solve చెయ్యాలని అనేక విధాల ప్రయత్నించారు. ఈశ్వరుడి నించి నేను కొంచెంగా ఏమూలో తెలుసుకున్న జవాబులే మీకురాస్తాను. నేను తెలుసుకున్నదంతా మీకు తెలియజెయ్యగల శక్తి నాకులేదు. ఇంకా మీకు సమాధానం రాకపోతే, ఈశ్వరుడితో ముఖాముఖి మాట్లాడడం తప్ప గత్యంతరం లేదు.

నా Later writingsలో అంతా ఇదే గొడవే! మీరెట్లా Miss అయినారు దీన్ని ఇన్నాళ్ళు!

మీ ప్రశ్నకి జవాబులు, ఈ ఉత్తరంలోనే వున్నాయి.

"ఈసృష్టిలో పుట్టడానికీ, చావడానికీ ఓ అర్థమూ పద్ధతీ వున్నట్టు తోచదు"

1 వున్నాయి-కానీ మన మనసుకి అతీతం అవి.

2 లేవు-ఇదంతా వుత్త illusion

రెండూ సత్యాలే.

చీమలూ, దోమలూ చచ్చినప్పుడు అడగలేదే ఈ ప్రశ్న! అంటే మన Sentiment accidentని magnify చేస్తోందన్న మాట.

"ఒక్కసారిగా"- ఒక్కసారిగా చస్తేనేం విడివిడిగా చస్తేనేం? ఒక్కసారిగా చావడం మన imagination మీద Play చేసింది. అంతే. ఘోరమరణం-రైల్లో చావడం తక్కిన చావులకన్న ఘోరం!

"సృష్టి పద్ధతి కల్లోలం"- "సృష్టి పద్ధతి ఇది" అని ఎవరన్నా చెప్పారా మీకు! ఇట్లాంటివన్నీ Include అయ్యేవుంది సృష్టి- ఈనాడు కొత్తగా జరిగింది ఏమీలేదు.

అందరికీ సమానంగా పుటకలూ, చావులూ, చదువులూ, విధించగా లేనిది తక్కిన ఘోరాలు మాత్రం అందరికీ ఒకే విధంగా జరక్కూడదా?

ఒక్క బాంబుతో లక్ష జనులు నశించారు నాగసాకీలో.

ఎవరి కర్మకి వారే కారణం. ఈ కర్మ పరంపర అనే ఎడతెగని వలనించి బైటపడటానికి ఈశ్వరుడు వొక్కడే సాధనం.

భగవానే మంటారు—

"నువ్వు నిద్రపోయేప్పుడు నిన్ని సమస్యలు బాధిస్తాయా? నీమనసు చేస్తోంది ఇదంతా, మేలుకునీ నిద్రపోవడం నేర్చుకో"

ఇంతే సమాధానం!

ఇంతకన్నా లోతైన సమాధానం కావాలా—

మళ్ళీ భగవాన్ అంటున్నారు—

"If you wish to know fundamental things go to fundamental truths"

ఆ truths ని తెలుసుకోవాలంటే, నీ మనో నేత్రాన్ని తెరు.

దానికే యీ సాధన.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

17-9-56

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును అక్కడ మీరు చేస్తున్నదంతా సాధనే. ఆ ప్రతిబంధకాలే మీ సాధన.

అన్నీ ఈశ్వరుడికి వొదలండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

20-9-56

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరు ఆధ్యాత్మిక సాధనని, విశ్వాసాన్ని గురించి రాసిన ప్రతి అక్షరమూ నిజం. అదే మార్గం. 'ఇదేమార్గం' అని భగవాన్ చెపితేనే నమ్మలేదు సాధకులు. మీరు నేనూ చెపితే వింటారా ? ఈశ్వర వాక్యైనా నా కలంలోంచి వినపడడం వల్ల నమ్మకం కుదరదు.

అంతా ఈశ్వరుడికి అర్పిస్తే ఈశ్వరుడే చేసినట్టు వుంటుంది. మానవుడి ప్రయోజకత్వం కనపడదు. అహానికి చోటు వుండదు. అందుకని తామే సాధన చేసి జయిద్దామనే ఆశ వుంటుంది. ఆ మార్గం చాలా కష్టతరం. నమస్కరించి మా ఇంటికి రమ్మంటే సంతోషంగా కరుణతో వచ్చే అతిథిని, బలవంతంగా తాళ్ళతో బిగించి ఈడ్చుకు రావాలని చూసినట్టు. చాలా మంది గట్టిదెబ్బ తింటారు ఆ అహంభావంవల్ల.

గురువు లేంది ఆసనాలూ ప్రాణాయామం చెయ్యవొద్దంటున్నారు ఈశ్వరుడు. గురువు వున్నారో లేదో ఆయన రాయరు. మీ friend - మీ స్నేహంవల్ల ఆయన ఈశ్వరుడికి కొంత సమీపం అయినారు. అది ఓ సుగుణం మనం అంతకన్న ఏం చెయ్యగలం ?

వారి సుకృతం కొద్దీ కొందరికి, సాధన ప్రారంభించగానే, వెంటనే కొన్ని అద్భుతమైన ఫలితాలు కనపడతాయి. దానివల్ల - "మనకేదీ

సాధ్యంకాదు ?" అనే self confidence మరీ ఉబ్బుతుంది. అదంతా తన ప్రజ్ఞేననిపిస్తుంది. కొన్నాళ్ళ తరవాత advancement ఆగిపోతే కారణం దీనిమీదా దానిమీదా పెడతారు. చాలాసార్లు మళ్ళీ మొదటికి రావలసి వొస్తుంది. అట్లాంటివాళ్ళు రమణ భక్తుల్లో కనపడుతోనే వుంటారు.

కాని మన మాట వినరు.

Patience and Patience - చాలా అవసరం ఈ సాధనకి

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

29 - 9 - 56

వీరేశలింగంగారికి,

మీ పెద్ద ఉత్తరం. మీరు వ్రాసిన ప్రతి అక్షరమూ సత్యం "వీరేశలింగం ఎంత బాగా స్పష్టంగా అర్థం చేసుకున్నాడో చూడు" అని మళ్ళీ మళ్ళీ అన్నారు ఈశ్వరుడు.

మీ గీతమూ బాగానే వుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

5-10-56

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మళ్ళీ ఈనెల 'తెలుగువిద్యార్థి'లో నా వ్యాసం చూశారా ? మీ Piece పడి చాలా నెలలయింది. అప్పుడే చూశారనుకున్నాను చూడనే లేదా ఇంతవరకు. మీరు రాసిన appriciation వేసినందుకు బహుమానంగా ఆ పత్రికని ఆ నెల వ్యాసం ఇప్పించారు. అవును వాళ్ళతో చెప్పి

ఈశ్వరుడే ఆ Piece ని అచ్చు వేయించారు. త్వరలో మీకు 'కవిగా చలం' అనే పుస్తకం పంపగల ననుకుంటున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-10-56

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం, ఆ పుస్తకం మీకు అంత నచ్చినందుకు నాకు సంతోషం. నరసింహారావుగారికి అప్పుడే రాశారా ? అదీ నా జాతక ప్రభావం. ఎప్పుడూ అంతే. నా పుస్తకాలు అచ్చై నాకు అందవు. నరసింహారావుగారికి ఎప్పటికి అందుతుందో పుస్తకం !

జయదేవుడు కృష్ణశాస్త్రిగారు.

జరుగుతున్నాయి విశేషాలు. గాలి కొత్త ఉత్సాహంతో పులకరిస్తోంది. ఈశ్వరుడి దృష్టి ఈ దేశంపైన నిలిచింది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

21-10-56

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఇంతవరకు నాకు పుస్తకం కాపీలు పంపనేలేదు, గ్రంథకర్త. ఏం చెయ్యను ? నిన్ననే నరసింహారావుగారి నించి ఉత్తరం వొచ్చింది. వారికి పుస్తకం అందనేలేదు. నాకు కాపీలు పంపకపోతే పోనీ, నరసింహారావుగారికైనా ఓ కాపీ పంపమని రాశాను. పంపారో లేదో ! ఆయనకి పుస్తకం Promise చేశానని కూడా రాశాను.

చిన్నారావుగారిదీ, కాకినాడ దగ్గిర దుగ్గుదుర్రు. ఆయన చిరునామా, R. V. చిన్నారావుగారు, దుగ్గుదుర్రు, వయా కాకినాడ. ఆయన

ఎన్నేళ్ళనించో నా admirer- ఓ పది పన్నెండేళ్ళనించి పరిచయం. రెండు మూడుసార్లు ఇక్కడికికూడా వొచ్చారు. ఈశ్వరభక్తులు. పూర్వం నించి నన్ను విడవకండా నిలిచిన చాలా కొద్దిమందిలో వారొకరు. ఆయన Painter. రచనాశాలి. కాని ప్రచురించే ఆసక్తిని మించిన వారు. మీరు రాసే ప్రతి ఉత్తరాన్నీ మెచ్చుకుంటారు ఈశ్వరుడు, మీ రాతలో వుండే విచక్షణకీ స్పష్టతకీ.

నాకొకటి తోస్తోంది. నాకు కాపీలు పంపితే, అవి నాలుగుపేపులా పంచిపెట్టేస్తానని వృథా అవుతాయని రహ్మాన్‌గారు అనుకుని, నన్ను కొంత శిక్షణలో పెడుతున్నారేమో!

ఈశ్వరుడి control లో నేను లేకపోతే, ఆ సంగతి నిజమే. కాని ఆ సంగతి రహ్మాన్‌గారికేం తెలుసు? ఇప్పుడు ఇక్కడంతా ఈశ్వరుడి పరిపాలన అని!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

30-10-56

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. పాట బావుంది. అట్లాంటి భక్తి దీక్షితులుగారికి మరీ ఇష్టం.

తక్కిన సంగతి "సరే, ఏం చేస్తాం. అంతే మనుషులు— ఆ విషయం నాకు వొదిలెయ్యమను—" అన్నారు ఈశ్వరుడు.

నరసింహారావుగారి ఉత్తరం కాపీ మీకు అందివుంటుంది. ఆ పుస్తకం ఎంత tribute ఓ చలానికి ఆ ఉత్తరం కూడా అంత గొప్పగా వుంది.

చూడండి. ఈశ్వరుడు నా కెట్లాంటి గొప్ప విలపైన admiration

ఇవ్వొస్తున్నారో, మీ వోలిన మిత్రులనించి. పూర్వమైతే నా తల తిరిగి పోయేది. ఇప్పుడు ఈశ్వరుడున్నారుగా మొట్టికాయలు మొట్టడానికి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

6-11-56

పి రేశలింగంగారికి,

మీ కార్డు. ఎట్లాచూనేస్తారు దీపావళి! పిల్లలకి సరదా కద! పెళ్ళిళ్ళ మొదలైన ఖర్చులకన్న ఎంత నయం దీపావళి ఖర్చు! పిల్లలకి ఆనందం!

ఆ శ్రీవాత్సవ అనే ఆయనకి నామీద ద్వేషం ఉందని అనడం నాకు ఆశ్చర్యం. అట్లాంటి కారణం ఏమీలేదు. ఒకప్పుడు నాకు గొప్ప admirer. ఏవిధమైన విరోధమూ లేదు మాకు. ఆ స్వతంత్ర వాళ్ళ influence అయివుంటుంది.

కాని అతని రాతలు చదివి నాకు కొత్తమిత్రులు వొస్తున్నారు. చిత్రం. అపకారం తలచని వారికి అపకారం తలిస్తే అది ఉపకారంగానే పరిణమిస్తుందని చెప్పారు ఈశ్వరుడు చాలాకాలం కిందటే.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

24-11-56

పి రేశలింగంగారికి,

మీ కార్డు. అవును. ఈకాలం ఇక్కడా ప్రతివారికీ జలుబూ, జరం, ఈపాటికి నెమ్మదిగా వుండి వుంటుంది.

జయంతి 19 న. ఆ ప్రయత్నాలు ప్రారంభిస్తున్నాము.

దీపానికి రుక్మిణీనాథశాస్త్రిగారు వొచ్చినప్పుడు చెప్పారు. స్వతంత్రలో వాళ్ళు ప్రచురించని replies అన్నీ ఆంధ్రపత్రికలో వేయిస్తామని. మిత్రుల్ని అక్కడికి పంపమనండి జ॥ రు॥ శాస్త్రి: శిరోమణి, బాలాజీనగర్ మద్రాసు—14.

ప్రతివారిని అనవసరంగా తిట్టే ఈ పత్రికల చెడుగుణాన్ని, ఆరికట్టేందుకు కొందరు పూనుకుంటే దేశానికి మేలు జరుగుతుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

30-12-56

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరు చెప్పినవన్నీ నిజం.

బాగా తెలిసిన తరవాత, రాయడానికి ఏమీ వుండదు.

ఎంతమందో భక్తుల్ని తెచ్చుకుంటున్నారు ఈశ్వరుడు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-1-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఆ పత్రిక ఏదో పంపారే, మాకు అందలేదు. పోనీండి.

జాలీ, పాపం, పాశాలతో బాధపడుతోంది—

లెఖ్ఖ ముందు పెట్టుకుని,

"ఏ రూపంబున దీని గెల్తు

నిక మీ పే పేల్పు చింతింతు
ఎవ్వారిం పేరిదు. ఎవ్వరడ్డమిక
లేరే క్రొమ్మెక్కెద, దిక్కుమాలిన
మొరాలింపవే ప్రపుణ్యాత్మకుల్”

అని ఎందుకు ఈ చదువు?

అంటే ఏం చెప్పను? పకపకా అట్లానే అడుగుతోంది.

ఈశ్వరాశీర్వచనాలతో

చలం

*

6 - 2 - 57

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీ గేయం రెండూ చదివాము. రాయడం మరచిపోయి నాను. బావుంది.

మీరడిగినట్టు Blake వాక్యాలు తర్జుమాచేసి పంపుతున్నాను. కష్టం ఆపని. Blake అర్థంకాక కొద్దికాలం కిందటివరకూ అతన్ని పిచ్చి వాడన్నారు. అతని కవిత్వం Mysticism లోకి పోతుంది. ఒకచోట గూఢంగా మనసుకి అందకుండా వుంటుంది. East నించి Mysticism, England తెలుసుకున్న తరవాత కొద్దిమంది Blake ని genius అన్నారు.

మీకు ఇంగ్లీషు రాలేదని ఏమీ చింత పడకండి. ఎందుకు చింత పడనక్కర్లేదో, నమ్రగంగారాస్తే: నన్నూ Blake కన్న పిచ్చి వాడం టారు, Blake Passage లో పాతరకం ఇంగ్లీషు వాడాడు. ఆనాటినించి ఈనాటికి ఇంగ్లీషు భాష మారింది. పైగా మీరు పంపినది అర్థం చేసుకో డానికి భాషకాదు అడ్డు. అనుభవం. ఇప్పుడు నేను చేసిన తెలుగు తర్జుమా ఇంగ్లీషుకన్న ఏమాత్రం అర్థమౌతుందో మీకు! చదువుకి తిరగబడే

మీలోని గుణం, శ్రద్ధగా చదివి ఇంగ్లీషు నేర్చుకోడం కన్న మీ జీవితాని విలువైనది శ్రద్ధగా చదువుకున్న బుద్ధిమంతులు ఏ మాత్రం జ్ఞానులైనారు? "కలా వాస్తవం" లోని భావాలే కావు, ఇంక ఏ భావాలు అర్థమయి మనకి ఇచ్చేది స్వల్పం. భగవాన్ అంతకన్న సూటిగా అధికారంతో, సంపూర్ణమైన అనుభవంతో రాశారు. నా మాటలు నాటి దూరపు కత్తి ప్రతిధ్వనులు. కానీ భగవాన్ మాటలైనా మనకి ఎంత మాత్రం చెప్ప గలవు?

మన కళ్ళు విప్పేది, విశ్వాసం-

ఈశ్వరకరుణ-

ఏనాడు మనముందు విసిరారో-ఆయన Magic wand ఈమాయ, ఈ కల కప్పేసింది మనని. తిరిగి ఆయనకి ఏనాడు కరుణ కలిగి ఆ Magic wand ని రెండో వేపుకి విసిరి, మంత్రం తీసేస్తారో ఆనాడే మనకి మళ్ళీ మెలుకువ రావడం.

మనం చేసే సాధన, మనం చేసే ప్రయత్నమంతా ఆయన కరుణని పొందే అర్హతకొరకే.

దైవానుగ్రహం తెచ్చుకోంది, ఏ Understandings ఏసాధనలూ మన కళ్ళు విప్పలేవు.

మనిషి స్వర్గానికి పోవడం సులభం. స్వర్గాన్ని తన హృదయం లోకి తెచ్చుకోడం ఈశ్వరవరం.

మీరు పంపిన cutting సూర్యప్రసాద్ పంపాడు. Thanks.

Blake పద్యానికి తెలుగు-"అర్థము చేసుకోగల శక్తిని అభివృద్ధి చేసుకోడం వల్లనేగాని,

తమ Passions ని నాశనం చేసుకోవడం వల్లగాని, Passions

ఆసలు లేకపోవడం వల్లగాని, మనుషులు స్వర్గార్హతను సంపాయించు కోరు"

ఏ బుద్ధినించి ఈ Passions పుడతాయో అవీ స్వర్గ సౌభాగ్యాలు, passions లేని సూన్యత్వాలుకావు: అంత పవిత్రుడైనా బుద్ధిలేనివాడు-స్వర్గానికి పోలేడు. స్వర్గానికి పోవాలంటే పవిత్రతకాదు ముఖ్యం—స్వర్గం నించి ఎవరిని తోసేస్తారంటే వీరిని-

ఎవరికి బుద్ధిలేక పోవడం వల్ల Passions లేక అనేక విధాలైన దరిద్రాలకో, క్రూరత్వాలతో, ఇతరుల్ని అరికట్టి అధికారంతో అణగ తొక్కుతారో అటువంటి వారిని—మేము ధర్మాత్ములం, పవిత్రవంతులం అనే వారితోనే నరకం నిండి వుంటుంది.

ఈశ్వరాశీర్వాదాలలో

చలం

*

26-2-57

వీరేశలింగంగారికి,

మీ రెండు కార్డులూ. ఈశ్వరుణ్ణి తలుచుకొని వెళ్ళండి ఎలెక్షన్లకి. ఏం భయంలేదు అవును గొ. వె. సు. గారు వొచ్చారు. నా జీవిత చరిత్ర రాయలనే ఉద్దేశ్యంతో, అంటే నా జీవిత విశేషాలను సేకరించి వెళ్ళ డానికి. ఆయన నా విషయం కూడా అక్షరాభిషేకం—పుస్తకంలో రాశారు. చదివారా? ఆయన ఇక్కడికి వొచ్చినట్టు మీకెవరో రాశారు. అవునా? పది పన్నెండు రోజులు ఇక్కడవుండి, రోజులో చాలా గంటలు మాతో గడిపి వెళ్ళారు. నాజీవితం అర్థం చేసుకోడానికి ఆయన ప్రయత్నంలోనే ఆయన అభిప్రాయాల్ని మార్చుకోవలిసి వొచ్చింది. పూర్వాభిప్రాయాలతోనేవుంటే నా జీవితం ఓ ముఖ్యమైనదిగా రాయడానికి ఏమీ దొరకదు. ఇంక నన్ను తిట్టడానికే రాయాలి, సంఘాన్ని సారస్వతాన్ని పాడుచేయ ప్రయత్నించా వని.

విశేషం చూడండి-ముఖ్యమైన సూత్రాలలో నానించి భేదించినా కూడా, నా జీవితచరిత్ర రాయాలనీ, అంటే నాలో విశేషముంది అని ఆయన విశ్వాసం. ఆ విశ్వాసానికి ఆయన నీతి ఉద్దేశ్యాలకీ పరస్పర విరుద్ధం రావడం పట్టి, నన్ను గురించి ఆయన రాసే దానికి విలవలేకండా పోయింది. నన్ను గురించి గట్టిగా గొప్ప చూపిస్తో అచ్చులో పెట్టిన వారిలో almost ప్రథముడు. కాని కారణాలు చూపలేకపోయినాడు.

నా సంగతి అట్లా రాస్తోకూడా నా అతిథిగా రావడంలోనూ, ఆ భేదాలు, నా ఆప్యాయతకీ, గౌరవానికీ అడ్డురావనీ ఆయన తెలుసుకోడమూ ఆయన హృదయ వైశాల్యానికి తార్కాణాలు కాదూ? అటువంటి సహృదయత ఉన్న తరవాత, ఈ అభిప్రాయభేదాలెంత మాత్రం లెక్కలోకి వొస్తాయి!

ఇక్కడ ఈశ్వరుడు స్వయంగా కూచుని ఆయనకి జ్ఞానబోధ-నిజమైన నీతి అంటేనూ, చలం బోధించిన నీతి ఏమిటో అంతా విశదం చేశారు. శరత్తు కన్న చలం ఎక్కడ అధికుడో కూడా ఆయనకి విశదం చేయపడింది.

పాపం ఇదివరకు ఆయన నా విషయమై convince అయిన విషయాలు కూడా ఇతర్లని, ఎట్లా convince చెయ్యాలో తెలీకండా వుంది ఆయనకి.

ఇంతే కాకండా B V నరసింహారావుగారు ఆయన వెంట పడి ప్రశ్నలు కురిపిస్తున్నారు. ఉత్తరాలలో Sense of pro-portion ఏమిటి ? ఎవరన్నా Sense of proportion చూసుకుంటో ఉత్తరాలు రాసుకుంటారా అని అడిగారు-నా ఉత్తరాలలో Sense of proportion లేదని. గొ. వెం. సు. గారు అంటే.

ప్రపంచపు Influence ని మించి దృష్టి తెచ్చుకోగల మనుషులు అరుదు. వెంకటసుబ్బయ్యగారి పరిసరాలు, ఆయన వయస్సు, రచకుడి కింద ఆయన కీర్తి, ఇన్ని Consideration లోకి తీసు కోవాలి మనం.

కాని ఇంత వయసులో ఆయన కొత్త దృష్టిని తెచ్చుకోడానికి సిద్ధపడ్డా రంటే మెచ్చుకోవాలి మనం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7-3-57

పేరేశలింగంగారికి,

మీ చక్కని ఉత్తరం. మీ ప్రయాణంలో మీ వెంటనే ఉన్నారు ఈశ్వరుడు. చూశారా ?

ఇపుడు నాకు వొస్తున్న ఉత్తరాలూ, నేను రాస్తున్న దీర్ఘమైన జవాబులూ చూస్తే, నేను మీకేం రాశానో, రాయలేనో జ్ఞాపకం లేకపోవ డంలో ఆశ్చర్యం లేదు. నాకు ఇద్దరు Assistants- పకపకా, బసవరాజు గారు. ఒక, Superintendent-ఈశ్వరుడు. ఈ శరత్-చలం, సంగతి-ఈశ్వరుడు చలంమల్లే పగలకొట్టి చెప్పి భయపెడతారా ? నాజూకుగా, delicate గా Indirect గా Brain operation చేస్తారు.

ఈ మధ్య చలానికి వొచ్చే గౌరవాలతో పిచ్చెక్కి దొడ్డంతా పరుగు లెత్తుతున్నాడు. చిరకాల మిత్రులు మీకూనా ! కోతిమల్లే చెట్లు పాకుదా మంటే కాలునెప్పి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

12-3-57

పేరేశలింగంగారికి,

మీ వ్యాసం చాలా బావుంది. ఈశ్వరుడు మరీ మెచ్చుకున్నారు. దాన్ని తిరిగి పంపుతున్నాను. దాన్ని అట్లా వొదల వొద్దనీ పత్రికలకి పంపమనీ, అంటున్నారు ఈశ్వరుడు. వరసగా పంపుతో వుండండి తెలుగు

పత్రికలకి ఎవరో ఒకరు వేసిందాకా. తక్కింది ఈశ్వరుడు చూసు కుంటారు.

అది మరీ పొడుగు అయిందటారేమో పత్రికలవాళ్ళు అని, కొన్ని భాగాలు తగ్గిస్తే బావుంటుందని నా Suggestion. జీవితమూ ఆధ్యాత్మిక సాధనా ఎంతబాగా అర్థం చేసుకున్నారో మీరు !

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

2-4-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఒకటే సంగతి నేను వెంటనే జవాబురాస్తాను. ఎట్లాగో పోయివుండాలి నా కార్డు.

రహ్మాన్‌గారికి గాలిబిళ్ళలు లేచి పెద్ద జరం వొచ్చింది. పడక వేశారు.

మనకి సుఖమే మిగలకుండా బాధే మిగిలింది అంటే అర్థం- సుఖాల్ని చూడకుండా, బాధవేపే మన మనసు ముఖం పెట్టింది అనిఅర్థం. ఆకాశమూ, ఎండా, గాలీ; నీళ్ళూ, పూవులూ వుండగా సుఖంలేకండా ఎట్లాపోతుంది. బాధని ఆ రూపంలో మన ఇంటికి వొచ్చిన అతిథిగానూ ఆ అతిథే ఈశ్వరుడనీ చూడగలగాలి. నాకు చాతనవుననికాదు. ఇది బోధ నా గురువునించి విన్న మాటలు మీకు పంపుతున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

8-4-57

వీరేశలింగంగారికి,

మీ రెండు కార్డులూ తెలుగువిద్యార్థి పంపారు. బాగా వేశారు మీ

వ్యాసాన్ని. మంచివాన్య. మీకు రాయడం తెలీక పోవడమేమిటి ? చాలా బాగా రాశారని ఈశ్వరుడే అంటే.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-4-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. గీతాంజలి నేను అనువాదం చెయ్యలేదే ! నేను చెయ్యవలసిన Literary work ఎప్పుడో అయిపోయింది. ఇంక లేదులాగు కనిపిస్తోంది.

నేను చెయ్యవలసిన పనులూలేవు. పూర్వం మల్లే రాయాలని నాలో ప్రోద్బలమూ లేదు.

అంతా ఈశ్వరుడు చూస్తున్నారు కదూ !

నాలోంచి పిండ వలసింది పిండేసి "Be quite" అని ఇక్కడ ఇక్కడ పడేశారు. కావలసిన పనులువుంటే తన భక్తులింకెవరిచేత చేయించుకుంటారో ! చూడండి. వీరేశలింగంగారు ఎంత చక్కని గీతాలు రాస్తున్నారో ! చాలా బావున్నాయి. రెండోది loosely knit, Musings అచ్చయినాయి. కానీ కాపీలు పంపడుగా ఆ మహానుభావుడు. !

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

27 - 4 - 57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును. చిన్నారావుగారూ, రహ్మాన్‌గారూ ఇక్కడే

వున్నారు కొన్నాళ్ళనించి. రేపు వెడతామంటున్నారు. ప్రజామతలో సాహిత్య బాణం చదివారా ? మీ హృదయాన్ని మాధుర్యంతో నింపుతుంది. చదవండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

6 - 5 - 57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. భారవి అంటే ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు. పండితులు. రసికులు. వారికి అర్థమైనట్టు పూర్వ సంస్కృత కావ్యాలు ఎవరికి అర్థంకావడమూ నేను చూడలేదు. సారస్వతానికి సరైన విలువలు తెలిసిన వారు. రామచంద్రపురం హైస్కూల్లో సంస్కృత టీచరు.

మీరు వేరే చలంపైన రాయవలసిన అవసర మేముంది ? ఆ రాత ఓ వ్యాపకం అయేది. ఇప్పుడు మీ కాలమంతా ఆత్మాభివృద్ధికి, ఈశ్వరార్పణ చెయ్యవొచ్చు.

లోకమంతా జయించినా, శత్రువులనే వాళ్ళు వుండనే వుంటారు. మనం మన శక్తితో నోళ్ళు మూసినకొద్దీ వారు రహస్యంగా మన ద్వేషులవుతారు.

దిగ్విజయం చెయ్యడానికి ఒకటే ఆయుధం, ప్రేమ. దాన్ని ఎవరూ జయించలేరు. ఆ ఆయుధాన్ని మనం ప్రయోగించ నక్కర్లేదు. మన హృదయంలో వుంటేచాలు. మన ప్రయత్నం లేకుండానే అదే పోయి శత్రు నాశనం (అంటే వాళ్ళని మన శత్రువులుగా చేసే ద్వేష నాశనం) చేస్తుంది.

బెజవాడలో ఉన్నప్పుడు లోకమంతా నా శత్రువే. ఇక్కడికి వొచ్చి ప్రేమమంత్రం ఉపదేశం పొందానోలేదో, ఎక్కడినించి పుట్టుకొస్తున్నారో చలం ప్రేమికులు, ఢిల్లీలో వీరేశలింగంతో ప్రారంభం, ఇంకా ఆగలేదు మిత్ర ప్రవాహం. ఉపదేశం పొందిన ఆ మంత్రాన్ని నేను ఉపాసించి

సిద్ధి పొందగలిగిననాడు, నా రాతలన్నీ వేదాంతాలు, నా మాటలన్నీ మంత్రాలవుతాయి. ఎప్పటికో అది.

అప్పుడు మనం ప్రేమ చూపుతున్నామని కూడా తెలీదు, ఎవరికీ. కానీ ఆ ప్రేమ కష్టిస్తుంది. అదీ భగవాన్ సమక్షంలో మనుషులకి జరిగిన ఇంద్రజాలం.

కాని రాయతలచుకొంటే మీకు చాతకాకేం ? మీరు బాగా రాయగలరు, రాయడం అవసరం కనపడటంలేదు మీకు అంతే.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15 - 5 - 67

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నా సంతకం కూడా మీకంత ప్రియమూ, గొప్పా ఐతే, నాకు భయం వేస్తుంది. అంత ప్రేమని తీసుకోడానికి నాలో ఏ మాత్రం అర్హతవుందా అనీ. లేదు. ఇంకేదో రాయలని వొదులుతాను. ఇంతలో Post అయిపోతాయి.

ఉత్తరాలన్నీ ప్రచురణ అవుతాయని ఈశ్వరుడు చెప్పారు. వాటి కాలం రావాలి.

వజీర్ రహ్మాన్, చిన్నారావుగార్లు వొచ్చి ఇక్కడో పది రోజులు వుండి వెళ్ళారని రాశానా ?

ఇంకా మిత్రులు రాబోతున్నారు. వొచ్చే ఎండాకాలంలో మీరు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

28 - 5 - 57

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీ గీతాలు ఓ మోస్తరుగా ఉన్నాయి ఏమీ ? ఏదైనా చెప్పుకోవలసిందే ఈశ్వరుడితో. అన్నీ ఈశ్వరుడు చూస్తున్నారు. గొడవ పడకండి. ఆయనకి వొదలండి. ప్రతి నిత్యం ఆయనని స్మరించండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7 - 6 57

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరమూ, దాంటో quote చేసిన ఉత్తరాలూ చేరాయి.

మీ బాధ నాకు అర్థమౌతోంది,

ముందు మీమనసుని స్పష్టం చేసుకోండి. మీకు ఏంకావాలి ఆమె నించి? ఆమెకి ఏమిటి బోధిస్తున్నారు మీరు-జ్ఞానమా ప్రేమా?

తెలివిగల స్త్రీ మాటలవల్ల కదలదు. లోకంతో ఏంలెఖ్క? ప్రేమ ప్రధానం- ఇట్లాంటివి పురుషుడు సులభంగా మాట్లాడగలడు కానీ స్త్రీ ఆ ప్రకారం, మాటలతో కదిలిందా, ఆమెకి చాలా అపాయాలున్నాయి. ఆమెను భరించగల శక్తి మీకెంత వుందో పరిశీలన చేసుకున్నారా ?

ఏదయినా, ఉత్తరాలవల్ల ఏం ప్రయోజనం? కలుసుకుని మాట్లాడండి.

ఇంట్లోవున్న మీభార్య Pointని అర్థం చేసుకో చూడాలి కూడా మీరు. స్త్రీకి ఎప్పుడూ ఓ గృహాన్ని పదిలంగా పెట్టుకుని, దాంటో తలదాచుకోవాలని వుంటుంది. అది ఆమె instinct. ఇంకో కొత్త స్త్రీ వొచ్చినా, ఆమె కూడా అదే కోరుతుంది. గాలిలో తేలిపోదామనే, కవిత్వాలూ, వేదాంతాలు,

సరదాలే గాని జీవితం గడుపుకోడానికి ఆధారాలుగా ఏ స్త్రీ తీసుకోదు. మాటలేగాని పురుషుడు మాత్రం ఎక్కడ నిలవ గలడు.

"నన్ను అర్థంచేసుకో" అని రాస్తున్నారు ఆమెకి. ఏమిటి అర్థం చేసుకోవాలి! ముందు మిమ్మల్ని మీరు అర్థం చేసుకోండి. మీ కోర్కెవల్లా, emotion వల్లా carry out అయిపోకండి.

మనకి అందమైన స్త్రీని చూడగానే కలిగే భావోద్రేకంవల్ల మన జీవితాన్ని ఆమె జీవితాన్ని నడపలేము.

నేను చేసే ఈ బోధన అంతా మీ ప్రేమ వ్యవహారానికి ఏమీ సహాయం చెయ్యదు. కానీ జీవితంలో ఎప్పటికో సహాయపడతాయని రాస్తున్నాను.

బాధనీ వాంఛాగ్నిని మీలో ఇముడ్చుకోగల లోతును సంపాయించండి. కవిత్వంతో కళ్ళు కప్పుకోకండి. ఆ లోతును ఎంత ప్రయత్నించి సంపాయించు కోలేక చాలా ఉపద్రవాలు తెచ్చుకున్నాను— అంతకన్న విషాదం, నన్ను నమ్మినవారికి తెచ్చాను. హైటన్ హైగస్ కాకండా చూసుకోండి.

ఇట్లాంటివి మనలో చాలావరకు నమసిపోతేనేగాని, అరుణాచలానికి పిలుచుకోరు ఈశ్వరుడు- ఈశ్వరుడికీ హైటన్‌గారికీ మధ్య నలిగిపోతారనే దయవల్ల.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-6-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. సరే. తీరిపోయింది. మీ రాసించే విధమైనవి ఈనాటి ప్రపంచంలో కుదరడం కష్టం.

మీరు ఈ వ్యవహారానికి సరైన విలవనిచ్చి ఇంకా ఈశ్వర పాదా లకు దగ్గిర కావడం సంతోషం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

21-6-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీ కోర్కె రేపిన మీ ఆశలవల్ల, మీ కలలవల్ల బాగా బాధపడుతున్నట్టున్నారు.

కానీండి తీర్చుకోండి ఈ సంస్కారాల నన్నిటినీ అక్కడే. Strain చెయ్యకుండానే Blue వంక చూస్తోవుంకడండి. గోడలూ దూరమూ అభ్యంతరకరమైనప్పుడు imagination లో.

Blue కాదు Srtain కావలసింది. మన మనస్సు strain కావాలి.

నా చీకటిని జల్లించి

దిగిన తేజాన్నంత కరుణ పోసి వొందరా?

అని పాడుతున్నారు K. S.

అంతపని జరగాల్సివుంది ఇంకా.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

28-6-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. కోర్కెలు ఏడిపిస్తోవుంటే వాటిని వొదిలించుకోవాలని చూస్తున్నారు కదా! జయించగలుగుతాము లేక జయించలేక పోతాము.

కాని ఆ కోర్కెల్ని romantise చేసుకుని, వాటికి కవిత్వాలు కలిపి, Mutual understanding అనుకుని, వాటిలోనే జీవిత సాఫల్యం అనుకుంటే అవి మరింత బలమౌతాయి కద! కోర్కె-సాగినప్పుడు దాన్ని romance అని అది భగ్నమైనప్పుడు దాన్ని పాపం- అంటే ఏ విధమైన బలం కలుగుతుంది? మీరు ఈశ్వరుడికి ఎట్లా దూరమౌతారా? దూరం కాలేరు ఆయన. అందుకే ఈ అపజయాలు, ఆ బాధ. సరిగా కనిపెట్టారు మీరు.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

4-7-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. సరే. అట్లాగే చదవండి. వీలైతే భాగవతం కూడా చదవండి.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

13-7-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీరు పోతన్నగారిని గురించి విన్నది కట్టుకథ అయి వుంటుంది. భాగవతం రాసిన వారికి విష్ణు శివ భేదం వుంటుందా? ఆయనే రాసుకున్నాడంటే ఇంకేమంటాము? విష్ణువు ముక్తినియ్యలేడనే సందేహం తోనేనా అంత భాగవతం రాసింది?

ఏదో వింతగా వుంది.

ఎవరో చేర్చిన పద్యమూ కావొచ్చు అది. ఏ శివభక్తులో విష్ణు

విరోధులో! ఎట్లావొస్తేనేం అవి ఎట్లా పోతేనేం, భగవాన్ శిష్యులం. మనకి అంతా వొకటేకద !

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

30-7-57

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఈనాడు నాకు కలలు ఈశ్వరుడి పాదాలవేపుకి arrow marks. కలలు కంటున్నామంటే ఈశ్వరుడి వేపు ప్రయాణం సాగించడం ప్రారంభించా మన్నమాట. మనకి కలలు వున్నవే అవి realise కావాలనే మనసులోని demand చాలా misleading. కలలు వుండేది realise కావడానికి కాదు మనని ప్రస్తుత జీవితం నించి ముందుకు సాగమని పిలవడానికి ఈశ్వరుడే లేకపోతే అవి వుత్త ఎండ మావులు.

కలలు disappoint చెయ్యడం ఒకబాధే. కాని అవి realise కావడం అంతకన్న Tragedy. అదృష్టవంతులకి కొత్తకలలు మొలకెత్తు తాయి. దౌర్భాగ్యులకి కలలలో విశ్వాసం పోతుంది.

అన్నిట్లోకీ పెద్ద కల ఈశ్వరుడు. అదొక్కటే మనని disappoint చెయ్యని కల. కలలు కనడం- ఒక మధురమైన అనుభవం. అది మీలోవుండే అపురూపమైన Poetic quality. దానికి అర్థం అదే. ఆ కలల్ని ప్రపంచంలో అనుభవంలోకి మార్చుకోవాలని చూస్తే వ్యథ. అవి realise అయితే ఇంకో వ్యథ.

జీవితం నడకే అది— కోర్కె, అది తీరుతుందని ఆశ. తీరితే దాంట్లో నిలవలేక దానిపైకోర్కె.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

28-8-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఏదో పోసింది. మనగొప్ప ఈలోక వ్యవహారాలకి సంబంధించింది కాదు. నిష్కారణ ద్వేషం రేపుతున్నామనడం, నిశ్చయమైన గుర్తు మనం అభివృద్ధి చెందుతున్నామని.

ఇక్కడ వర్షాలు లేవు. కాని నేను వానని భరించలేను. తీపి తినాలనిపిస్తే అదే తినండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-10-57

వీరేశలింగంగారికి.

మీ అందమైన ఉత్తరాలు; ఈశ్వరుడు ఏమి రాయిస్తే అది రాస్తాను. కాని నాకేమీ రాయాలని లేదు.

నా ఆశయమల్లా. జీవించాను, జీవిస్తున్నాను. అనే మరుపు ఎప్పుడు వస్తుందా అని.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

2-11-57

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. అవును. మీ observations అన్నీ చాలా బావున్నాయి. నిజంగానా. రమేష్ అనే చిన్నకుర్రాడు రాసినది.

వచ్చె వచ్చె
ఏమి వచ్చె
మూడ వచ్చె
ఏమి మూడ
(వెంకట) చలం ఆవు మూడ
ఏమి ఆవు
తెల్ల ఆవు
ఏమి తెల్ల
వెంకట చలం గడ్డం తెల్ల
ఏమి గడ్డం ?
యోగి గడ్డం
ఏమి యోగి
అరుణాచలం యోగి
ఏమి అరుణాచలం ?
భగవాన్ అరుణాచలం
ఏమి చలం
వెంకట చలం

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

14-11-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. యువకుడికి పెళ్ళిచేసుకోవొద్దని ఇచ్చే సలహా ఎట్లా

వుంటుందంటే, ఆహారంవల్ల చాలా ప్రమాదాలున్నాయి, తినవొద్దనడం లాగుంటుంది.

నేనూ మూకుడు సలహాలు ఖచ్చితంగా ఇవ్వడంలో చాలా ప్రవీణుణ్ణి. నా సలహాలకీ విమర్శలకీ జవాబు కొందరు ఇవ్వరు. జవాబు లేక కాదు, నా పైన గౌరవం వల్ల.

"పెళ్ళిచేసుకోక, ఏం చెయ్యమంటావు ? ఎందుకు, దేనికి బతకమంటావు ?" అని ప్రశ్నిస్తే మనమేం జవాబు చెపుతాము.

"ఈశ్వరుడు" అనడం తప్ప ఏం చెప్పగలం ?

"నువెంత మాత్రం సాధించావు ?" అని ఎదురు అడుగుతాడు మనల్ని.

పెళ్ళిగాని సంబంధం అన్నామా, దాంట్లో ఎన్ని బాధలున్నాయో చెవుతారు. Charity and understanding అవసరం.

పెళ్ళి చాలామందికి బాగానే వుంటుంది,జీవితమంతా. అంతకన్న ఏమీవాంఛించరు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

23-11-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును ఆ Charity లేకనే నేను అన్యాయం చేసుకున్నాను. ఇతరుల యెడల క్రూరంగా ప్రవర్తించాను. ఆ విశాలదృష్టి వుంటే, నా పుస్తకాలలో అంత అసహనమూ, తిట్లూ వుండేవికావు.

ఇక్కడ నేర్చుకుంటున్నాను.

ఇంకా రాలేదు.

వేపుడు వియ్యం ఎట్లా చేస్తారో కనుక్కొని రాయండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

30-11-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు, మీ జరం ఈపాటికి తగ్గి వుంటుంది.

ఈశ్వరుడు నన్ను వియ్యం గింజమల్లే వేయిస్తున్నారు. సరిగా వేపు జరుగుతుందో లేదోనని మిమ్మల్ని అడిగాను.

ఈ పాటికి జరం తగ్గివుంటుంది. ఏమైనా ఈశ్వరుడు మీకు విభూది పంపమన్నారు.

ఈ వూళ్ళో దీపోత్సవం.

గొ॥ వెం॥ సు గారినీ, B. V. N. గారినీ expect చేస్తున్నాము, వాళ్ళిద్దర్నీ కూడా నాతో ముూకుడులోకి లాక్కుందామని.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-12-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. చాకిరీ లేకపోతే హాయిగా కూచుంటాము చదువుకుంటాము-అనుకుంటాం గాని ఒక్కయోగులకే చాతనవుతుంది. మనం వృత్త

సోమరులమై అనేక పోకిళ్ళకి పోతాము. పుస్తకాలు ఎంతకాలం సుందర లోకాలలో నిలపగలవు.

తయారుకావాలి మనం, నిర్వృత్తికి- అప్పుడు పని వుండనూ వుండదు- వున్నా గుచ్చుకోదు. అన్నీ వొదులుకుని, ఉద్యోగంనించి, జీవితంనించి, retire అయిన నన్ను పనిలేకుండా కూచోనీరు ఈశ్వరుడు. నాకిష్టం లేని పనులూ చేయవలసిందే! అంటే నేనూ ఇంకా సిద్ధం కాలేదన్న మాట! చూడండి ఈ ఉత్తరాలు రాసేపని!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

24-12-57

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీరనేది నాకర్థ మవుతుంది. కాని రాయాలంటే నాకేం తోచదు.

మీరిక్కడ కొన్ని రోజులువుండి, నాకు స్నేహమైవుంటే, ఈశ్వరుడు కాక, కొంత Personal సంబంధం వుండేది. ఇప్పుడు ఏమీ కనపడదు రాయటానికి.

నా Publishers వ్యవహారం కోర్టుదాకా వెళుతోంది. ఈమధ్య కొన్ని రోజులు ఆ కాగితాలలో గడిపాను.

ఏమి ఆంధ్రులండీ బాబూ!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-1-58

వీరేశలింగంగారికి,

మీ కార్డు. పబ్లిషరు ఇంకెవరు ? దే-అయనే. వ్యవహారం ఒక చిక్కు కాదు.

భగవాన్ వ్యాసాల పుస్తకం ఎవరు అచ్చు వేస్తారు.

బావున్నారా ?

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

26-1-58

వీరేశలింగంగారికి,

మీ కార్డు. భగవాన్ పుస్తకం అచ్చువెయ్యటానికి 500/రు అవుతుంది. సరే, ఎవరో మీవంటి భక్తులు చందాలిచ్చి అచ్చు వేయిస్తే, తరవాత ఆ కాపీలు ఏం చేసుకోవాలి ? ఉచితంగా ఇచ్చినా చదివేవారు ఓ పదిమంది కనపట్టం లేదు.



బావున్నాము.



ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*



5-2-58

వీరేశలింగంగారికి,

మీ కార్డు. తక్కిన తొమ్మిదిమంది నాకెక్కడ దొరుకుతారు ? భగవాన్ తీసుకొస్తే తప్ప ! నే నెవరికీ రాయలేను. నా చేతకాదు. చాతనైనా వారు ఎవరైనా పూనుకోవలసిందే.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

7 - 3 - 58

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఇట్లాంటి ఏమీతోచని Blank periods వొస్తాయి. వాటిని ఎట్లానన్నా ప్రయత్నించి గెలవాలి.

ఈశ్వరుడు మిమ్మల్ని జపం గట్టిగా చెయ్యమని రాయమన్నారు.

Take interest in others and forget your mood-says chalam.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

20 - 3 - 58

వీరేశలింగంగారికి,

Evelyn underhill రాస్తోంది, మీ స్థితిలోవున్న ఒక ఆయనకి.

The present abnormal conditions are as bad for the spiritual life. We are all finding it difficult and most of us are failing badly.

The material world and its interests, uproars and perplexieties are so insistent, that, that detachment is almost impossible :........

Transcendence of the here and now demands at present a strength of will and a power of withdrawal which very few possess.

All the same, of course, it is essential to hold on as well as you can and make a resolute and regular art of willed attention to God at the times set apart for

prayer-only do not fuss at the poor and unappetisin results.

The 'will' is what matters, and so long you have that you are safe and anything achieved now when you are to ssed back to this state, is worth far more than the enjoyable prayers you could not help. I know well the condition in which spiritual things seem secondary and unreal-It is not pleasant-but you cannot force yourself into the mood in which they will seem real again-It will come back-in its own time. Meanwhile your duty is to act on your inner knowledge and conviction and put all questions of feeling on one side.... you are like a person who gets in to a fog in the mountains and can only see a few bits of moss in the immediate neighbour hood. The thing is to trsu your compars, plod quietly on and avoid getting fussed. you will find it alright in the long run.

అంతకన్న నేనేం రాయగలను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

30 - 3 - 58

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం, ఆధ్యాత్మిక ప్రయాణంలో మీరు పొందేలాంటి వ్యధ తప్పనిబాధ. అటువంటి స్తితి మీకు వొచ్చిందంటే మీరు సంతోషించాలి. దీని వల్ల నే తెలుస్తుంది, ఈశ్వరుడు మిమ్మన్ని మరిచిపోలేదని, మీ లోపలి నించి శుభ్రం చేసుకుంటో వస్తున్నారని. ఇట్లాంటి యాతనలు చాలా పడాలి

సాధకుడు. ఇది సులభంగా అందే స్థితికాదు. మీరు Mystics జీవితాలు చదివితే మీకు తెలుస్తుంది. ఇది కడపటి యాత్రలో తప్పక తగిలే యజారి భూమి అని. చాలా ఆడవుల్లోంచి దాటుకు వొచ్చారు. ఇప్పుడు యజారి తగిలింది.

ఎక్కడన్నా దొరికితే Autobiography of Maharshi Devendranath Tagore చదవండి. గీతాంజలి చదవండి; టాగూర్ పడ్డ యాతన తెలుస్తుంది.

అట్టే మారంలేదు. త్వరలోనే డిమ్లీ వించి కదులుతారు. తన భక్తుల్ని తన దగ్గిరికి పిలుచుకునే సమయం దగ్గిరికి వొస్తోంది.

1962 ఫిబ్రవరి లోపల ఈ లోకానికి ప్రళయం రాబోతోంది. ఈ ఈ అవినీతి, అధర్మం నశించబోతున్నాయి.

Destruction తాండవ మాడబోతోంది. ఇప్పటినించే Signs కన పడుతో వుండవచ్చు. 1961 నించి intenseగా తెలుస్తుంది. ఆలోపల మీకు అరుణాచల నివాసం ప్రాప్తిస్తుంది. అందుకనే మీ Spiritual growth ని accelerate చేస్తున్నారు ఈశ్వరుడు. ఏమీ గొడవ పడకండి. టాగోర్ అన్నట్టు- Dawn కోసం silent గా ఎదురుచూసే Midnight మల్లే ముడుచుకొని కూచోండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

14-4-58

పీవేశలింగంగారికి,

మీ ఉత్తరం. అవును.. ఇండియాకి, అన్ని దేశాలకి, ఈ భూలోకా నికే ప్రళయం. కలియుగాంతం. కృతయుగ ప్రారంభం. ప్రళయమనేది ఈ అవినీతిని, అధర్మాన్ని తుడిచి వెయ్యడానికే రాబోతోంది. మీరు అనే

అధర్మమూ అవినీతి ఎక్కడ వున్నాయి? మనుషుల్లోనే. వాళ్ళు బాధ పడితేనేగాని బుద్ధిరాదు. పాపం మరీ పెచ్చుపెరిగి, ఇంక అలివిగాని దుష్కర్మ పెరిగినప్పుడు ప్రళయం వొచ్చి ఆ కర్మ ననుభవింపచేసి లోకాన్ని చక్కబరుస్తుంది.

మీరీనాటి పత్రికల్ని చదివి, మనసును Confuse చేసుకుంటున్నట్టుంది. శాంతి ఎవరికి కావాలి? మీకా? లోకానికా? మీ వ్యాసంలోనూ ఈ Confusion కనపడ్డది. మీ ఉత్తరాల్లోనూ అంతే.

వ్యక్తికి శాంతి వొచ్చే సాధనలు వేరు. ప్రపంచానికి శాంతి వొచ్చే పద్ధతులు వేరు. ప్రపంచ శాంతికి మనం చెయ్యగలది స్వల్పం. చేయగలిగిన వారు చేసి వూరుకుంటారు. ఈనాటి Political and literary heads మల్లే ప్రపంచ శాంతి అంటో చిందులు తొక్కి తక్కిన మనుషుల్ని ఇట్లా వుండండి అని order ఇచ్చి తమ ధర్మం తీరిందని వూరుకోరు. ప్రపంచ శాంతికై మీరు ఏం చెయ్యలేరు. నేను ఏం చెయ్యలేను- దాన్ని వొదిలి మన శాంతి సంగతి చూసుకుంటే మంచిది. అది స్వార్థమని ఎక్కిరిస్తారు-కాని స్వార్థమనే మనుషులు వారేమాత్రం ఆ శాంతిని తీసుకొస్తున్నారో పరీక్షించండి. వృత్త కనుకప్పు అరుపులు.

ఏక దీక్షపైన మన మనసు నిలపపెట్టక, ఇట్లా అనేకమైన issues confuse చేసుకోడం వల్లనే అశాంతి బైలుదేరుతుంది. ఆ అశాంతివల్ల మీకు బాధేగాని ప్రపంచానికి జరిగే ఉపయోగమేమీలేదు.

అధర్మం చేస్తున్నాము అనే జ్ఞానంకూడ లేకండా సంచరిస్తున్నారు ప్రజలు. ప్రభుత్వాలేం చేస్తాయి? ఈ ప్రజలు ఎన్నుకున్నవారేగా! వీరి వంటి వారే వారూను.

కనక ధర్మమూ సత్యమూ అనేవి వున్నాయని వాళ్ళని చూసేట్టు

చెయ్యాలి. రెండు యుద్ధాలు ఏమీ చెప్పలేకపోయినాయి. ఈసారి యుద్ధం కాదు. ప్రళయమే బుద్ధి చెప్పబోతుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

30-4-58

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అరుణాచలం నించి ఆనందఝరి ఎప్పుడూ ప్రవహిస్తో వుంటుంది.

కాని దాన్ని పానం చెయ్యగల వారెవ్వరు?

విశ్వాసంతో వుండండి.

అన్నీ చక్కబడపోతున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

22-5-58

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీ మనసులో అనిపించడం మంచివే అనిపించేట్టు చేసుకోండి. పోనీ ఏది అనిపిస్తే అదిమంచిగానే పరిణమించకూడదా! వున్న గొడవలు చాలవా? ముందు వొస్తాయి అనిపించే వాటి భయాలు కూడా పడడమెందుకు?

అరుణాచలానికి దూరం కావడం దగ్గిరకావడం, మనుషుల ఇష్టాలలో లేని కాలం వొస్తోంది. మనిషిని తన ఇష్టానికి తనని వొదిలి చాలా కాలం చూశారు ఈశ్వరుడు. ఇంక సంగతులు బిగుసుకో పోతున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

5-7-58

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీకు కలలో దర్శనమిచ్చింది దేవి. పరమేశ్వరి. జగజ్జనని.

ఆ కలలకి అట్లాంటి అర్థాలూ, ఆశలూ, చెప్పుకోండి.

నేను గీతాంజలి తెలుగు చేస్తున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-7-58

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అర్థమయింది. కాని మనుష్య ప్రయత్నమనేది వుంది కద! పైగా ఈశ్వరుడి సహాయంవుంది. 'మనిషిమారడు' అనే వేదాంతం అబద్ధం. ప్రయత్నించండి. ఈశ్వరుణ్ణి ప్రార్థించండి.

యలమంచిలిలో గుంటూరు లక్ష్మీకాంతం అనేవారిని కలుసుకోండి. ఆయన కలకత్తాలో B. N. R. రైల్వే retired ఉద్యోగి. నేను కలుసుకోమన్నానని చెప్పండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7 - 8 - 58

వీరేశలింగంగారికి,

మీ కార్డు. బద్ధకంగాని, నిర్లక్ష్యంగా పని చెయ్యడంగాని ఏమీ ఉపేక్షించవలసిన గుణాలు కావు. ఏ పనిలో ఎక్కడవున్నా అక్కడ ఈశ్వరుడు ఉంచారనే విశ్వాసంతో, శక్తినంతా వినియోగించి పని

చెయ్యాలి. అందులో school లెఖ్ఖలు ఎంత పని ! మనకి జరిగేవన్నీ మనం కోరుకుంటేనే జరుగుతాయా ?

విశ్వాసంతో వుండండి.

బడి పిల్లల మొహాల్లో ఈశ్వరుణ్ణి చూడడానికి ప్రయత్నించండి.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

13-9-58

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీ మనసులోది నాకు రాస్తున్నారు, మిత్రుణ్ణి కనక (పైగా నన్ను గురుదేవా అనికూడా రాస్తారు). నా మనసులోది రాయకుండా వుండలేను.

మీ బడిపిల్లలకి చదువు చెప్పండి. ఆడుకోండి ఏమన్నా చెయ్యండి. ఏదిచేసినా ఈశ్వర ముఖం చూసి, ఈశ్వరుడు మీకు నియమించిన కార్యంగా చెయ్యండి. అధికార్లకి భయపడక పోయినా, ఈశ్వరుడికో, మీ అంతరాత్మలో వున్న ఈశ్వరుడికో భయపడండి. బాధ్యతలు భయమే-కాని వహించాలి.

బద్దకించే వారికి, ఆధ్యాత్మిక సాధన దూరమౌతుంది. పనిలో వ్యర్థులు, సాధనలో సమర్థులు అవుతారా ?

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

27-9-58

వీరేశలింగంగారికి,

మీ కార్డు. పనిలో ఆనందం వుండనీ, లేకపోనీ చేసితీరాలి. మనం జీతం తీసుకున్నందుకు, మనం పనిచేసితీరాలి. లేదా ధీరులమల్లే వొదిలెయ్యాలి వుద్యోగాన్ని. నిర్బంధం ఎట్లానూ తప్పదు. సోమరితనం అనే

నిర్బంధం తన్న పని చాలానయం. ఇతరులు పెట్టింది నిర్బంధం. మనము మనకై పెట్టుకునేది నిర్బంధంకాదు.

పిల్లల్ని ప్రేమగానూ చూడాలి. discipline లోనూ వుంచాలి. నా 'బిడ్డల శిక్షణ' గోల అంతా ఏమిటి ?

మనం ఈశ్వరుడి దగ్గిర పిల్లలం. ఆయన బడి ఈలోకం-బిడ్డల శిక్షణని మీకు Apply చేసుకోండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-11-58

వీరేశలింగంగారికి,

మీ Express ఉత్తరం. ఈపాటికి నా కార్డు అందే వుంటుంది. పాపం, ఎంత బాధ కలిగించానో మీకు-కాదు భయం.

నాకు Flue వొచ్చింది. చాలా బాధపడ్డాను. దానినించి తేరుకో లేకండా వున్నాను. చాలానీరసం.

జీవితమంటేనే ఓ పెద్దవొంతు బాధపడాలి. చాతనైతే ఈశ్వరుడిచ్చే వరంగా చూసుకుంటో.

ఇంకేం రాయమ ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

26-11-58

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నా ఆరోగ్యం ఇంకా కుదట పడలేదు. పడిపోకండా ఈశ్వరుడు చూస్తున్నారు కాదూ! గొడవ పడకండి. పైగా మీ వంటివారి

ప్రార్థనల్ని ఈశ్వరుడు తోసెయ్యగలరా? త్వరలోనే బావుంటాను. అదుర్దా పడకండి. కాని ప్రేమఅట్లాంటిది. ఎంత మధురమో అంత హడలకొడుతుంది.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

8-12-58

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నా ఆరోగ్యం సరిగా అయింది. Basic training వాతావరణం బావుందా? నాకా ట్రెయినింగు వివరాలూ, అది ఎంత వరకు పిల్లల చదువు బాధల్ని మాన్పుతుందో తెలుసుకోవాలని వుంది. కనక ఆ విద్యావిధానాన్ని study చెయ్యండి.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

23-4-59

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నాకళ్ళు చదవనీటంలేదు. చీకట్లోనే రాస్తున్నాను, కళ్ళజోడు లేకండా. గీతాంజలి నచ్చిన వారు ఎవరూ కనపడక ఒక్కరి హృదయమన్నా కదలదా అని దిక్కులు చూస్తున్ననాకు, మీనించి అంత మంచి మెప్పు ఎంతో సంతోషాన్నీ విశ్వాసాన్నిచ్చింది. చలం పోనీ టాగూరన్నా పలకలేదు ఈ తెలుగు హృదయాల్లో. ఈశ్వరుడు సరేసరి.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

1-5-59

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. అవును. సంజీవ్‌దేవగారు చలం కొత్తగా సంపా

యించుకున్న అమృత హృదయం. అవును. ఆయన కళావేత్త. కళారాధకులు. కొన్ని ఏళ్ళనించి ఆయన పేరుని పరదేశాలెరుగును. కొందరు పరదేశీయులు ఆయన్ని గుర్తించడంవల్ల, ఆయన స్వదేశీయులైన ఆంధ్రులు కళ్ళు తెరిచారు.

ఆయనది బెజవాడ-తెనాలి మధ్యవున్న తుమ్మపూడి. ఇప్పుడు B.V. నరసింహారావుగారూ, చిరంజీవిగారూ, దేవ్‌గారూ మొదలైనవారూ, తుమ్మపూడి చంద్రం తరచూ అక్కడ కలుసుకొని దేవ్‌గారి ఇంటో సారస్వతం, Art, మొదలైనవి తాగుతో వుంటారు. ఆ పాత్రల్లోని దాంటోంచి చలాన్ని కూడా తాగుతారు. ఇంకా కొద్దిమంది వున్నారట. ఆ బృందంలో గొ. వెం. సు కూడా. వారు ఓ పదిరోజుల్లో నా దగ్గరికి యాత్ర వస్తారుట.

చలం చరిత్ర పంపుతా నన్నానుకద! దానిసంగతి ఏం రాశారు కారేం?

ముందు గీతాంజలి కొంటేకద మీ ఆంధ్రులు! అది చదివితేకద! అది అర్థమైతే కద! మారేది. పాపం B. V. N. గీతాంజలి కాపీలను సంస్కార ప్రభువులకీ, officers కీ, కవులకీ ఇచ్చి ఈ పుస్తకంతోనైనా వారిని చలానికి సుముఖుల్ని చెయ్యాలని యత్నిస్తున్నారు. కాని చలాన్ని కిందికి లాగడానికి ఈ గీతాంజలిని ఆయుధంగా ఎంతవరకు ఉపయోగించ వొచ్చునని చూస్తోంది ఆ తెలుగుదేశం.

ఎంతెంత అహంభావాలకీ, అధికార్లకీ ధనానికేకాక, ఇంక దేనికీ తమ తలలు వొంచరుకద! అక్కడ మాత్రం చెప్పులు నాకుతారు!

కసిగా పొద్దున్న ఓ ఉత్తరం రాశాను. ఇంక రాయను- ఆ దేశం సంగతి నాకు తెలీనట్టు కొత్తగా ఈ కొట్లాట ఎందుకు?

మీ వంటివారి హృదయాలకు, ఓ నాలుగింటికి వచ్చింది గీతాంజలి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-6-59

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరెంత బాగా అర్థం చేసుకున్నారో మనలి ఖయ్యాంని.

నేను బాగా చేశాను తర్జుమా! కాని ఆ ఇంగ్లీషు చదువుతో వుంటే, దాన్ని తెలుగులోకి తీసుకురాగల ననే సాహసానికి సిగ్గుగా వుంది.

కాని అంతకన్న గతిలేదు. మీకే జన్మలనించి వొచ్చిందో ఈమనో విప్లవ సాహిత్యాలపై ఎంత సునిశిత దృష్టి పుటకతో వుందో ఆశ్చర్యం. అందువల్లనే మీరు అరుణాచలం మనుషులు, ఈశ్వరుడు ఆశ్రమం స్థాపించి సాధకుల్ని తీసుకుంటున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

24-6-59

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అదేమిటి? మీ ప్రతి ఉత్తరానికీ జవాబు రాస్తున్నాను. ఎందుకు అందలేదో!

పాపం! ఈరోజుల్లో కూడా మీ D-I. గారికి ఈశ్వరుడి సంగతి అంతే తెలుసు. అట్లాంటి నమ్మకస్తులకన్న నమ్మకం లేనివారు ఎంత

ఉదారులు, బుద్ధికలవారు! దీన్ని ఈశ్వరుడు ఆశ్రమంగా మార్చారనీ, సాధకుల్ని తీసుకుంటున్నారనీ రాశాను కామా!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7-7-59

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఈ ఆశ్రమం ఉన్నదానికే పేరు పెట్టారు. అంతేగాని మీకు రాయతగ్గ మార్పేమీలేదు.

మీరీ ఆశ్రమానికి రావడం-మీ చేతులోనేవుంది. ఈనాడు రావాలంటే ఈనాడే రాగలరు. కట్లు బైటలేవు. ఉన్నది మనసులోనేనని మీకూ తెలుసు. మనసుని మనసే స్వాధీనం చేసుకోవాలి ఈశ్వరానుగ్రహ బలంతో.

మీ పేరు ఎప్పుడో రిజిష్టరు అయిందని మీకు తెలుసుకద!

ఈశ్వరాశ్వీరాదాలతో

చలం

*

18-7-59

వీరేశలింగంగారికి,

మీ కార్డు. పార్వతీశంగారు అదృష్టవంతులు. ఆయనచేత నేను గురువు ననిపించుకోడం నాకు సిగ్గు.

మీరు సరైన సలహా నిచ్చారు ఆయన విషయమై.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

27-7-59

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఈశ్వర పూజ చెయ్యండి. అన్నీ పటాపంచలవుతాయి.

సువార్తల్ని తెలుగు చెయ్యడంలో నిమగ్నుణ్ణి అయివున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

1-8-59

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఈశ్వరుడు, ఈశ్వరీ ఒకటే అని తెలిసిం తరవాత ఎవరిని అర్చించినా ఒకటే. మీరు రమణ మంత్రం చేస్తున్నారు కదా! అదే చెయ్యమన్నారు ఈశ్వరుడు. అవును బైబిల్లోని Gospels నే తెలుగు చేస్తున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

14-9-59

వీరేశలింగంగారికి,

చలం చరిత్ర వొచ్చిందా! బ్రహ్మసమాజంలో అలిఖితమైన నిబంధన ఒకటివుంది. "ఈవాళ చెయ్యవలసిన పనిని కనీసం రేపటిదాకానన్నా ఆలస్యం చెయ్యి" అని.

ఇంకొంచెం వోపిక పట్టండి. పంపిస్తారనే నా ఆశ.

సత్యవతి టీచర్‌గారు ఘోరమైన పరిస్థితులు రాస్తున్నారు, మీరేమీ సహాయం చెయ్యలేరా?

మీరు పంపిన M. O. అందింది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

25-9-59

వీరేశలింగంగారికి,

మీకీ పాటికి "చలం" అందివుంటుంది.

రామశాస్త్రిని అట్లా తోసెయ్యడానికి వీల్లేదు. అతన్ని తారకం అని పిలుస్తాము. అతను 30 ఏళ్ళకి పూర్వం- అతని prospects ని ప్రేమ కోసం వొదులుకుని- పిఠాపురం దివాను అయే Chance ని పోగొట్టుకొని, హరిజన యువతిని ప్రేమకై పెళ్ళి- చేసుకున్నాడు - మొక్కపాటి రామ్మూర్తి మేనల్లుడు. ఆనాడు నేనూ రామ్మూర్తి తప్ప అతని వెనక నిల బడిన మనిషి అన్నవాడు లేడు చూశారా, శాస్త్రి అన్నపదం మిమ్మన్ని ఎంత Mislead చేసిందో!

కురంగేశ్వర్- ఇక్కడే వుంటాడు. సంవత్సరంలో చాలా భాగం- ఈ గత మూడు సంవత్సరాలనించి అందుకనే అంత కొంచెం లేఖలు. పైగా నన్ను 'నాన్నా' అని పిలిచి, తనని 'మీరు' అని నేనంటే అసలు పలకడు. నేను 'మీరు' అని రాసినవన్నీ నువ్వు అని దిద్దుకుని- కూడా వుంటాడు.

కానీ నా మనసులో 'మీరుకీ నువ్వుకీ' భేదం వుందా !

వీరేశలింగం యుగం, రహ్మానూ, కురేంగేశ్వర్ యుగాలకన్నా పూర్వంది. అందుకే ఉత్తరాల కెక్కలేదు. పైగా చాలా కాలంనించీ వజీర్ రహ్మాన్ ఇక్కడే వుంటున్నారు.

మీరట్లా నొచ్చుకోకండి. భగవాన్‌తో నేను అన్ని ఏళ్ళల్లోనూ మాట్లాడింది మూడు మాటలు. నన్నాయన పలకరించిందీ అంతే. కాని

ఆయనతో అన్నిగంటలు కాలం గడిపి, ఆయనపైన పెద్దపెద్ద కవిత్వాలు, వ్యాసాలూ రాసిన వాళ్ళందరూ ఇప్పుడేరి?

చలం లెఖ్ఖేమిటి?

ఈశ్వరుడి దృష్టిలో మీరెంత నిలిచారో, మీకేంతెలుసు, నాకేం తెలుసు?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-10-59

వీరేశలింగంగారికి,

మీ కార్డు, మీరెప్పుడు ఏముఖ్య విషయం రాసినా దాని హృదయం లోకి వెళ్ళిపోతారు. చలం పుస్తకానికంతా సూత్రం మీరు పేర్కొన్న "సౌరిస్" అరుణాచలంనించి లేఖ! ఇంతవరకు దాన్ని గుర్తించి రాసిన వారు లేరు. మీ ఉత్తరంతో పాటే ఇంకో మిత్రుడు కూడా ఆ సంగతే రాశాడు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

26 - 10 - 59

వీరేశలింగంగారికి,

మీ కార్డు. దీక్షితులుగారు నా ఉత్తరాల్ని దాచివుంచారనేదే చాలా ఆశ్చర్యం? రామ్మూర్తి దాచివుంచాడు. కాని అతని సామానులన్ని చెల్లాచెదరైనాయి అతని చావు తరవాత. అహోబలరావు గారికీ, తారానాథ్ గారికీ, నేను ఉత్తరాలు రాసినవి చాలా స్వల్పం.

ఈనాడు చిన్నారావు గారికి రాసినవీ, ప్రసాద్, రుక్మిణీనాధ శాస్త్రీ గారికీ, వీరేశలింగంగారికి రాసినవి అచ్చయినాయి గనకనా? కురంగేశ్వర్

అచ్చేసిన ఉత్తరాలు అమ్ముడుపోతున్నాయా? ఎవరికి కావాలి ఆ ఉత్తరాలు. దీక్షితులుగారికి ఉత్తరాలు అమ్ముడు పోతున్నాయా? లేదు.

ఆయన మొగవారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

5-11-59

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నేను రాసిందేమిటంటే దీక్షితులుగారు Man ,Male. కనక, ఆయనకి నేను రాసిన ఉత్తరాల్లో శృంగారం లేదు గనక, అవి అంత Popular కాలేదని. కాని ఆయన మగతనాన్ని గురించి రాయలేదు.

ఈశ్వరుడు అన్నారు. నేను మీకు రాసిన ఉత్తరాలు గొప్పవని. వజీర్ రహ్మాన్ కూడా ఆ ఉత్తరాలు విలవైనవని చెప్పారు. కనక ఉత్త రాల్ని ప్రచురణకు సిద్ధంగా వుంచుకోండి. అవి ఎప్పుడు అచ్చు కావాలో అప్పుడవుతాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-11-59

వీరేశలింగంగారికి,

వజీర్ రహ్మాన్ పకపకని పెళ్ళి చేసుకున్నాడు. అతను చదువు కొంటున్నాడు కనక పకపక ఇక్కడేవుంది. అందుకని శలవుల్లో, ఇక్కడే వుంటాడు అతను.

దీక్షితులుగారికి- చలంలేఖలు, మ్యూజింగ్స్ చదివారుగా. కొందరి తోవ అంతే. జీవితంలో నలిగి, కాలి, అన్ని ఆశలూపోయి భస్మమైతేనే

గాని, వాళ్ళకి అరుణాచలం చేరే అర్హత రాదు. చేరాక తిరిగి హోమం ప్రారంభం. కనక వోపిక పట్టండి. ఇంక రెండేళ్ళ లోపు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

23-11-59

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఈ పెళ్ళిని మీరు అంత గొప్పగా తీసుకున్నందుకు సంతోషం.

మీరు పడ్డ నిస్తబ్ధత లోంచి మిమ్మన్నుద్ధరించాలంటే, మీచేత ఎంత సాధన చేయించాలో ఈశ్వరుడు ! కాని మీరు భావించుకున్నంత లోతున లేరు మీరు. ఒకసారి ఈశ్వరుడి చేతులో పడ్డ తరవాత కిందికి జారడ మనేది లేదు.

విశ్వాసంతో వుండండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

2-12-59

వీరేశలింగంగారికి,

మీకార్డు. దేంటోనూ సుఖం కనపడనప్పుడే, దేంటోనూ లేని సుఖంకోసం యత్నం చేస్తాడు మనిషి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7-12-59

వీరేశలింగంగారికి,

అవును. చిన్నారావుగారికి చలమంటే గొప్ప ప్రేమ. పట్టుమని

కొన్నేళ్ళు వదలక నిల్చిన గొప్ప మిత్రుల్లో ఆయన ముఖ్యులు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

24 - 1 - 60

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును. బంధువులు అంతే. ఎందుకు వెళ్ళారు వాళ్ళ చాయలకి ?

వాళ్ళకి సరైన విలవే కట్టారు. కాని వేశ్యల సంగతి-కొందరు రాతల అనుభవాల్లో, మిత్రుల అనుభవాల్లో, వాళ్ళు గొప్ప శృంగారమైన ఆకర్షకమైన వేశ్యల్ని కలుసుకున్నట్టు చెప్పుతారు.

పూర్వం ప్రబంధాల్లో కథల్లో అట్లాగే చదువుతారు. ఈ సంఘ సంస్కారులు వొచ్చి వాళ్ళని నాశనం చేశారు. పైగా పరదేశస్తుల బోధలతో కూడిన ఈ చదువులవల్ల వాళ్ళపైని నీచాభిప్రాయం బైలుదేరింది. అదికాక ఆకర్షణ ఉన్న వాళ్ళందరూ సినిమాలచుట్టూ చేరారు. అంతేగాక ఈ ఉద్యోగాలలో చేరిన స్త్రీలవల్ల వేశ్యలకి Competition ఏర్పడ్డది.

అదంతా అట్లా వుంచి-వాళ్ళ నా స్థితిలోకి దించింది మొగవాళ్ళ కామం. వేశ్య డబ్బుకి దేహాన్నిస్తే, మొగవాడు డబ్బిచ్చి దాన్ని కొనుక్కుంటున్నాడు. ఏది ఎక్కువ నీచమో నిర్ణయించడం కష్టం, వేశ్య తన బతుక్కి తనని అమ్ముకుంటోంది గనక ఎక్కువ క్షమార్హులు-గౌరవనీయులైన ఈ మనుషులకన్న ఈ భార్యలకన్న.

పాకీవాళ్ళు మురికిని అసహ్యించు కున్నట్టుంటుంది, వేశ్యల్ని లోకువగా చూడడం. పోసింది ఈ ఉపన్యాసం-

1962 వొచ్చేస్తోంది.

1961 ఆఖర్లో పిలుపులు వొస్తాయి భక్తులకి. నా శుభవార్తల తెలుగు

పూర్తి కావొచ్చింది. రుబాయిలు అచ్చుకి వెళ్ళాయి. బుజ్జిగాడు, చిన్నారావు గారి లేఖలు కూడా.

బావున్నారు కద !

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

1-2-60

వీరేశలింగంగారికి,

మీ కార్డు. కాంతంగారికి అప్పుడే జవాబు రాశాను. ఎందుకు అందలేదో !

మీకు తెలిసిన ఆ టీచరమ్మగారు రాశారు, ఆమే మీకూ ఎండాకాలంలో రావాలనుకుంటున్నారని.

తప్పకండా రండి.

మన లోపాలకేంలెండి. ఈశ్వరుడు చూసుకుంటారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

8-2-60

వీరేశలింగంగారికి,

మేమిదివరకు ఉన్న ఇంటో లేము. ఎదురుగావున్న ఇంకో ఇంటోకి మారి రెండు సంవత్సరాలయింది. ఇక్కడ మల్లెలూ లేవు. మామిళ్ళూలేవు. మల్లెలు వానాకాలంలో పూస్తాయి ఇక్కడ. ఈ ఏడు మామిడిపూత ఇంకా లేదు. ఈ చుట్టుపక్కల కోయిలలూ లేవు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

12-2-60

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం మరి కాలమంటే ఏమనుకున్నారు! అంత పాడయింది. స్వేచ్ఛగా వుంటే ఇవన్నీ ఎదుర్కోవాలి. ఇటువంటి ఆపదల్ని ఎదుర్కొనే శక్తి లేకపోతే ఇంక స్వేచ్ఛకి ఎట్లా అర్హులు కాగలరు.

ఈశ్వరుడు ఎప్పుడూ మనని కష్టాల్నించి కాపాడితే, వుత్త సోమరిపోతులమూ, చాతకాని దద్దమ్మలమూ అయిపోతుంటాము. ఈశ్వరపుత్రులంటే యోధులన్నమాట. ఆ D, I; D E O, D P I, వాళ్ళ పేర్లు విని సంతోషిస్తాను. ఈశ్వరుడిపై విశ్వాసంతో వుండండి మీకే ఆపదా కలగదు. ఎందుకట్లా భయపడతారు!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

27-2-60

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఏం పరవాలేదు ఈశ్వరధ్యానం చెయ్యండి. ప్రతిదానికి అట్లా భయపడి కుంగిపోకండి. ధీరంగా నిలబడండి. ఈశ్వరుడున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

11-4-60

వీరేశలింగంగారికి,

అవును. చావుతో అంతంకాదు బతుకు. అంతమైతే చాలా సమస్యలు తీరేవి లోకానికి. దుర్మార్గం మరీ పెచ్చుపెరిగేది.

మనబోటి చాతకాని వాళ్ళకి బతుకుతెరువే వుండేది కాదు. శిక్ష తప్పించుకోలేమనే భయంవల్లనే ఈ మాత్రం ఆగారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

2—6—60

వీరేశలింగంగారికి,

మీరిద్దరూ ఎంతో హాయిగా రాశారు ఉత్తరాలు.

ఇంతలో పాపం! B. V. N. గారికా దేశ కవిత గోల!

మీరు వెళ్ళినప్పటినించి, ఒకటే మిత్రులు, ఇళ్ళు పట్టకంటా ఒకటే మిత్రులు. తారకం & family ఇవాళే వెళ్ళారని చెప్పండి BVNతో.

నరసింహస్వామిగారు ఇంకా ఉన్నారు. మామిడి పళ్ళు ఎన్నో. మీరిక్కడ వొదిలి వెళ్ళిన పనసపండు ఎంతో బావుంది. ఇరవై మంది మిత్రులు ఇంకాపైగా తిన్నారు దాన్ని, దానికోసమే అంత దూరాలనించి వొచ్చినట్టు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

11-6-60

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నామాటలనే ఉపోద్ఘాతంగా వేస్తే, నా ఉత్తరాలకి నేను సర్టిఫికేటు ఇచ్చుకున్నట్టవుతుందేమో! ఏమైనా అది ఈశ్వరుడే చేయించిన పని ఐతే, నా అభ్యంతర మేమైవుంటుంది!

ఏం రాస్తేనేం, మీ ఆంధ్రదేశం చలాన్నిగాని చలం రాసిందాన్ని

గాని ఎన్నటికి తీసుకోము. కొద్దిమంది మీవంటి వారు, పూర్వజన్మ విశేషం వల్ల, తప్ప పుట్టారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

8–7-60

వీరేశలింగంగారికి,

మీ కార్డు. 14న ప్రళయం రాదు. ఇప్పుడప్పుడే ఏం భయం లేదు.

అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

27–7–60

వీరేశలింగంగారికి,

మీ Express ఉత్తరం. మీ బదిలీ సంగతి, తనపైన విశ్వాసం వుంచమన్నారు ఈశ్వరుడు. మీకేది మంచో అది జరుగుతుంది. అయినా సంవత్సరనరలో అన్ని సమస్యలూ తీరిపోతున్నాయి కద! పోనీ ఒక్క-నాలుగైదు నెలలు. అందాకా ఓర్చుకోండి. 1961 దాకా. నర్సీపట్నం నరసింహారావుగారికి ఈశ్వరుడుపై విశ్వాసం లేకేం? మొన్న మొన్నటి దాకా తన కుటుంబానికి, మిత్రులకి ఏ మొచ్చినా ఈశ్వరుడి సహాయం కోసం రాశేవారు, ఏ కొంతనమ్మకంతోనో! ఏదో ఈశ్వరుడి నించి వొచ్చింది తీసుకోవాలనేకాని, ఆఖరికి తమ విశ్వాసాన్ని కూడా ఇయ్యలేని వాళ్ళకి ఏం జరుగుతాయి? దాంతో ఆ వున్న కాస్త విశ్వాసమూ వూడ్చుకుపోతుంది. అందుకనే ఏసు "వున్న వాళ్ళకి ఇంకా ఇవ్వబడుతుంది. లేని వాళ్ళది ఉన్న కాస్తే వూడ్చుకుపోతుంది." అంటారు.

మా ఇంటికెదురుగా ఓ గుజరాతీ ఆమెవుంది ఇప్పుడు. చిత్ర తన పిల్లల గొడవ చెప్పుకుంటే ఆమె తనకి పిల్లలులేరని గోల. అట్లాగే

మీకేమో, ఊరుపేరూ లేదని దిగులు. నాకేమో "ఎంత అదృష్టం ! ఎవరికీ తెలీకంగా బతకడం !" అని. ఊరూపేరూ వుంటే వాటిని వొదులుకుని ఈశ్వరుణ్ణి శరణు చొచ్చడం సులభమా బాబూ !

నా పుస్తకాలే నాకు కీర్తినీ డబ్బునీ ఇస్తే ఏ అదృష్టం వల్లనో ఇక్కడికి వొచ్చినా, నా దృష్టి పత్రికలపైనా, మనిఆర్డర్లపైనే వుండేది కద ! వూరు పేర్లంటే నాకింత విరక్తి కలిగేట్టు ఈశ్వరుడు చేశారు. గన కనే వూరుపేరు లేనివారికి ఈశ్వరుడి ఓదార్పు నివ్వగల భాగ్యంనాకీ నాటికి లభ్యమయింది. అట్లాగే పేరూ వూరులేని మీరు ముందుముందు ఎంతమందికి నిజమైన తేజోబలంతో దాహం తీర్చబోతున్నారో !

వూరూపేరూ మరిస్తేనేగాని మనమెవరో మరిచిపోతేనేగాని, ఈ విద్యలో స్థలంలేదు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

5-8-60

వీరేశలింగంగారికి,

మీకు అసలు టీచరు ఉద్యోగమూ ఏ ఉద్యోగమూ సరిపడదేమో ! ఢిల్లీలో వున్నన్నాళ్ళూ బదిలీ కావాలన్నారు. బదిలీ అయింది. అయినప్పటి నించి గోల. ఇప్పుడు ప్రతిరోజూ మీపైన అధికారం చేసేవారులేరు. హైస్కూలులో ప్రతిరోజూ ఇంకోరూ పెత్తనం చేస్తోవుంటారు. అప్పు డెట్లా భరిస్తారు ?

ఈశ్వరుడు మిమ్మల్ని అన్నీ వోర్చుకుని అక్కడ వుండమన్నారు. అట్లా ఆయన మాటప్రకారం నడుచుకోవడం ఆధ్యాత్మిక మార్గంలో మొదటి మెట్టు. అట్లాబాధని భరించ లేకపోతే, ఏ మాత్రం ఈశ్వరజీవితానికి పనికిరాము.

మీలో ఆ Superiority Complex వుంది. మనంవున్న పని

స్తితులకి మనం స్వతహాగా అతీతులమని. మనం Superior అయినా ఆధ్యాత్మిక జీవనానికి, ఆ భావం విషతుల్యం. ఆ భావాన్ని అణిచి వెయ్యడానికే ఈశ్వరుడు అట్లాంటి పరిస్తితుల్ని కల్పిస్తోవుంటారు. మొత్తానికి మీరిక్కడికి వొచ్చి వున్నకాలం వృథా పోలేదు. ఈశ్వరశక్తి మీపై పని చేసింది. అహాన్ని, తిరుగుబాటునీ రేపింది.

మీరు విడిచినా ఈశ్వరుడెట్టానూ విడవరు. ఒకసారి ఈశ్వరుణ్ణి శరణన్నవారు ఆయన్నించి తప్పించుకోడం అసాధ్యం.

ఏం పరవాలేదు. ఎన్నటికీ మీరు ఈశ్వరుడివారు. ఇవన్నీ ప్రణయకోపాలు. ఇవి నాకు బాగా అనుభవం భగవాన్‌తో ! ఎంతమందో ఇట్లా భగవాన్‌పైన అలిగింది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

తి 1-11-60

వీరేశలింగంగారికి,

తెల్లారకట్ట జ్ఞాపకం వొచ్చారు. ఏ గొడవలూ లేకండా సుఖంగా ఉన్నారా ! అనుకున్నాను.

పత్రికలు ఎందుకు మధ్యలో ఆగిపోతాయి. అట్లాంటి కారణాల్లో ఒకటేమో దేవదత్తానికి కూడా

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10-11-60

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఎందుకా పత్రికల Cuttings నాకు. వాటిని చదివే

కష్యాలేవు, బుద్ధిలేదు నాకు. పంపకండి. మీరునరే చలాన్ని వెనక వేసుకుని ముందుకు పోకడంలో మొదటివారు.

ఇంకెన్నాళ్ళు అశాంతి ; 1962 ఫిబ్రవరి దాకానేగా ! ఆనాటికి వాళ్ళని నీళ్ళు మింగెయ్యడమో, అది తప్పితే మనని వాళ్ళు గుర్తులేకండా తరిమెయ్యడమో జరుగుతుంది. ఏది ఎట్లాఐనా ఈ ప్రపంచం రొద తప్పి తీరుతుంది మనకి.

సరైనప్రశ్న "ఎందుకి జీవితం ?" అనేది. దాన్నించిచచ్చికూడా తప్పించుకోలేము. కనక నోరుమూసుకుని భరిద్దాము. 'చివరపైసా' బాధ మిగిలిపోయింది. అది చెల్లించాలి మనం. కర్మ దేవతకి రుణపడ్డాము.

ఒకరేగతి. ఈశ్వరుడిలో విశ్వాసం-చాతనైనంత.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

21-11-60

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీ చిత్రకారుడి సంగతి-తెలుగువాళ్ళకి కళఅఖ్కర్లేదు. వాళ్ళకి అందం తెలీదు. ఒక కళతో పుట్టడం దురదృష్టం. చాలా అశాంతికి కారణం. ప్రజాదరణ దొరక్కపోతే, ఎడతెగని దుఃఖం. ప్రజాదరణ దొరికిందా, ఆ ఆదరణ అతన్ని శుద్ధ గాడిదని చేస్తుంది. గొప్పకళ ఎప్పుడూ ఆ మనిషి జీవితంలో recognition పొందదు. ఆ మనిషికి వ్యథ తప్పదు.

దీనికంతా ఒకే Solution. పూర్వపు Artists మల్లే, రచయితల మల్లే, తమ కళని ఈశ్వరార్పితం చెయ్యడం.

ఈ కాలంలో అది చెయ్యడం ఎట్లాగోకూడా మరిచి పోయినారు. అందువల్లనే ఈ అశాంతి. ఈ frustration.

ఎవరి పాదాలనించి కళాస్రవంతి ఉద్భవించిందో, అది అక్కడికే చేరుకోనంతకాలం అశాంతి తప్పదు. జనపదంలో ప్రవహించనీ, ఎడారిలో ఇంకనీ- చివరికి అక్కడికే అర్పితం కావాలి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-12-60

నీ రేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఇంకా పేదలకీ, ధనవంతులకీ ఎందుకా భేదం మీ మనసులో ! పేదలంటే, ధనంలేని ధనవంతులన్నమాట అందరూ ఒకటే.

మిమ్మన్నిక్కడికి జనవరి 3 న రమ్మని ఈశ్వరుడు ఆహ్వానించిన ఉత్తరం అందలేదా ఇంకా !

ఈశ్వరాశీర్వాదలతో

చలం

*

21-12-60

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. 1962 ఫిబ్రవరి 9 న జగత్ ప్రళయం. ఆ ప్రళయం విషయమై స్వయంగా ప్రస్తావించి, దానికి అవసరమైన ఏర్పాట్లని చేయించడానికి కొందరు యువక భక్తుల్ని పిలిపించుకుంటున్నారు ఈశ్వరుడు.

ఆ సమావేశం జనవరి 3, జయంతి రోజున జరుగుతుంది ఆ యువకుల్లో మీ ఒకరు. దానికి ఆహ్వానించారు మిమ్మల్ని. కనక తప్పక రండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

పి. రేశలింగంగారికి,

మీ ఉత్తరం. నేను రాసిన కార్డుకికూడా జవాబు వొస్తుందేమోనని, జవాబు రాయడం ఆపాను. రాలేదు కనక రాస్తున్నాను. మీ వూరు సముద్రానికి దగ్గిరైతే, ప్రజల్ని జలం తప్పించుకుని బందలుప్పి సెంటర్‌కో, సీతానగరం సెంటర్‌కో వెళ్ళమని చెప్పండి. సముద్రానికి దూరమైతే మీ వూరునే ఒక Centre చెయ్యండి. అదేకదా ఈశ్వరుడు చెప్పింది.

ఇంతా విని మీరు సరిగా అర్థం చేసుకోలేదు. ఎవరన్నా మీద్వారానే రక్షణ పొందాలి. అంతేకాని జలంనించి కొండల్లోకి పారిపొమ్మని ప్రచారం చెయ్యకండి. అది వుత్త భయపెట్టడమే అవుతుంది. వాళ్ళని పారిపొమ్మని చెప్పినంత మాత్రాన వాళ్ళని రక్షించగలరా మీరు! మీరు స్థాపించే రక్షణ కేంద్రానికి వెళ్ళిన వాళ్ళకి ఈశ్వరుడి రక్షణ వుంటుంది. వాళ్ళని పారిపొమ్మంటే ఎక్కడికి పారిపోతారు వాళ్ళు.

మీరు వాళ్ళని ఓ రక్షణ కేంద్రంలోకి చేర్చలేకపోతే, ప్రచారం మానెయ్యడం నయం.

మిమ్మల్నీ, మీ భార్యనీ, ఇక్కడికి రమ్మని చెప్పారు కద ఈశ్వరుడు!

ఎందుకు వూరికే అట్లా లేనిపోని సందేహాలకి స్థలమిస్తారు మీ మనసులో!

మీరు కాదు మిమ్మల్ని కాపాడుకునేది ఈశ్వరుడిలో విశ్వాసం వున్నంతకాలం మిమ్మల్ని ఏదీ చెరచలేదు. అరుణాచలం వెళ్ళిపోదాం, అని నిశ్చయంతో హాయిగా ఎందుకు వుండరు! మిమ్మల్ని కాపాడతానని చెప్పారుకద ఈశ్వరుడు. ఆమాట సందేహమైతే మనకింక దిక్కెక్కడ?

"అంతా ఆయన ప్రేమే. ఆయన్ని ఏంచేస్తే అదే చెయ్యనీండి" అని గొప్పగా ఓమూల రాస్తో, "ఆయన ఏం చేస్తారో, మాపైన అనుగ్రహం వుందో లేదో" అంటో వాపోతావెందుకు?

ఇది చాలా క్లిష్టమైన కాలం. మీవంటివారే పూర్ణవిశ్వాసంతో వుండక పూగిసలాడుతోవుంటే, తక్కిన వాళ్ళ గతేమిటి ? మీరెవరికి రక్షణ నివ్వగలరు ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

23 - 3 - 61

వీరేశలింగంగారికి,

మీ డైరీ చాలా బావుంది. దేవదత్తానికి పంపనా !

కురంగేశ్వరరావు ఫొటోలు పంపలేదు పత్రికల్లో ఉగాదికి. పంచాంగాలలో ప్రళయాల సంగతులు చదువుతున్నారా ? అట్లానే మాట్లాడుతారు లెండి అక్టోబరు దాకా. ఎందుకు తొందర పడతారు. ఇన్నేళ్ళు ఈదాము, మీరు గొడవ పడడమూ ఈశ్వరుడు ధైర్యాన్నీ, విశ్వాసాన్నీ, రాయించి, చీవాట్లు పెట్టడమూ బుజ్జగించడమూ, అన్నీ దాటుకు వొచ్చాము. పదినెలలు. తొందర పడకండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

2 - 4 - 61

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీరు పంపిన డైరీ ఎక్కడపెట్టానో కనపట్టం లేదు. మీరు శ్రమ తీసుకుని ఇంకో కాపీ పంపాలి. చూసి అవసర మనుకున్న వాక్యాలు ముందు చేరుస్తాను. కాని ఆ దేవదత్తం అసలు బయటికి రావడం మానేసింది. తొందరలేదు. కాని పంపండి కృతయుగాని కన్నా ఉపయోగపడుతుంది.

సత్యం రాశారు, పెళ్ళి ఆగిపోయిందని. మంచి సంగతి. శ్రీశ్రీ నాటకం కాపీ నాకు మిత్రులు పంపారు. కాని నేను చదవలేదు. ఈ

ప్రళయవార్తలలో చూస్తున్నారుగా ఎంతటి ప్రేమలు పైటపడుతున్నాయో! రోజూ తిండిలేక మద్రాసులో మాడుతోవుంటే, శ్రీశ్రీకి వాళ్ళమీద జీవితంలో ప్రేమలేదుగాని, మరణంలో ప్రేమ ఒక్కసారి పొంగి వొచ్చింది.

ధనమూ కీర్తీ ఎట్లా మతిని చెరుస్తాయో! ఆ నాటకంలో అంత అహంట. ఇట్లా పెంచుకుంటున్నారు తమ ఘనతల్ని.

ఎవర్ని కదిలించండి. ఇదేరకం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-4-61

వీరేశలింగంగారికి,

దిక్కులేని వాళ్ళు, లోకంవల్ల గాయపడ్డ ఆర్తులు ఈ కాలంలో కూడా దప్పుచేసుకోలేని మొద్దులూ కోరుకుంటారు ప్రళయాన్ని. దేశం లక్షలతో చొల్లుతోవుంటే, ఎవరికి దొరికింది వారు ఏదో విధంగా వాళ్ళో పోసుకుంటో చాలా Busy గా వుండేకాలంలో ప్రళయం వొస్తుందంటే నమ్ముతారా? తన్నలేదు నయం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

25-4-61

వీరేశలింగంగారికి,

డైరీకాపీ అందింది. కాని ఆ దేవదత్తం ఆగిపోయింది. High schoolకి పోతే ఏదో వొరుగుతుందన్న మీరు పడ్డ ఆరాటం ఈశ్వరుడిలో నిష్ఫూరాలూ జ్ఞాపకం వున్నాయా? మనసుమారింది- ఉన్నదాంతో తృప్తి పడి- వోర్చుకోడం నేర్చుకోండి. బతుకు ఇట్లాగే గడుస్తుంది. లోకంలో

పుట్టాము. లోకంరీతి అట్లాంటిది. ఈ సుఖపడేవాళ్ళు అట్లాగే లోకంలో adjust ఐ పోర్చుకుని తల వొంచుకు బతుకుతున్నారు. అది చాతకాని ఇష్టంలేనివాళ్ళు బాధలకి సిద్ధం కావలసిందే. కొంపితెచ్చుకుంటో 'ఈశ్వరా' అంటే ఏం ప్రయోజనం!

ఏమైతేనేం! ఇంక 8 నెలలు. అప్పుడైనా మనసు మారితేనేకాని శాంతిలేదు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

24-5-61

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఇవి సహజ సాధారణమైన సంగతులేగా! మీ ముగ్గురిలో ఎవరికి ఎక్కువ బాధలేకంగా సమస్యా పరిష్కారం చెయ్యమని ఈశ్వరుణ్ణి ప్రతి ఉదయసాయంత్రాలూ ప్రార్థించండి.

ఈశ్వరాశీర్వాదంతో

చలం

*

15-6-61

వీరేశలింగంగారికి,

'ఎందుకట్లా నిరాశపడి, విరోధించి కుంగిపోతారు.

భగవాన్ని ప్రార్థించండి. అన్నీ చక్కబడతాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

27-6-61

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఇంత అనుభవముండి, ఇంత తెలిసిన మీరు ఇట్లా రాయడం అనుచితం. సంఘానికి విరుద్ధమైన పని చేశారు. వొచ్చిన బాధల్ని సాహసంతో ఎదుర్కోండి. మీసాహసానికి మెచ్చి ఈశ్వర సహాయం లభించవొచ్చు.

లేదా ఈశ్వరాజ్ఞకి పూర్తిగా అర్పించుకోండి. అంతేకాని చూస్తో చూస్తో కందిరీగల గూటిని రేపి, "నేను చేతిని అక్కడే వుంచుతాను. నన్ను ఈ కందిరీగలు కుట్టకుండాచెయ్యి." అనడం ధర్మంకాదు.

ఈశ్వరుడు ఎందుకు వొదులుతారు మిమ్మల్ని. ఒక్క నిమిషం కూడా వొదలలేదు. అందుకనే ఈ ఉపద్రవాలు.

నిజంగా యోచించి తెలివి తెచ్చుకోండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10-7-61

వీరేశలింగంగారికి,

మీ రిజిస్టరు వ్యవహారం. మీ మిత్రుడు చలంగారికి చలమంటే ఎంత గొప్ప భక్తో!

కాని ఆయనగీతాలు అన్నీ echoes ప్రతిధ్వనులు. నేనేమీ మెచ్చుకోలేనందున బాధపడుతున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

12-7-61

వీరేశలింగంగారికి,

ఏ పరిస్థితుల్లోనైనా, పాపంలోనైనా, నరకంలోనైనా నువ్వే గతి అని ప్రార్థించండి. ఈశ్వరుడి చేతిని మాత్రం వొదలకండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-8-61

వీరేశలింగంగారికి,

నా బతుకెట్లా అని ఆలోచించేవారికి అరుణాచలం వాసం అసాధ్యం.

నా బతుకెట్లా అని ఆలోచించలేదు ఈ లోకంలోకి వొచ్చినప్పుడు, ఆ విధంగా కావాలి మనం క్రమంగా.

తల్లి దగ్గరికి పరుగెత్తుకొచ్చే పిల్ల నా బతుకెట్లా అని Condition పెట్టి అడగదు కద!

కాని నా బతుకెట్లాలో 'బ్రతుకు' అంటే అర్థమేమిటో, దాంటో ఏమేం Include ఐ వున్నాయో ఆలోచించుకోవాలి. తల్లిదగ్గిర క్షుదార్తి తీర్చే క్షీరం మాత్రముంటాయి. కాని మానవుడు అంత మాత్రంతో తృప్తి పడడే!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

25-8-61

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఎందుకు ఇంత యోచిస్తారు!

ఏం జరగబోతోందో చూడండి. కొద్దికాలం ఇంక.

తొందర పడకండి.

మీ M.O. అందింది. Thanks.

కొన్ని చాలా ఆ నాటికి అవసరమైన వంట పదార్థాలు కొన్నాం ఆ డబ్బుతో.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

21-11-61

వీరేశలింగంగారికి,

మీ కార్డు. పత్రికల వాళ్ళకి ప్రభుత్వం ఆదేశం వొచ్చినట్టుంది- ప్రళయ వార్తల్ని ప్రకటించ వొద్దని. ఇదివరకు వారం వారం వార ఫలాల్లో లోక పరిస్థితుల్ని సూచించేవారు బాగా జోరు తగ్గించారు. ప్రజాదరణ పొందాలనీ, మంచి భవిష్యత్తు చెప్పి డబ్బు సంపాయించు కోవాలనుకునే వాళ్ళు ఏం భయంలేదని రాస్తున్నారు. వాళ్ళు Safe side న వుంటారు. ప్రళయం వొస్తే ఏమయ్యా రాదన్నావే? అని అడగటానికి ఎవరూ వుండరు. ప్రళయం రాదా, రాదన్న వాళ్ళదే విజయం. దేవుడున్నాడు అనే వాళ్ళ విజయం మల్లే.

ఇక్కడేమి విశేషాలు ఉంటాయి. చిత్తూరునించి నారాయణమూర్తి గారి కుటుంబం, ఈశ్వరాధ్వర్యాన ఇక్కడే ఓ చిన్న ఇంటో వున్నారు. కృష్ణ అనే టీచరు (పరుచూరి భార్య) మాతో వుండిపోయారు. మా పాఠశాల కాలేజీ అయింది. 4 టీచర్లు 4 విద్యార్థులు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

17-2-62

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఈశ్వరుడు అన్నారు. మీవలె ప్రశ్నించే ధీరులే తనకి కావలసిన వారని. ప్రళయం వొస్తుందనీ మిమ్మన్నందర్నీ రక్షించడానికే ప్రస్తుతం ప్రళయం ఆపుచేశాననీ, వొచ్చినప్పుడు దానినించి మిమ్మన్ని రక్షిస్తాననీ రాయమన్నారు. 'నాపిల్లలు ప్రళయానికి సిద్ధంకాలేదు. అందుకు ఆపాను' అన్నారు. మీరు సీతానగరంలో 40 రోజులు వుండాలని వొచ్చారుగా! ఆ 40 రోజులు వుండి తరవాత గజపతి నగరం వెళ్ళమన్నారు ధైర్యంగా,

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

6-5-62

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. విని ఈశ్వరుడు చాలా మాట్లాడారు. బైట ప్రపంచమంతా మారినా నాశనమైనా భక్తులకి ఏం వొరుగుతుంది. వాళ్ళ హృదయాలు మారాలి. ఆ పరివర్తనకే ఈ కష్టాలన్నీ.

పార్వతీశంగారు ఆశ్రమం ఏర్పరుచు కుంటున్నారనే తెలీదు, మాకు!

చూస్తున్నారుగా ఎంత పరిపక్వం చెందామో భక్తుల మనుకునే వాళ్ళం. లోపల మనం ఎట్లావున్నా సరే, మనం కాంక్షించేది ఓఆశ్రమం.

మనం మారడానికీ గంటలు లెఖ్ఖపెడతాము. కాని ఈశ్వరుడి చేతిలో యుగాలుఉన్నాయి మనని సిద్ధం చేసేందుకు.

ఏమైతేనేం ప్రళయం వొచ్చినప్పుడు, మనందర్నీ కాపాడతానని వాయమన్నారు ఈశ్వరుడు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

8-6-62

వీరేశలింగారికి,

మీ కార్డు. అవును. మనం కలలుగన్న లోకం బైట ఏర్పడలేదు గనక, దాన్నిలోపల సృష్టించుకునే ప్రయత్నం చెయ్యాలి.

జగదీశ్వర్ బావున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-6-62

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీ భార్యగారికై విభూది పంపుతున్నాను. రస్సెల్‌గారి వాక్యాలు చాలా బావున్నాయి. మానవులపైన ఆయన ప్రేమ చూడండి.

ఆయన Natures సంగతి మాట్లాడు తున్నాడుగాని ఓ ప్రత్యేక మైన మనుషుల్లో మార్పు చూడటంలేదు. నా చిన్నతనానికీ ఇప్పటికీ ఆ మార్పు నేను చూస్తున్నాను.

కాని ఏ యుగం అందం ఆ యుగాని దైనట్టు ఏ యుగం నీతి ఆ యుగానిదేమో !

రస్సెల్‌గారు మనుషులకి తెలివి లేదని వాపోతున్నారుగాని నీతి లేదని బాధపడటంలేదు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

27-6-62

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును. రస్సెల్‌ని అమెరికాలో ఓ యూనివర్శిటీ వారు పొమ్మన్నారు. కాని అతనికి కులంలో సంఘంలో మతంలో వెలి రాలేదు. ఎప్పుడూ అతనికి ఓ పెద్ద following ఉండేది. పైగా ఆయన Lord అయినాడు.

నేనేం రాయటంలేదు.

మీరు నాకిచ్చిన రూమీ పుస్తకంలో అతను ఏరుకున్న పద్యాలూ బాగా లేవు. అసలు రూమీ దాంటో ఎక్కడా పలకలేదు. నాకిప్పుడు ఏ రచన చేసే ఓపిక లేదు, శారీరకంగా. చెప్పవలసింది ఏమీ కనపడదు మానసికంగా.

ఈశ్వరాశీర్వాలతో

చలం

*

7 - 7 - 62

వీరేశలింగంగారికి,

అసలు బాధా ప్రవీణునికి రాశారు, మీ బాధల్ని గురించి. జీవితమే ఓ పెద్దరోగమన్నారు భగవాన్. బాధలెప్పుడూ తప్పవు. బాధల్ని ఎవరూ తీసెయ్యరు. బాధపడకుండా వుండగల శక్తికోసం ప్రార్థించండి.

బాధే అని గుంజుకున్న కొద్దీ ఇంకా బాధ.

సుఖాలకేం ? ఎప్పుడూ వుండనే వున్నాయి. ప్రతి నిమిషం ప్రతి జీవి సుఖిస్తూనే వుంది. కాని మీవంటి నావంటి అభాగ్యుడు బాధ వేపే మొహం తిప్పి, రెండోవేపుకి తిప్పడం చాతకాక, ఇష్టంలేక మొర్రో మని

గోలకెత్తుతాడు. తన జుట్టు తానే పీక్కునే పిల్లమల్లే. మిమ్మల్ని విశ్వాసంతో వుండమన్నారు ఈశ్వరుడు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

25 - 8 - 62

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఉత్సవం బాగా జరిగింది. పాత భక్తులు ఎవరూ రాలేదు. కొంతమంది నించి అసలు జవాబులే లేవు. అసలిప్పుడు పూర్వపు వారు రాయడమే మానేశారు.

అంతే. అట్లా గట్టిగా ఊదర పడితేనేగాని మనం పాతుకున్న చోటు నించి, సుఖంలోంచి కదలం.

అందం పైటి వారి నించి బలి కోరుతుంది. కాని శాంతి, ఎవరు శాంతిని అభిలషిస్తారో, వారినే బలి తీసుకుంటుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

22 - 9 - 62

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీ గీతం బావుంది.

గాంధీగారి జీవితం Luis Fisher రాసింది దొరికించుకుని చదవండి. గాంధీగార్ని గురించి మీరు రాసిన వన్నీ నిజం. Beauty, art, morality, Truth-ఇవి చాలా విస్తీర్ణమైన అర్థాలు కలవి. మానవుడి బుద్ధికి మించినవి. కనకనే ఒక్కొక్కరు ఏ కాస్తో ఓ కోణం నించి చూస్తారు అందువల్లనే ఒకరు చెప్పింది. ఖండిస్తున్నట్టు తోస్తాయి. గాంధీగారి దృక్పథ మెక్కడ? Wildeది ఎక్కడ! ఇద్దరికీ ఎంత దూరమో!

మీ M. O. అందింది. శుభవార్తల మీది చలం వ్యాసాలూ, మార్తా అనే నవలా అచ్చు ఆఫీసుకి కదిలే యత్నంలో వున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

29-9-62

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అందరం కులాసాగా వున్నాము. వజీర్ రహ్మాన్ ఇక్కడే వున్నారు వుద్యోగానికి ప్రయత్నం చేస్తో. చలం ఉత్తరాలు- మీ ఉత్తరాలకి జవాబు రాయడంతో వాటి పనిపూర్తి అయింది. అవి Public లోకి రావాలని మీకు కుతుహలమని నేను Suggest చేశాను, పత్రికలని అడగమని.

చలం మిత్రులకి రాసినఉత్తరాలు (పుస్తకం) బైటికి వొచ్చే ఛాన్సు కూడా కనపడుతోంది. కొత్తవ్యాసాలతో ప్రచురణలతో busyగా వున్నాను.

ఈ జాతకాల 'త్వరలో' అనే దాని దగ్గిరే పేచీ. ఎంత త్వరలో !

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

3-10-62

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. AscarWildeకి ప్రజలుబ్రహ్మరథం పట్టారు. గొప్ప గొప్ప వాళ్ళంతా అతన్ని బతిమాలి ఇళ్ళకు తీసుకుపోయేవారు. అతను మాట్లాడితే చాలు అతని Wit కోసం పడగాపులు పడేవారు. పుస్తకాల వల్లా, నాటకాలవల్లా అతనికి చాలా డబ్బు వొచ్చింది. చక్రవర్తి నను కుంటో చక్రవర్తి డాబుతో తిరిగేవాడు !

మొగవాళ్ళతో sex సంబంధ మున్నదనే Case పెట్టారు. అతని విరోధులు-ముఖ్యం అతను స్నేహితం పెట్టుకున్న యువకుడి తండ్రి ఒకతను. ఆ పని శిక్షార్హం. కనక అతనికి శిక్ష పడ్డది. జైల్లో గొప్ప కవిత్వమూ De profurdis అనే పుస్తకమూ రాశాడు. దాంట్లో Jesus ని గురించి గొప్పగా రాశాడు. కానీ మనిషిలో ఏమీ గొప్ప మార్పు కనపడదు. జైలు నించి వొచ్చాక కొత్త జీవితం ప్రారంభించలేక పోయినాడు. Social గా కాని, Spiritual గా కాని అతనిలో బలం వున్నట్టయితే, ధిక్కరించి బతికి, ఇంకా గొప్ప పుస్తకాలు రాసేవాడు. ofcourse ఇది వరకు అతన్ని adore చేసిన వాళ్ళంతా మొహాలు తప్పించారు. అంతకంటె అతనే సిగ్గుపడి చీకట్లలో దాక్కున్నాడు. త్వరలోనే చచ్చిపోయినాడు.

Wilde పడ్డ బాధలల్లా జైల్లోనే. జైలులోకూడా త్వరలోనే అతనికి సదుపాయాలిచ్చారు. మరి జైలంటె బాధే కదా! అంతే అతని బాధ. అతను రాతల్లోగాని జీవితంలో గాని, ఏ సత్యానికీ ధర్మానికీ, బాధ పడలేదు. అతనిలో Sincerity తక్కువ. అతని రాతలో, మాటలో, చేష్టలో పని పాటలులేని సోమరి ధనిక వర్గాన్ని కళ్ళు చెదరకొట్టాడు.

అయితేనేం, అతని కథలు, నాటకాలు, గీతాలు, గొప్ప అందంతో మెరుస్తోవుంటాయి. ఆ అందంలోంచే కొన్ని గొప్ప సత్యాలకి దగ్గరగా వెళ్ళాయి. అతని Mental flashes, ఆకాశంలో మెరుపు మల్లే వెలిగించాయి ఆ కాలంలో.

అందరం బావున్నాము.

అతిథులు వరసగా వుంటున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

26-10-62

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఆ పత్రికల మురుగు అంతా శ్రద్ధంగా చదివి, వాళ్ళురాసే

దేదో ముఖ్యమైనట్టు అనుకుని మీ తల నెందుకు పాడుచేసుకుంటారు !
పైగా అదేదో పెద్ద విషయంలాగు నాకు రాయడ మెందుకు ?

నేను రాసిన కార్డు అంది వుంటుంది. అందరం బావున్నాము ఈశ్వర కారుణ్యంలో,

నేను శుభవార్తలపైన రాసిన వ్యాసాలు అచ్చవుతున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-11-62

వీరేశలింగంగారికి,

మీ కార్డూ, M. O. అందాయి. ప....గారు ఓ పత్రికకి editor ఇప్పుడు. ఆయన మనబోటి వాళ్ళకి అంత సులభంగా ఉత్తరాలు రాయరు. మిమ్మన్ని ఆ డైరీ పంపమనడం నాది తెలివి తక్కువ పనేలాగుంది.

ఈశ్వర కరుణలో అందరమూ బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

1-12-62

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఆ పబ్లిషర్లు 'శశిరేఖ'లో ముఖ్యమైన Chapter ఒకటి అచ్చు వెయ్యకంజా తీసేశారు.

అవును. వివాహాన్ని గూర్చి మీరన్నదంతా నిజం. వాళ్ళ విశ్వాసాల్ని కాదంటున్నానని కాదు వాళ్ళకోపం. వాళ్ళకో విశ్వాసం వుంటేగా! వాళ్ళ Comforts ని, గొప్ప వాళ్ళమనే భావాన్ని మర్యాదల్ని ప్రశ్నించావని. ముఖ్యం వాళ్ళ భార్యలు వాళ్ళ మాట వినరేమోనని.

Anatole France Thais చదివినట్టే జ్ఞాపకం-శశిరేఖ రాసిన ఏ పదేళ్ళకో. కాని ఆ నవల నన్ను Impress చేసినట్టు జ్ఞాపకం లేదు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

29-12-62

వీరేశలింగంగారికి,

పొట్టలో పడ్డ, బిడ్డ ఎప్పుడు బైటికి వొస్తుందో చెప్పగలం గాని, ప్రెస్సులోకి వెళ్ళిన పుస్తకం ఎప్పుడు వొస్తుందో చెప్పలేము. ఓ నెలలో తయారౌతుందని ఆశ.

గట్టిగా రావాలని. ఎప్పుడు నిశ్చయించుకుంటే అప్పుడే ఈశ్వరుడు మిమ్మల్ని తీసుకువొస్తారని తెలుసును కదా మీకు! మీరిక్కడ వుండ టానికి ఆ ఉద్యోగానికీ మీకు అర్థం కనపడకపోయినా మనం ఎక్కడ ఎంతకాలం వుంటాలో అంతా ఈశ్వర నిర్ణీత మనే విశ్వాసంలో నిశ్చింతగా వుండండి.

బాపున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-1-63

వీరేశలింగంగారికి,

మీ కార్డు. 'ఈశ్వరుడి సంకల్పానికి తయారు కావడం' మన చేతిలోనే వుంది. ఆయన ఎప్పుడూ తలుపు తడుతూనే వున్నారు.

సాహసించి దూకేవారి అండనే నిలిచివుంటారు భగవాన్.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

21-1-63

వీరేశలింగంగారికి,

మీ కార్డు. దేనికైనా మననించి గట్టి ప్రయత్నం వుంచేనేగాని, ఈశ్వర సహాయం లభించదు కదా! నిత్యమూ ప్రార్థించండి ఆయనని.

చలి నన్ను బాధిస్తోంది. ఒకప్పే జలుబు భారం, గాలి తగిలితేచాలు-

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

2-2-63

వీరేశలింగంగారికి,

మీ కార్డు. చలి తగ్గింది. చలి తగ్గడంతో జలుబులు తగ్గాయి. ఈశ్వర కృపవల్ల బావున్నాము. సమయం వొచ్చేప్పటికి సంకెళ్ళు వాటి కవే చిత్రంగా రాలిపోతాయి.

మీలో శక్తి కాలమూ అరిగిపోవడమేమిటి? కాలం అనంతం. మీలో శక్తి మీ దేహానికి సంబంధించినది కాదు.

ఇప్పుడే మీరు ఇంకా పనికిరారు.

అందుకనే అక్కడ వుంటున్నారు.

ఆనాడు అన్నిటికీ పనికి వొస్తారు.

పూర్వం మీకు వొచ్చిన అపూర్వానుభవాలూ, మీకు లభించిన అపూర్వ స్నేహాలూ జ్ఞప్తికి తెచ్చుకుంటో విశ్వాసం నిలుపుకోండి.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

20-2-63

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీరు పని మానుకుంటే, ఏ పనీలేని కాలమంతా ఏం చేసుకోవాలో తెలీక బాధ పడతారు.

"ఈశ్వరుడున్నా ప్రయోజనం ఏమిటి?" అని రాశారు. ఇంతకీ మీకు ఈశ్వరుడు మీ ప్రయోజనాలకా?

"నేను చిదిగి, నశించ వలసిందే" అవును. సరిగారాశారు. ఆ వీరేశలింగం అనబడే అతను చితికి నశించవలసిందే. చితికి నశిస్తే, నరకంలో వుండిపోరు. అప్పుడే ఈశ్వరుడు ప్రత్యక్షమౌతారు. ఎవరికి? అదే కనుక్కోండి. అది కనుక్కోడానికే ఈ యాతన. ఈ చితికి నశించ డం. 'ఈశ్వరుడు ఏం సహాయం చేస్తారు?' ఇప్పుడు చేస్తున్నదంతా ఈశ్వర సహాయమే. ఈ మాటలు విశ్వసించండి.

postage కి డబ్బు లేదు. వెంటనే జవాబులు రాకపోతే గొడవ పడకండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

27-2-63

వీరేశలింగంగారికి,

మీ కార్డు. **Rasputin** సంగతి చదివాను. అతను మహాత్ముడని కొందరూ, దుర్మార్గుడూ, వుత్తమోసగాడని కొందరూ, రష్యా అతని మాటవినక చెడిందని కొందరూ, ఇట్లా రాస్తారు. నిజం ఏమిటో? ఈ వారం కృష్ణాపత్రిక నేను చూడలేదు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

16-3-63

వీరేశలింగంగారికీ,

మీ M. O. అందింది. Thanks. మీ ఉత్తరం కూడా. Rasputin చావు తరవాత రష్యా విప్లవం రావడంచేత సరైన చరిత్ర దొరకలేదు. అతన్ని ఎరిగిన వారందర్నీ Bolshivks చంపేశారు, రాజకుటుంబంతో సహా. అతనికి మహాత్మ్యాలు ఎట్లా వొచ్చాయో ఎవరికీ తెలీదు. జారు మీద అతనికిఅంత Influence వుండడమూ, గొప్ప అధికారుల స్త్రీలు అతనిని మోహించడమూ, అతని నిర్లక్ష్యమూ, లెఖ్ఖలేని తనమూ- ఆ పల్లెటూరి మురికి Priest కి ఇంత పొగరేమిటి? అనేది. అతనివల్ల పదవులు పోయినవారు, అవమానాలు పడ్డవారు, అతని విరోధులైనారు.

నా ఆరోగ్యం బావుంది.

హిందువులకి పరదేశాలలో గౌరవం తెచ్చాడని వివేకానంద స్వామిని క్షమించారుకాని, లేకపోతే, వీళ్ళని, వీళ్ళ క్షుద్ర ఆచారాల్ని తిట్టినందుకు, బలి తీసుకునేవారే ఆయన్ని.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

5-5-63

వీరేశలింగంగారికి,

మీరు పంపిన ఉత్తరాలు Parcel అందింది. మీ దగ్గిరపడి వుండడంకన్న నేనే మన్నా చెయ్యగలననే ఆశతో పంపమన్నాను. వాటిని ముందు fair copy చేయించాలి. ఎవరన్నా ఖాళీ మిత్రుడు దొరకాలి.

తరవాత అచ్చు సంగతి.

తీరా ఎవరన్నా అడిగేప్పటికి ఉత్తరాలు సిద్ధంగా వుండటం లేదు. అదీ సంగతి.

అంతా ఈశ్వరుడి చేతులో వుంది.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

11-5-63

వీరేశలింగంగారికి,

మీరు పంపిన డబ్బుకి Thanks. చలం వీరేశలింగంగారికి రాసిన ఉత్తరాలు చదువుతున్నాను- 1952 లో మొదలు- ఆనాడు రాసిన ఉత్తరాలు ఇంకా ముందు ఈశ్వరుడికి చూపి పంపడం లేదు, ఈనాడు అవి చదువుతో వుంటే—

"ఎవడీ రాసినవాడు, Spiritual Donkey లా వున్నాడ"ని పిస్తోంది. వాటిని అచ్చులోకి తీసుకు రావడమంటే సిగ్గుగా వుంది. బాగా ఎండలా! వేసవి ఎట్లా గడుపుతున్నారు?

మీ దగ్గిర దైవ మిచ్చిన భార్య కాపీ వుందా?

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

20-5-63

వీరేశలింగంగారికి,

మీ కార్డు. చలం ఉత్తరాలు మొదట అవి జాగ్రత్తగా edit చెయ్యాలి, వాటిని Interesting గా చెయ్యాలంటే బండబారనీండి భౌతిక జీవితాన్ని— అది ఒక శుభ సూచికమే ననుకుంటాను.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

29-5-63

వీరేశలింగంగారికి,

మీరు పంపిన M. O. న్నూ కార్డూ అందాయి.

దైవమిచ్చిన భార్య కాపీ దొరికింది. చలం ఉత్తరాలదీ, తీరాచూస్తే చాలా భారమైన పనిలాగే వుంది. ఈశ్వరుడి ముందు చదివి వాటిని edit చెయ్యాలి. ఎవరన్నా చిత్రగుప్తుడు దొరకాలి. దొస్తారు మిత్రులు. కాని సమంవొంచి గట్టిపని ఓటి చేసి పెట్టమంటే, ఎవరికీ ఉత్సాహం వుండదు. అయినా ఆ ఉత్తరాలు ఈశ్వరుడివి. ఏ రోజున ఎట్లా ఉపయోగించు కుంటారో ఆయనకే వొదులుతున్నాను. ఇదివరకటి వోపిక తక్కువై పోతోంది నాకు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10-6-63

వీరేశలింగంగారికి,

మీ కార్డు. వజీర్ రహ్మాన్ పుస్తకం నాకిచ్చిన ఒక కాపీ మాత్రమే నా దగ్గిర వుంది.

జహ్వార్ దాని Publisher. అతనికి రాయండి.

హిందీ నేర్చుకున్నంత మాత్రాన ఆ భాషలో కవిత్వం అనుభవించ గల ప్రావీణ్యం వొస్తుందా? అపారమైన కృషి చేస్తేనే గాని!

ఇంత వరకు నాకు ఇంగ్లీషు కవుల్ని అనుభవించగల శక్తిరాలేదు. మరి!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

1-7-63

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అదేమిటి? ఇక్కడి జీవనానికి మీరు రావాలంటే, అది మీ చేతిలోనే వుందే ! ఏరోజైనా రావొచ్చును కదు.

అదే సరైన బదిలీ.

ఈశ్వర కృపలో మేమందరం బావున్నాము.

నేను ఇది చేస్తున్నాను అని ప్రత్యేకంగా చెప్పడానికి ఏమీ లేదు.

మార్పు మీ చేతులోనే వుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-8-63

వీరేశలింగంగారికి,

మీ T. M. O. ఇప్పుడే అందింది. పండగలోపల అందాలని T. M. O. చేసినట్టున్నారు Many Thanks.

డబ్బు లేక పండగ ఆగిపోతుందనుకున్నాము. కానీ ఈశ్వరుడు Smale scall లోనన్నా ప్రారంభించ మన్నారు. అందువల్లనే ఆహ్వానాలు ఆలస్యంగా వొచ్చాయి.

మీ పది రూపాయలూ ఖర్చుకి సహాయపడుతున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

16- 8 - 63

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నా కార్డు అంది వుంటుంది.

డబ్బు లేక ఉత్సవం చిన్నదిగా చేశాము. కానీ ఈశ్వర పర్యవేక్ష ణలో బాగా జరిగింది. ముఖ్యం బీదలే బాగా భోజనాలు చేశారు.

అందరం బావున్నాము.

ఇక్కడ C. L. నరసింహారావు అనే ఆయన సాధకులుగాచేరారు.

ఈశ్వర కృప వల్ల అందరం బావున్నాము. పిల్లలింకా ఆ పుస్త కమే చదువుతున్నారు. కావలసి రాగానే రాస్తాను.

Thanks.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

3 క్లాసు పుస్తకాలు రెండు పంపండి.

13-9-63

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఆ ఉత్తరాలు సంగతంతా నేను చూస్తానుకదూ !

తక్కిన జాతకాలవంటివే నాడీ గ్రంథాలు-వీటి విషయమై నా Musingsలో వుంటుంది చదవండి-జాతకాల సంగతి నాడీ గ్రంథాలలో పేర్లతో-తాత పేర్లతో సహా startling గా వొస్తాయి. కాని అంత startling గానూ భవిష్యత్తు చాలా సార్లు అబద్ధ మౌతుంది. ఈశ్వరుడు చెప్పడానికి చెయ్యడానికి ఇష్టపడని విచిత్రాలు ఎన్నో జరుగుతున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

23-9-63

వీరేశలింగంగారికి,

ఈ నెలాఖరుదాకా కూడా పచ్చిమిరపా. ఏం పెట్టి తెప్పించను అని ఆలోచిస్తూ వుండగా మీ M. O. వొచ్చింది.

Thanks.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

1-10-63

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును. డబ్బు వుండదు. చాలాసార్లు. చాలా నెలల నించి, కానీ బాధపడటంలేదే ! బాధపడుతున్నామని మీరు బాధ పడకండి. మీ విశ్వాసం చెడకొట్టు కోకండి. ఏదన్నా మనం కోరిన సౌకర్యం ఈశ్వరుడు ఇయ్యకపోతే, ఆయన కావలిసే అది ఇయ్యటం లేదనే నమ్మకంలో వుండండి.

డబ్బూ ఆస్తీ లేనివాళ్ళ హృదయాలే మెత్తగా జాలిగా వుంటాయి.

మన మిత్రుల్లో కొందరు డబ్బూ ఆస్తీ కలవాళ్ళే. చలానికి డబ్బు వుండటంలేదని, జవాబుకి కార్డు పంపమంటున్నాడని తెలిసిన వాళ్ళే. కాని వాళ్ళేం బాధ పడటం లేదే ! వాళ్ళు ఉత్తములే. హృదయం కలవాళ్ళే. ఇప్పుడన్నా అర్థమౌతోందా నాకు కూడా ఎందుకు డబ్బు ఇయ్యరో ఈశ్వరుడు ! ఉన్న ఆస్తులే మనకి కొరగాకండా ఎందుకు చేశారో !

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

11-10-36

వీరేశలింగంగారికి,

మన యోచనలూ సందేహాలూ మనసు విజ్ఞానుల వాక్యాలుమనసుని మించిన సత్య దర్శనంలోంచి వొచ్చినవి. మన సందేహాలు ఎవరూ తీర్చ లేనివనే అనిపిస్తుంది. కాని సత్య స్వరూపం ఎట్లాంటిదో దూరం నించైనా ఏమీ తెలీదు కదా మనకి !

అప్పుడు జీవితాన్ని పట్టుకుని దాంట్లోంచి సంతోషాన్ని పిండుకోవా లనే మన దీన యత్నాన్ని దాటించడానికే ఈ నిస్పృహ.

పిల్లలంతా ఇక్కడే వున్నారు.

వజీర్ రహ్మాన్‌కి మద్రాసులో ఉద్యోగం కొన్ని నెలలనించీ. పకపకా అక్కడే. అతని పుస్తకం బాగా ప్రసిద్ధిలోకి వొచ్చింది. రెండో పుస్తకం అచ్చవుతోంది.

వాళ్ళందరూ చాలా సంతోషంగా వున్నారు అక్కడ.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

6-12-63

వీరేశలింగంగారికి,

మీ కార్డు నేనెప్పుడూ రాస్తున్నాను. ఇక్కడికి రావడం మీ చేతుల్లోనే వుందని. ఏం చెయ్యగలను మీ భయాలు పోగొట్టడానికి ! ఏమీలేని బీద వాడిని, నేను !

నేను వున్నవాడినైతే, ఎట్లానూ నమ్మరు నన్ను, మీరుగాని ఇంకె వరుగాని ! నా డబ్బు ఖర్చవుతుందని నేనూ పిలవను మిమ్మల్ని.

దీని నించైనా మీకు ఏమీ బోధపడటం లేదా ?

Flue నించి మెల్లిగా తేరుకుంటున్నాను. వానలు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

26-12-63

వీరేశలింగంగారికి,

మీరు ప్రేమతో పంపిన greetings అప్పుడే అందాయి. ఇంటినిండా guests. ఏమీ తీరుబడి లేదు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

జహ్వార్ పరివార సమేతుడై వొచ్చాడు ఇక్కడికి.

*

12 - 1 - 64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ప్రతినెలా మేము డబ్బు ఇబ్బందిలో ఉండము. వుండఃండి అప్పుడప్పుడు కొంచెం తడుము కుంటాము. మీరు ఏమాత్రం ఖర్చు తగ్గించుకునీ డబ్బు పంపకండి.

ఈశ్వరుడి dictionary లో chance అనే మాట లేదు.

తప్పక వేసవిలో రండి. నేనదే రాయలనుకుంటున్నాను. మాకు పంపే డబ్బు దాచుకుని ఐనా. మీరు ఇక్కడికి వొస్తో వుండకూడదా అని.

ఇక్కడికి వొచ్చి ఎప్పటికీ వుండిపోయినా తీరదు కదా, ఈశ్వరుడికి దూరంగా వుండిపోయినానే అనే వేదన !

ఒకొక్కక్కప్పుడు ఇంకా ఎక్కువవుతుంది. జన్మ అంటేనే వేదన, విరహం. పాపానికి విరుగుడు ఒక్కటే-ఈశ్వరానుగ్రహం.

పేరువెనగ వెన్న వెయ్యడం తెలుసా మీకు ?

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

20 - 1 - 64

పిరేశలింగంగారికి,

మీ ఉత్తరం. "ఇదంతా ఎప్పటి కథే కద ! సమయం వొచ్చేప్పటికి అన్నీ వాటంతట అవి చాలా సహజంగా జరుగుతాయి." అన్నారు ఈశ్వరుడు.

1964 ఆఖరుకి కొన్ని కల్యాణాలు జరుగవొచ్చు.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

29 - 1 - 64

పిరేశలింగంగారికి,

మీ ఉత్తరం. అవును. ప్రజామతలో రాసిన రాజుగారు ఇక్కడికి వొచ్చి వినిపించారు. ఈనాడు ఆయన రాసిన వ్యాసం కాపీలు ఆయనకి కావలసి వొస్తే అవి ఆయనకి దొరక్కుండా వున్నాయి.

అపుసు లోకమంతా డబ్బుమీద పడ్డది, ప్రభుత్వం-డబ్బు, డబ్బు, ప్రజలకోసం డబ్బు, అని ప్రజలనించి డబ్బు గుంజుతుంది. ప్రజలు ప్రతివారూ డబ్బు, మాకు డబ్బు అంటున్నారు. ఆశ్రమాలు డబ్బు అంటున్నాయి. దేవాలయాలు 'డబ్బు' అంటున్నాయి. కనక డబ్బు మీదనే నడుస్తోంది లోకం. ఇప్పుడూ దేవుడు కావాలి, తమకి డబ్బు ఇచ్చేందుకు.

లారెన్సుకి చలానికి జీవితపు నడకలో వాళ్ళ మనో పద్ధతుల్లో పోలికలున్నాయి. వాళ్ళ పుస్తకాల వెనక sex ముఖ్యమై వుంటో వుంటుంది. ఇద్దరూ ఈ మురికి పడకటిళ్ళల్లోంచి, (అంటే మురికి మనసు

ల్లోంచి) sex ని గురించి ఆరోగ్యంగా ఆలోచించి జీవించమంటాడు (రు). చలం చెప్పేది చాలా స్పష్టం. లారెన్సు చెప్పేది అంత స్పష్టం కాదు. సాంఘికంగా చలం రాతలూ, చాతలూ విప్లవంగా వుంటాయి. లారెన్సువి అంత కావు. ఇద్దరూ సత్యాన్వేషకులు. కాని అతని పుస్తకాలకూ, చలం పుస్తకాలకు ఎక్కడా సంబంధం లేదు. అతని శైలి మల్లే వుంటుందంటాడు వజీర్‌రహ్మాన్. కాని ఆ పోలిక చలానికి కనపడదు. చలం బలం కన పడదు అతని శైలిలోగాని, పుస్తకాలలోగాని, జీవితంలో గాని.

Lady chatterly's lover రెండు editions unexpurgated అంటే కొన్ని భాగాలు తీసి వెయ్యని పుస్తకం దొరకడం కష్టం. అసలు sex అంటే ఏమిటో, చాలా మూలానికి వెళ్ళి ఎంత ప్రోద్బలమో అందమో పువ్వులలో వలె ఎంత సహజమో నవల రాశాడు. కాని చలం అంతకన్న అందమైనవి రాశాడు. కాని తెలుగులో రాశాడు. వీళ్ళమధ్య అందుబాటులో బతికివున్నాడు. అదీ ఖర్మం. సత్యం కోసం చాలా వెతికాడు లారెన్సు. చిన్నతనంలో చచ్చిపోయినాడు. బతికివుంటే అందుకునే వాడేమో!

మీ 'ప్రార్థన' అనువాదం చాలా బావుంది.

అందరం ఈశ్వరాదరణలో బావున్నాం, భగవద్గీత (స చలం వ్యాఖ్యానంతో) అచ్చు తెలుగు చెయ్యడం ప్రారంభించాను.

పెద్దపని. చాలా శ్రమ తీసుకుంటోంది. పూర్తి చెయ్యగలనో లేదో! కాని ఈశ్వరుడు ఉత్సాహమిస్తున్నారు 'కానిమ్మని'.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-2-64

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఇంకా D. E. O. లూ నోట్లూ ఉన్నాయన్నమాట. ఓసారి మీ జిల్లాలోనే ఓ Inspection జరిగింది. మా Training Sch-

ool కి చాలా ఏళ్ళ పని చెయ్యించి, ప్రఖ్యాతిగల D.E.O. గారు వొచ్చారు. Model school ల్లో ఒక ముసలి టీచరున్నాడు. ఆయన చిన్నతనంలో ఓ వైజయంతి పుస్తకంలో చూడో తరగతికి Teaching notes రాసుకున్నాడు. ఆ పుస్తకమే 25 ఏళ్ళ తరవాత స్కూలుకంతా గొప్ప టీచరనీ, ఆ notes చూస్తే తెలుస్తోందని పొగిడారు D.E.O. గారు.

రాజుగారు రాసిన వ్యాసం మీ కంపే సంగతి ఏమీ తోచడం లేదు. ఆయన ఇక్కడికి వొచ్చినప్పుడు అడిగి చూస్తాను.

నా భగవద్గీతని తిట్టకండి. ఎట్లాగూ తిడతారు. తిట్టడానికి ఏం వొరికినా. చాలా బావుందా, ఎవరూ ఏమీ మాట్లాడరు. మొన్న ఇంకో urgent పని వొచ్చింది మాకు డబ్బు తెచ్చేది. దాన్ని వొదిలి భగవద్గీతే చెయ్యమన్నారు ఈశ్వరుడు.

"ఏం? అది చెయ్యకపోతే! ఈ తెలుగువాళ్ళకోసమేగా" అన్నాను.

"అదికాదు. ఎవరి కోసమూ కాదు. ఆ పని నువ్వు చేస్తున్నది నీ కోసమే" నన్నారు! అంత స్పష్టమైన విషయం మరిచిపోయినాను.

ఎంత తొందర పడతారండీ మీరు? నా కన్నా తొందరపాటు కలవారు మీరే కనపడుతున్నారు. చిన్నారావుగారు తన జబ్బు సంగతి రాశారు. అదేగాక ఇంకా నిర్వ్యిణ్ణత వినపడ్డది ఆ ఉత్తరాలలో. నేను కదిలిపోయాను. ఈశ్వరుడికో చెప్పాను.

వెంటనే ఇక్కడికి రమ్మనీ, సహాయం జరుగుతుందనీ ఎంతో బతిమాలి రాశాను. ఆయన రారు.

చాలా, ఇంకేమన్నా రాయాలా! అట్లానే దీక్షితులుగారికి రాశాను కొన్ని నెలలపాటు, బతిమాలుతో రమ్మని. 'నాదగ్గరికి కాదు మీ గురువు దగ్గరికి, భగవాన్ దగ్గరికి' అని. ఆయన రాలేదు.

ఈమధ్య ఓ విద్యార్థిని రాసింది 'చలం, చలం మిమ్మనెప్పుడు, ఏ నిమిషాన చూస్తాను? మీరు చెయ్యి చాపకపోతే నాజన్మ: ఎందుకు?' అని.

ఎంతో ప్రేమతో ధైర్యమిస్తో రాశాను, దానికి జవాబు.

"మీరు నన్ను రమ్మని మరీ అంత ప్రాధేయ పడుతున్నారు కనక, సరే, చూస్తాను. అందరూ ఎందుకు పోతావునువ్వు! అని రాస్తున్నారు. ఆ ఈశ్వరుడు అవీ నాకేం నమ్మకం లేదని" జవాబు రాసింది.

కాని ఇంకో బాధ. ఉత్తరం రేపు మళ్ళీ వొచ్చిందా— నాకు బుద్ధి వుందంటారా. అంత హృదయ మిచ్చి రాస్తాను.

నవ్వుతో మన హృదయాలమీద గంతులేస్తారు ఆ బాధలో వున్నామని రాసిన వారు. మీకూ బుద్ధిరాదు. నాకు రాదు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10-3-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీకు జవాబు రాయలేదా? జ్ఞాపకం లేదు.

ఈశ్వర కరుణలో అందరం కులాసా. క్రీస్తుని అంత లోతుగా ఆలోచిస్తున్నారంటే, తక్కిన మోడుపారిన ప్రాంతాలకన్న అక్కడ మనుషుల హృదయాలు సజీవంగా ఉన్నాయన్నమాట.

భగవద్గీత సాగుతోంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

20-3-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును. మీరు రాసిందంతా నిజం. ఈశ్వరుడు జవాబు గనక, అన్ని బాధలకీ హేతువు కింద ఆయన్ని నిందిస్తాం, ప్రార్థిస్తాం.

ఇక్కడ ఈశ్వరుడు మాట్లాడుతున్నారు. ఎట్లా మనుషులు తమ బాధల్ని తాము ఇరుక్కున్న మూలల్ని, తాము అలవరుచుకున్న మమతల్ని, దుర్గుణాల్ని వొదలడానికి ఇష్టపడరో స్పష్టం చేసి చూపుతున్నారు. కనక తీర్థయాత్రలు చేస్తారు గాని ఈ ఈశ్వరుణ్ణి దర్శించి ప్రశ్నించరు.

ఈశ్వరాశీర్వాదాలలో

చలం

*

6-4-64

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మంచి తనానికీ తెలివికీ ఏం సంబంధం ! అవును, తెలివి తక్కువగా assistants కి వొప్పచెపితే దాని ఫలితం అనుభవించాలి. చాలా మంచివారు, వానలో తడిశారు. జలుబు చేసిందేమిటంటే ఎంత అర్థమో దానికీ అంతే అర్థం.

భగవద్గీత సాగుతోంది. కాని కనీసం 4 నెలలు పడుతుంది. అదే దీక్షగా చేస్తున్నాను. ఎండల్లో ఏ మాత్రం ఇట్లా రాస్తో వుండగలనో? ఒకటే సంగతి. దేనివల్ల గొప్ప దొంగలు తయారవుతారో, అది అంత గొప్ప గ్రంథ మన్నమాట, చలం సాహిత్యంతో సహా.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

16-4-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఈ 14 ఏళ్ళూ ఇంతేగా మీరు. కొన్నాళ్ళున్నాక restless గా అవుతారు. ఆ వూరు బావుండదు. మనుషులు బావుండరు. బదిలీ కావాలంటారు. ప్రయత్నిస్తారు. ప్రార్థిస్తారు. బదిలీ ఐన తరవాత, గోల పెడతారు ఆ కొత్త స్థలం బాగాలేదని.

ఆ విషయాలు ఈశ్వరుడికి వొదిలి, విశ్వాసంతో మెదలకకూచోండి. నా కథలు చిన్నవి రెండు అమెరికా పత్రికలు తీసుకున్నా యట. ఒకటి తెలుగుదీ ఒకటి ఇంగ్లీషు చేసింది. ఇంకా కావాలిట. ఈశ్వరాదరణలో బావున్నాము. మీకు సెలవ లెప్పుడు. వ్రాస్తున్నారు కదూ.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

25-4-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. వ్రాస్తున్నారా! మంచిది :

పేపర్లు ఇక్కడే దిద్దుకోవొచ్చు కదా! అన్నారు ఈశ్వరుడు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

4-5-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. టీచర్లని వృత్త చీపురు కట్టలకన్నా అన్యాయంగా చూస్తున్నారన్న మాట. తిండీ, సినిమాలు, పిల్లల నించి లంచాలు లభిస్తు న్నాయి గనక టీచర్లూ సంతుష్టిపడో లేక చేసేది ఏమీ లేకనో పూరు కుంటున్నారు.

నేను రాశాను కదూ రాజు గారికే దొరకలేదు- ఆయన రాసిన వ్యాసం కాపీ అని. ఎండలేకాని ఇక్కడ, దుర్భరంగా లేవు ఈశ్వరుడి దయవల్ల.

అందరం ఈశ్వరాదరణలో సుకంగా ఉన్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-5-64

వీరేశలింగంగారికి,

మీ గీతాలు బావున్నాయి. ఎండలు, ఏం తోచదు. దేనిమీద గట్టిగా మనసు నిలిపి యోచించలేను.

మీ Prophecy right ఐతే ఎంత బావుండును.

ఎండలైనా ఈశ్వరాశీర్వాదాలతో అందరం సుఖంగా ఉన్నాము.

నా కథ ఒకటి అమెరికా పత్రికలో అచ్చయిందట.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

23-6-64

వీరేశలింగంగారికి,

సుఖంగా చేరారన్నమాట. ఇక్కడ కొన్ని nice days గడిపారు మాతో. నాలుగో వాచకా లొస్తున్నాయని గంతులేస్తున్నారు కాకా, కిట్టూ.

ఇక్కడ వానలు లేవు. అప్పుడే చాకళ్ళు బట్టలు ఉతకడం మానేశారు.

ఈగలు ఎక్కువగా ఉన్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

—

26-6-64

ఎన్ని ఆర్లో చూడండి

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మనిఆర్డరూ అందాయి.

మీకు వీలుకాగానే నాలుగో వాచకాలు పంపండి.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము. మాధురీ అక్కా-సాహెబ్ నిన్న హైదరాబాదు వెళ్ళిపోయినారు.

పకపక వజీర్ రెహ్మాన్ ఇప్పుడు వెళ్ళిపోతున్నారు.

పాపం 'వీ' ఏడుస్తుంది గావును వాళ్ళు వెళ్ళేప్పుడు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7-7-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. సరే వెంటనే పంపండి S.S.L.C. Textన్నూ ఇంకో 4 తరగతి వాచకమున్నూ.

ఈ చదువుల వల్ల ఉద్యోగాలే కద! స్త్రీలకి. ఉద్యోగాలకి ఎక్కువ వీలు కలుగుతుంది.

కాని ఎవరో కొంతమంది తప్పితే, తక్కువ ఉద్యోగాల స్త్రీనిచూస్తే ఏ సంతోషం రాదు. వంటలు చేసే స్త్రీలే చాలా నయం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

మూడో తరగతి లెఖ్ఖల పుస్తకం కాపీలు రెండు కావాలి.

మీరు పంపిన cutting చదివి, మళ్ళీ రాస్తాను.

p. s: cutting చదివాం. మాటలు మామూలువే. గొప్ప తనం ఆమెలో వుండి వుండాలి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

16-7-64

వీరేశలింగంగారికి,

జ్ఞానప్రభలో ప్రశ్నోత్తరాలు చూశాను. మాంచి తప్పులున్నాయి. పైగా వాళ్ళ అచ్చు అట్లా వుంది. అచ్చుకి వెళ్ళేముందు నాకోసారి చూపి సరి చేయించుకుంటే బావుండేది.

S.S.L.C. తెలుగు Text ఏ సంవత్సరానిదైనా సరే. ఎంత పాత దైనాసరే.

భగవద్గీత మాటలతో పని కాదని తెలుస్తోంది. చాలా పని చెయ్యాలి. ఎంతవరకని ఎలా చెప్పను.

ఈ భగవద్గీత తప్ప ఇంక పుస్తకాలేమున్నాయి, ఎప్పటికన్నా ప్రచురణ కావడానికి!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

24-7-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు! జ్ఞానప్రభ కాపీ అప్పుడే పారేశాము.

S.S.L.C. Text అందిందని రాసినట్టు జ్ఞాపకం.

అగష్టు 15 సన్నాహాలతో ఉన్నాము. ఈ ఏడు హైద్రాబాదునించి చలం యాత్రా Special bus పై లుదేరుతుందిట.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

30-7-64

వీరేశలింగంగారికి,

మీరు పంపిన Text Books అందాయని రాయనేలేదా, నేను ఎంత మరుపో. వొళ్ళు బావుండటంలేదు. అందుకో ఏమో! ఇవాళ కూడా బాగా లేదు.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

7-8-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఇక్కడ వర్షాలు లేవు. హాయిగా వుంది. తిరిగి మీకు అందమైన కలలు ప్రారంభించాయన్న మాట. అదృష్టవంతులు. మీ గీతం ధర్మసాధనిలో పడ్డది. దాన్ని మీకు redirect చేస్తున్నాను ఇవాళ.

చాలా ఉత్తరాలు.

అనారోగ్యం నించి తేరుకుంటున్నాను. ఉత్తరాలు రాసిరాసి ముడ్డి తీపుపెడుతోంది. మీ వోటి వారెవరో తప్ప Thank you అనేవారుకూడా తక్కువ.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

12-8-64

వీరేశలింగంగారికి,

Watch and pray అంటారు ఈశ్వరుడు. పాపం, బాధ భరించలేక నాకు రాసుకుంటారు. నేనేం చెప్పను? నమ్మండి. కాలం బాపుపడుతుంది అంటాను. భగవద్గీత చాలా పెద్ద విషయం. క్రమంగా సాగుతోంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-8-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మిత్రులు చాలామంది వొచ్చారు. గొప్పగా జరిగింది ఉత్సవం.

మాలతి విజయనగరం నించి ఉత్తరం రాసింది. జవాబు రాశాను. మళ్ళీ ఉత్తరం లేదు. పరిసర ప్రభావమై వుంటుంది.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-9-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును మాలతి రాసింది. తిరిగి ఉత్తరం రాశాను. తన చిరునామా రాయలేదు. నా జవాబు అందిందో లేదో. ఆమె చిరునామా రాయండి.

క్రిష్ణశాస్త్రికి గొంతులో cancer. చాలా ఏళ్ళ నించి కంఠంలేదు. చివరికి దాన్ని cancer అని కనిపెట్టి పెద్ద ఆపరేషన్ చేశారు బొంబేలో.

ఇప్పుడు కంఠంలో ఓ గొట్టం. దాంట్లోంచి తప్ప తినడానికి వీలులేదు! మొత్తానికి మాట లేదు.

మీ ఉత్తరాలు అంటే చలం మీకు రాసిన ఉత్తరాలు, అట్లాగే పడి వున్నాయి. మీకేమన్నా గట్టి Interest వుంటే, పత్రికల్ని కదిలించి చూడండి. పూర్వం జగ్గారావు గారితో 'యువ' వాళ్ళు కూడా ప్రచురిస్తా మన్నారు.

చలం పుస్తకాలలోనే Interest లేదిప్పుడు. ఉత్తరాలు ప్రచురి స్తారా? సందేహమే.

ప్రేంచంద్ publicationsకి కూడా రాసి చూడండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

24-9-64

వీరేశలింగంగారికి,

వాళ్ళు బావుండక ఇంటికి వచ్చి అక్కడ నించి ఉత్తరం రాసింది మాలతి. నేను జవాబు రాస్తున్నాను. కాని ఆమె వెంటనే విజయనగరం వెడుతున్నానని రాసింది. నేను విజయనగరానికి ఆమెకి రాసిన ఉత్తరాలూ, భగవాన్ పటమూ ఆమెకి అందలేదు. ఆమె చిరునామా సరిగా రాయలేదు.

ఆమెకి చెప్పండి ఈ సంగతులు ఆమె అక్కడవుంటే.

లేదా, ఆమె విజయనగరం చిరునామా కనుక్కొని వెంటనే నాకు రాయండి.

పాపం, ఆమె నలిగిపోతున్నట్టుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

28-9-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఈ భగవాన్ ఫోటోని మాలతికి అందచేయండి. M.O. అందింది.

అవును. కృష్ణశాస్త్రిగారు చాలా బాధపడతారు. పైగా పిరికి మనిషి. ఈ బాధలో ఒకాయన interview చేసినట్టు పత్రికలో రాశాడు. అప్పుడూ pose మానలేదు శాస్త్రిగారు. ఎందుకు బాధలొస్తాయో, ఎవరికో, అదంతా మన ఆలోచనలూ, ఇమాజినేషన్ ఏకాని, అసలు సత్యం అందుకోలేము. ఈశ్వరుడు ఎంత చెప్పినా అర్థం కాదు.

మీకు ఇష్టమైతే చలం ఉత్తరాల సంగతి పత్రికల వాళ్ళని అడగ మన్నారు ఈశ్వరుడు.

నేను మాలతికి మెంటాడకి ఉత్తరం రాశాను అందిందా? ఈ చదువులకి ఎంతమంది ఆరోగ్యాలు బతుకులు ఆహుతి ఐపోతున్నాయో?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

6-10-64

వీరేశలింగంగారికి,

నా ఉత్తరం అందివుంటుంది. నేను రాసే ఉత్తరాలు ఈనాటి వారికి నచ్చవు. వాటిని అరిగించుకోడానికి కూడా శక్తి లేదు వాళ్ళకి.
4 తరగతి లెఖ్ఖల పుస్తకాలు మూడు కాపీలు తొందరగా పంపండి.

ఈశ్వర కరుణలో అందరం బావున్నాం. బియ్యం లేవు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7-10-64

వీరేశలింగంగారికి,

30 ఏళ్ళ కిందట ఆడపిల్లల్ని చదివించమంటే మండి పడ్డారు. ఇప్పుడు చదివించవొద్దు అంటే పిచ్చివాణ్ణి చూసినట్టు చూస్తున్నారు.

మాలతికి విభూది పంపుతున్నాను మీపేర. ఆమెకి ఇవ్వండి.

నాలుగో వాచకం, లెక్కల పుస్తకాలు మూడు కాపీలు పంపరూ తొందరగా!

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

12-10-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఈ వూళ్ళో బియ్యమూ చక్కెరా ఎలాగో వోలాగు కష్టం మీద దొరుకుతున్నాయి. మాకు ఏ కష్టమూ లేకండా ఈశ్వరుడు చూస్తున్నారు.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

మబ్బులు పట్టాయి మమ్మల్ని.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

16-10-64

వీరేశలింగంగారికి,

ఇవాళ మీ ఉత్తరమూ, M. O. రెండూ అందాయి. పెద్ద ఉత్తరం రాయంటే ఏం రాయను ? నాతో వొచ్చిన ఖర్మమే అది. రాయమని అడిగితే

పుస్తకం రాయలేను, కథ రాయలేను, ఉత్తరం రాయలేను, సోదర సోదరీ మణులారా అనలేను.

మీకు (చిన్న చదువులు సరే) పెద్ద చదువులమీద వ్యామోహం పోలేదు ఇంకా. మీకు పిల్లలు లేకపోవడం మంచిదయింది.

'వీ' చాలా చిన్నది. చదువుకోదు ఇంకా, అయినా చిత్రకి కొడు కేమిటి, కూతురేమిటి ? ఎందుకనుకుంటున్నారు అట్లా !

అవును విన్నాను వరదలు అవి. పేపర్ల గోలే కాని, అక్కడ వున్న మన మిత్రులు ఏమీ గాబరాగా రాయటంలేదు. ప్రభుత్వం మనుషుల సంఖ్యని తక్కువ చేస్తుంది. డబ్బు నష్టాల్ని ఎక్కువ చేస్తుంది.

పాపం, కాంతం గారికి cancer ! ఈమధ్యనే ఇక్కడికి వొచ్చి వెళ్ళారు. గొంతు నెప్పిగా వుంటోందని అన్నారుకూడా.

నేనెప్పటి నించో రాస్తున్నాను. దీనులలో Interest తీసుకోమని. ఆఖరికి గజ్జికుక్కని సాకండి. ఆస్పత్రికి పోయి రోగులతో మాట్లాడండి. వాళ్ళలో ఈశ్వరుడు కనపడతారు.

పత్రికలు చదవకండి. అవి గుండెల్ని రాళ్ళగా మారుస్తాయి. మనం ఏ సహాయం చెయ్యలేని బాధల్ని గురించీ, డబ్బు హోదా, కీర్తి గాళ్ళని గురించి రాస్తారు వాళ్ళు.

మీరు జపం చేస్తున్నారా ? అని అడుగుతున్నారు ఈశ్వరుడు.

హృదయం మూసుకుపోయినకొద్దీ పూపిరాడదు. అర్థంలేని ఆ పాఠాలు వొల్లిస్తో, తలెత్తి చుట్టూ చూడకండా నిర్జీవులవుతున్నారు. మీ ఐడి పిల్లల్ని చూసి, వారి బాధలో, మీబాధ మరవలేరా ?

లోకాన్నీ, దాని మాయ విలవల్నీ, సంఘాన్నీ దాని అబద్ధాలనీ, బాధల్నీ. ఇరుకునీ, మనము అంగీకరించామా ఇంక మరణమే. మనం

వాళ్ళ మల్లే కాలేము-ఆ విలవలు మనవిగా చేసుకోలేము. కాని ఆ విలవల్ని అంగీకరిస్తాము. అదే మన ఇరుకు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

16-11-64

వీరేశలింగంగారికి,

చాలా ఉత్తరాలు. ఈ కాలంలో ఎవరి కెప్పుడు ఏం రాశామో జ్ఞాపకం వుండదు. మీ ఉత్తరంలో జవాబు రాసేందుకు ఏమీ వుండి వుండదేమో ?

మనకి శుభమైన వాటిని ఆయన ఇస్తోనేవుంటారు. ఇంటినిండా అతిథులు. పనులు. ఎన్నో ఉత్తరాలు రోజూ. డాలీకి ఈ పాటికి తిరపతిలో పెళ్ళి అయివుంటుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

23-11-64

వీరేశలింగంగారికి.

మీ కార్డు. డాలీకి, శ్రీ P. V. K రాజుగారికి పెళ్ళి జరిగింది.

ఇంకేం విశేషాలు కనపడటం లేదు రాయడానికి. దీపానికి చలం మిత్రులు వొచ్చారు, ఇంకా ఉన్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

16-12-64

వీరేశలింగంగారికి,

పోనీ ఆ రెండు వాచకాలే పంపండి. యీసారి కోసారి అన్నా మీ గురువు దర్శనం చేసుకుంటే మంచిది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-12-64

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. జపం మానకండి. మధ్య మధ్య అట్లానే తిరగ పెడుతో వుంటుంది అహం. ఎండాకాలంలో రండి. అన్నీ సద్దుకుంటాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

25-12-64

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీరు కావలిస్తే ఈశ్వరుడు మిమ్మల్ని ఆ పూర్ణో చూడ లేదా? గట్టిగా చూసినప్పుడు, మీరు కుయ్యో మొర్రో అనటం లేదా?

ఇక్కడికి రావడం నా సలహా, మీ అవసరం, అనుకుని. మన మిత్రులాలా! అట్లాంటి వెన్నెముక లేని సూన్నృతులు ఎంతమందో! శరత్ నవలల నిండా వాళ్ళే.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

28-12-64

వీరేశలింగంగారికి,

Many thanks. అవును. ఈ పిల్లల చదువులూ మీరు రాసిన ప్రతిమాటా నాలో పలుకుతుంది కాని....

what are we

ఈశ్వరుడు కూడా సరస్వతి పక్షమే. మనమేం చెయ్యగలం?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

2-1-65

వీరేశలింగంగారికి,

ఆ శరత్ స్త్రీ పాత్రలని అవమాన పరచండి. ఆ స్త్రీలు స్త్రీలుకాదు, నిలువునా కరిగిపోయే హృదయాలు. వాళ్ళకి లేనిదే స్వార్థం. ఈనాటి స్త్రీలో స్వార్థంతప్ప ఇంక దేనికీ చోటులేదు. వీరేశలింగం, చలం, ఈశ్వరుడు, అందరూ తమకి ఉపయోగపడ్డంత వరకే. మీరంతకన్నా ఏదో వుందని ఆశపడతారు. అందుకే అన్ని ఎదురు దెబ్బలు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-1-65

వీరేశలింగంగారికి,

మీ M.O. అందింది. చక్రపాణి నరసింహారావుగారు ఎప్పుడో వెళ్ళిపోయినారు ఇక్కడి నించి. వెళ్ళి ఉద్యోగంలో చేరారు.

జయంతి ఐనాక, మొన్న మొన్న వొచ్చి వెళ్ళారు చిన్నారావు గారు. ఇక్కడ విశేషాలేమీ లేవు.

నేను ఈశ్వరాదరణం వల్ల కులాసాగా ఆరోగ్యంగా ఉన్నాను.

నేను మీ ఉత్తరాలకి జవాబు రాస్తోనే ఉన్నాను. మరి ఆ ఉత్తరా లేమౌతున్నాయో! మీ పోష్టాఫీసులో ఎవరో చిల్లి కొట్టినట్టున్నారు.

ఆ మాలతి వ్యవహారంలో ఎవరో మిమ్మల్ని అనుమానించి ఉత్తరాలు మధ్యలో కొట్టేస్తున్నారు గావును! జీవితం నిరాశగా ఉన్నా సాధనలో నిలవలేకపోతున్నా.

సాధన ఒకటే తోవ.

ఏనాటికన్నా ఆ నిరాశ చావాలంటే.

ఈశ్వరుడు చూస్తున్నారు గనకనే, ఆయన చూపు మీనిద్రని కలత పెడుతోంది గనకనే ఆయన అగ్ని మిమ్మల్ని, మీ అంతరాంతర వాంఛల్ని కాలుస్తోంది గనకనే

ఆ నిరాశ.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

14-1-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీ గీతం మళ్ళీ జ్ఞానప్రభకు పంపిస్తున్నాను.

అదేమిటి? వనితా దాసుడు జీవితమంతా చలం—మీబాధని బలహీనాన్ని అతను అర్థం చేసుకోలేకపోతే, ఎవరు అర్థం చేసుకోగలరు.

భగవాన్ని ప్రార్థించండి. ప్రార్థనకి తప్పక ఫలితం వుండి తీరుతుంది సకాలంలో. అదెప్పుడైనా కానీ. ప్రతి శరత్ నవలా గొప్ప స్త్రీ చుట్టూనే అల్లుకుని వుంది. నేను చదివిన— నవలలే మీకూ రికమెండు చేస్తున్నాను. శ్రీకాంత్, చరిత్రహీనులు, సరిత, శేషప్రశ్న.

ఈశ్వరుడుండనన్నాళ్ళ ఇంకేముంది ఈదుఃఖమయ ప్రపంచంలో వెలుగు

స్త్రీ!

కాక!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

22-1-65

వీరేశలింగంగారికి,

గొప్ప హృదయం వుండటానికి, స్వాతంత్ర్య సమరానికీ సంబంధ మేమిటి? ప్రేమవల్ల తమ స్వీయ స్వతంత్రాన్ని అర్థం చేసుకునే దేవతల్ని అర్థం చేసుకోలేవా? ఆత్మస్వతంత్రం కోసం ఎదురు తిరిగేచలం నాయికల్లోని త్యాగాన్ని తెలుసుకోలేవా?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

26-2-65

వీరేశలింగంగారికి,

మీ గీతాలు బావున్నాయి. మీ ఉత్తరమే ఇంకో గీతం మల్లే వుంది. మీ ఉత్తరంలోని ప్రశ్నలకి, మీ గీతాలే జవాబులు.

ఆ మూటినీ మూడు పత్రికలకి పంపుతున్నాను.

అవును. మన కోరికా ఈశ్వరుడి కోరికా కూడా మనం చచ్చిపోవా లనే! కాని నిజంగా చచ్చిపోతామా ? ఉద్యోగం వదలలేము ! రచనల్ని

వొదలలేము. మనమెక్కడ చావగలం? వుత్తమాటలు కాని! అసలు చావు నరే ఈ దేహానికైనా చావుని స్వీకరించ గలమా?

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

20-3-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నా వొళ్ళెం బాగాలేదు. రాత్రులు నిద్ర రావడంలేదు.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

5-4-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు. Inch by inch, degree by degree health recover అవుతున్నాను.

భగద్గీత Publisher చేతికి వెళ్ళింది. Intro రాయలేదు. ఎప్పటికో!

మీ డాక్టరు పేరు 'సుధాకర్' అయివుంటే నా చెల్లెలి కొడుకే. వాళ్ళని ఎరగననుకో. కానిమీకేమన్నా అవసరమైతే Introduction note రాస్తాను, for What it is worth, Mayలో-

ఈశ్వవాశీర్వాదాలతో
చలం

*

15-4-65

వీరేశలింగంగారికి,

B. P. క్రమంగా తగ్గుతోంది. 'సుధ' చలం మేనల్లుడని ఎట్లా తెలిసింది ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-4-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నా B. P. క్రమంగా నయం చేస్తున్నారు ఈశ్వరుడు. మీరు రావడ మెప్పుడు ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

29-4-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు. భవద్గీత strenous గా చేసేప్పటికి పాత B. P. వొచ్చింది. B P. అంటే High Blood Pressure.

ఇప్పుడే అదుపులోకి వొచ్చింది. ఈశ్వరుడు చూస్తుండబట్టే ఏ మందూ లేకుండానే, కిందికి దిగుతోంది. B. P.

ఆ B. P. అనే భయం లేకపోతే, నా అంతటివాడు లేడని ఖురానూ ఉపనిషత్తులూ తెలుగు చెయ్యాలని పూనుకోనా !

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-5-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీ M. O.

నాకు ఉషస్సులు లేవు

ఉగాదులు లేవు.

'నే నసంత తిమిరశోక లోకాధిపతిని' అన్నారు ఇట్టాంటి దేవో కృష్ణశాస్త్రి. మొత్తానికి చలానికి పుట్టిన రోజులు లేవు. మొత్తానికి పండగలు లేవు-బుద్ధితెలిసిన దాది ఎన్నడూ లేవు.

కనక మీరు పంపిన డబ్బు వుంటుంది. చింతపండు పచ్చడి చేసుకుంటాను యూడాదీ పొడుగూతా.

మీరు వెళ్ళారో లేదో, ఓ సాయింత్రం చినుకుల మధ్య దిగారు.




మేము వీరేశలింగంగారి వాళ్ళం అన్నారు.

అప్పుడు అర్థమయింది. వీరికి దడికేనా, వీరేశలింగంగారు అంత తొందరలో వెళ్లారు! అని. వారందర్నీ వేసుకుని నిన్న Whole day గిరిప్రదక్షిణం వెళ్ళాము, మబ్బుగావుంటే. ఎందుకోఇవాళ పొద్దున్న

వెళ్లారు వాళ్ళు, మీరు తప్ప, మాతో వున్న రమణస్థాన్ భక్తులందరూ ఇక్కడే ఉన్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

12-6-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మన మందరం వొకటే. ఎవరిమో కొత్తవారిని మల్లే, 'ఆదరణకు **thanks,**' అంటో రాయడమేమిటి మీరు!

**U. F. dining hall** పైకప్పుని విప్పేశారు. డాబా వేస్తున్నారు.

ఈ డాబాకింద మనమందరం కలుసుకుని భోజనం చెయ్యడం మళ్ళీ ఎప్పుడో!

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

25-6-65

వీరేశలింగంగారికి,

మీ కార్డులు. నా ఆరోగ్యం పరవాలేదు. ఈశ్వరుడు చూస్తున్నారు.

అవును. ప్రతివారు ఈసారి గొప్ప అనుభవాన్ని పొందే వెళ్ళారు. ఇక్కడ సత్యనారాయణ, నరసింహారావు, రాధాకృష్ణ వున్నారు, బసవ రాజుగారితో సహా.

మీరు బావున్నందుకు సంతోషం!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

25-6-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నా కార్డు అందే వుంటుంది. అపుసు వాళ్ళకి ఇక్కడికి రావాలని చాలా ఏళ్ళనించి ఉంది. చాలా ప్రయత్నాలు చేశారు. రాలేక పోయారు.

ఈ తల్లి కొడుకులే ఐతే, humble గా యత్నిస్తే, ఈశ్వరుడి అనుజ్ఞ అయివొస్తారేమో !

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

5-7-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరము. M. O. న్నూ, మీ లేఖలు 'కరుణామయి'కి ఇవాకో రేపో Post చేస్తున్నాను మొదటి 5 లేఖలూ. ఇవాళ ఓ 20 ఉత్తరాలు కొన్ని దీర్ఘమైన జవాబులు కోరేవి.

11 న మళ్ళీగిరి ప్రదక్షిణం.

మనం భోజనం చేసే పాక, ఇప్పుడు డాబా అయింది-U. F. Dining Hall-.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-7-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు. పడమట నించి మనుషులు ఎగిరిపోయేగాలి కొన్నాళ్ళ

నించి. కనక డాబాకింద భోజనాలు మానాల్సి వొచ్చింది ఇవాళనించి.

నేను టాగూరు గారిది ఏం రాశానో జ్ఞాపకం లేదు.

'ఉత్తరణ' చూశారు కదూ !

ఇక్కడా ఇంతవరకు వర్షంలేదు. బావిలో నీళ్ళు అడుక్కిపోతున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

23-7-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఉత్తరణ కాపీలు కొన్ని ఉన్నాయి నా దగ్గిర. కాపీ కావలిస్తే రాయండి. రిజిష్టరు చెయ్యకపోతే పోస్టువాళ్ళు దొబ్బేస్తున్నారు.

కరుణామయికి జబ్బుచేసి 'కరుణామయూ !' అని అరుస్తోంది.

పిల్లలు మెల్లిగా ఆ పుస్తకాలే చదువుతున్నారు.

U. F. డాబా పూర్తి అయింది. ఇంక లైటు వెయ్యాలి. అంతే. దానికింద భోజనానికి U. F. మెంబర్లు దిగుతున్నారు. అప్పుడే ఆగష్టు 15 కి పైభవంగా ఉంటాము U. F. గాళ్ళం మేము. మీతో కూడా కలిస్తే మనం.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

30-7-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నేను తెలుగు అక్షరాలు చదవలేను. ఎవరన్నా తీరు

బడిగా దొరికినప్పుడు మీ వ్యాసం చదివించుకుని విని మళ్ళీ రాస్తాను. 'కరుణామయు' మాయమయినట్లుందే !

ఈశ్వరాశ్వీరాదాలతో

చలం

*

11-8-65

వీరేశలింగంగారికి,

ఆహ్వానం అందివుంటుంది. మీరు పంపిన డబ్బు అందింది.

రాయగడ నించి మా.... ఉత్తరం రాసింది.

ఆమె అక్కడ ఏం చేస్తోందో, మీకు తెలిస్తే రాయండి.

బావున్నాను ఈశ్వర కృపలో.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-8-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మా ఉత్తరంలో ఈ సంగతులేం స్పష్టంగా లేవు. అక్కడ ఉద్యోగం చేస్తోందనుకున్నాను. చాలా సాహసమైన పనే చేసింది చివరికి !

ఆమె ఉండగలిగినంత సంతోషంగానే వుందని తెలుస్తోంది. కాని మానవులకు సమస్యలు తప్పవు.

ఈశ్వరుణ్ణి ఆమె తన దృష్టిలో వుంచుకుంటే ఈశ్వరుడూ ఆమెని తన దృష్టిలో వుంచుకుంటారు.

మీ నించి కార్డూ, M.O. వొస్తోనే వున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

28-8-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నా వొళ్ళు బావుండక పోవడంతో సరిగా జవాబు రాయలేక పోతున్నాను. మీ Express ఉత్తరం అందిందంటున్నారు ఇక్కడి మిత్రులు. పైగా నా సెక్రటరీని వాళ్ళ బావ వొచ్చి మాయ ఆశలు పెట్టి లాక్కుపోయాడు. అంతదూరానికి పోయి ఏడుస్తున్నాడు తిరిగి రావడానికి డబ్బులేదని.

మా తండ్రిది ప్రేమ అంటారేం? మర్యాద కోసం అగచాట్లు.

శశిరేఖపై మీరు రాసిన వ్యాసం చాలా బావుంది అని రాయలేదా నేను!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

3 - 9 - 65

వీరేశలింగంగారికి,

చిత్కాల క్రిష్ణారావు లేడు. ఎప్పుడో పెళ్ళాడు. అందర్నీ ఇక్కడ నించి ఎవరు తీసుకు పోతారో అతన్నీ ఆయనే తీసుకుపెళ్ళారు.

భగవద్గీత ఇప్పుడప్పుడే అచ్చుపడేట్టు లేదు.

వొళ్ళు బాగాలేదు జలుబు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

9-9-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును. యుద్ధం సంగతి వింటోనే ఉన్నాను.

నా భగవద్గీత సంగతి నాకేం తెలీదు. నా నాటకాలేవీ కొత్తగా అచ్చూ కాలేదు.

నా జబ్బు ఇవాళే నయంగా వుంది.

కరుణామయి మనకి లేనట్టే. సినీమా నగరాలకి వెళ్ళిపోయింది కరుణామయి.

ఏమీ విశేషాలు లేవు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-9-65

వీరేశలింగంగారికి,

కరుణామయి చలాన్ని మర్చిపోతుందని నమ్మరా ? జగ్గారావు మర్చిపోయాడంటే నమ్ముతారా? చలం అతనికి రాసిన లేఖలు పుస్తకరూపంలో ఓ పబ్లిషరు చేత అచ్చు వేయించుకున్నారు ఆయన. ఒక కాపీ అన్నా చలానికి పంపరు, ఎట్లావుందో చూడాలన్నా.

ఆcivilisation మననేం చేసింది? దాంటోంచి బైటపడాలని కోరే వాళ్ళకి మార్గం వుండనే వుంది. దాంటోనే సుఖమనుభవించే వాళ్ళని తప్పించడ మెందుకు? బురదలోంచి పందిని బైటికి పెరుకుతాడా ఏ కరుణామయుడైనా ?

'ఏదీకాదు' అనేమాట చివరి సత్యమే. దాని అర్థం "ఇదేదీ కాదు" అని.

"నువ్వు చేసేదేదీ కాదు"

"ఇదేదీ కాని దేదవుందో అది నీకింకా తెలీదు" అని అర్థం.

'ఈ జన్మకింతే' అని అట్లా తుంచుకోడ మెందుకు ? ఈ జన్మపరం పర అంతా ఒకచే బాట. ఇవి మైళ్ళు :

"అదేదో ఒకటి వుంది. అది చిక్కుతుంది. అదే అదృష్టం." ఈ విధంగా యోచించకండి.

"ఇది ఒక తుది లేని యాత్ర". తుది వుంది కాని చాలాదూరం. కాని ఈ యాత్ర అంతా ఆయనలోనే. ఆ తుదిలోనే.

ఏమిటా ' కష్ట జీవితం !' ఈశ్వరుణ్ణి పొందలేదనా ?

అదిగాక తక్కిన వన్నీ వున్నాయే మీకు ?

ఆ ఈశ్వరుదేవో చాలా సులభం, సమీపం అనుకోడంవల్లనే ఈ బాధ. సులభమే, సమీపమే. కాని దొరకడు.

'చాలా యాత్ర చెయ్యాలి' అని నిశ్చయించుకున్నారా? ఏ గొడవా వుండదు.

జరగనీండి కాలాన్ని. వృథా అనేదిలేదు. తొందరేంలేదు. జారి పోవడమనేది లేదు.

ఏమైనా జీవితం (ఈ జన్మే కాదు) అంతే ఇంతే. ఏం గింజుకునీ ప్రయోజనం లేదు. ఉద్ధరించగల వాడొక్కడే. అతనే వినాలి. ఆయనకి అన్నీ వినపడతాయి. అన్నీ తెలుసు. తొందరపడకండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

30-9-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీ సంశయాలు శమించి మీరు శాంతంగా ఉన్నందుకు సంతోషం.

సుధ ఒకాదా ఉత్తరం రాశాడు మొన్న.

ఆరో వాచకం పుస్తకాలు, మూడు కాపీలు, మీకు వీలుకాగానే పంపండి.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

8-10-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరు సంతోషంగా ఉన్నందుకు తృప్తి.

ఎల్లుండి పౌర్ణమి సాయంత్రం గిరి ప్రదక్షిణం పెడుతున్నాం, దారిలోకి భోజనం మూటలు కట్టుకుని.

సౌజన్య అని కొత్త పత్రిక. వాళ్ళు నన్నేమన్నా పంపమన్నారు. మీ లేఖలు 5 పంపాను.

ఇంకా ప్రారంభించ లేదు. నాకు పది రూపాయల చెక్కు పంపారు. వాళ్ళు తెలుగుదేశంలో తప్ప పుట్టారు.

కనక మీ ఉత్తరాలు ప్రారంభ మౌతాయన్న మాటే అనుకుంటున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

20-10-65

వీరేశలింగంగారికి,

మా.... నాకు రాస్తుంది. కాని నేను రాసే ఉత్తరాలు ఆమెకి అందటం లేదు. అదీగాక ఆమె నాకు రాసే వుత్తరాలు కూడా కొన్ని మాయ మౌతున్నాయి. పాపం, ఆమెకి ఇంటి దొంగని పట్టడం అసాధ్య మౌతోంది! నేనే జవాబులు రాయడం లేదనుకుంటోందో ఏమో! మీరే గనక ఆమెకి రాస్తోవుంటే ఈ విషయం ఆమెకి రాయవొచ్చు. కాని ఆమె ఉత్తరాలన్నీ ముందుగా చదివి ఇచ్చే విశాల ప్రియతములు ఆ ఉత్తరాల్ని అందనీరు.

ఆమె తండ్రి దగ్గిరికి వొచ్చి ఆమె తిరిగి రాయగడో ఏదో వూరు వెళ్ళగానే నేనూ రిజిష్టరు ఉత్తరం రాద్దామనుకుంటున్నాను. ఆమె తిరిగి వెళ్ళిన సంగతి మీరు తెలుసుకుని నాకు తెలియ చేయగలిగితేచెయ్యండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

20-10-65

వీరేశలింగంగారికి,

ఇందాకే మీకో కార్డు రాశాను.

ఎప్పుడూ తలుపులు తెరిచివుండి, ప్రతివారికీ స్వాగతమిచ్చే విరోధులు, అయిష్టులూ లేని శ్రీ రమణస్థానానికి రావడానికి మనసులో ఎందుకిన్ని అభ్యంతరాల్ని కల్పించుకుంటారో !

ముమ్మడని (మా చెల్లెల్ని) రమ్మనండి.

తన రాకగాని, పోకగాని, రాత్రి 9 నుంచి 5 మధ్య కాకండా

మాత్రం చూసుకోగలిగితే సంతోషం. నా నిద్ర భంగమైతే ఆరోగ్యం చెడుతుంది.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

27-10-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఈశ్వరాజ్ఞ అయింది కనకనే మా చెల్లెల్ని ఇక్కడికి రమ్మని రాయగలిగాను.

శ్రీ రమణస్థాన్ లేఖలు చూశారా! ఇప్పటికి వొచ్చాయి కాపీలు నాకు.

మా....కి రిజిష్టరు ఉత్తరం రాశాను.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

29-10-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరు మా....కి రాసిన ఉత్తరం బావుంది. నేనూ ఒక రిజిష్టరు ఉత్తరం రాశాను. నా interest మా.... మీద కన్న ఆమె భర్తమీద.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

6-11-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఉత్తరాలు ప్రచురిస్తామన్న పత్రిక నవంబరు 1కి వొస్తుందన్నారు. ఇంతవరకు రాలేదు.

మా.... నించి నాకూ ఉత్తరం లేదు. ఆమె భర్త చలానికి గాని చలం మిత్రులకి గాని ఉత్తరాలు రాయడానికి వీలులేదని వుంటారు.

శ్రీ రమణస్థాన్ లేఖలు సోమవారం పంపుతాను. నేను మరిచిపోతే జ్ఞాపకం చెయ్యండి. బెజవాడలో మిత్రులు ఆ పబ్లిషర్ల చుట్టూ తిరిగితే, చివరికి పంపారు కాపీలు.

అవును. ఇక్కడి మిత్రులు చెపితే నేనూ చూశాను తోకచుక్కని. కాని ఆ తోకచుక్క చాలా harmless గా కనపడుతోంది. ఈఏడు Arcticzone లో చలి ఎక్కువగా వుంటుందేమో దాని కారణంగా. ఈశ్వరుడు ఆ తోకచుక్క సంగతి ఏమీ మాట్లాడలేదు.

ఇక్కడా రెండు గోరింక పిల్లలు దొరికాయి. ఒకటి వాటిల్లో శాకాహారి. రెండోది మాంసం మీద గాని వర్ధిల్లదు. వానకురిసి ఆగి, ఆవానలో తడిసిన పచ్చిగడ్డితో ఎగురుతున్న పురుగుల్ని తెచ్చి మేపుతున్నాము ఈ పిట్టని. ఎంత న్యాయముందో దాంటో!

ఇక్కడ నాలుగు రోజుల్నించి వానా ఎండా ఆడుకుంటున్నాయి ఆకాశంలో. నాకు మాత్రం పైటికి పోయే యోగ్యత పోయింది.

ఇప్పుడు నేనేమీ చదవలేను, చూపు మందగించడంవల్ల. ఎప్పుడూ చేతుల్లో పుస్తకంతో 60 ఏళ్ళు బతికిన నేను, పొద్దస్తమానం అట్లాకూచుని వుంటాను. రాత్రి కూడా నిద్రపట్టదా ఓ 18 గంటలు- మనసుతో-కొంచెం 'ఆగు, బాబూ'అని పోట్లాడుతో.

మనసుకి ఆలోచించడానికి ఏమీలేక మందంగా పూరుకుందా అదీ

జాష్. గాలిలేని ఎండాకాలపు రాత్రివలె. మనసు వేళ్ళతో నశించాలి. అది ఎన్నటికి జరుగుతుందో! జరుగుతుందని ఈశ్వరుడిపై ఆశ.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

8-11-65

వీరేశలింగంగారికి,

మా చెల్లెలు బైలుదేరకండా వుంటే ఇంకా, రాత్రి 9 తరవాత ఈ వూరు చేరవొద్దని చెప్పండి. మాఇల్లు కనుక్కోడం కష్టమే కాదు. నా నిద్రా భంగమౌతుంది. నా వొళ్ళు అంతబాగా వుండటంలేదు కద! నిద్ర లేస్తే ఇంక నిద్రపట్టదు.

ఇవాళ 'శ్రీ రమణస్థాన్' పంపాను. ఇక్కడ ముసురు.

మీ మనిఆర్డరూ ఇప్పుడే చేరింది. మా చెల్లెలూ ఇప్పుడే చేరు కుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

12-11-65

వీరేశలింగంగారికి,

చెల్లెలు ముమ్మడ, చాలాసార్లు మీ కబుర్లే చెపుతో వుంటుంది. మీ ప్రోత్సాహం వల్లనే తానిక్కడికి రాగలిగానని.

మీ ఉత్తరాలు ఒక 5 అదేదో పత్రిక (దానిపేరురాకానే) దాంటో ప్రచురణమైనాయి. కాని ఆ పత్రిక మొహం చూస్తే చాలా కాలం బతికేట్టు లేదు.

ఆ పత్రిక పేరు సౌజన్య, బెజవాడ-3

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము. కాని సౌరిస్ వొళ్లుబాగా లేదు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-11-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నా కార్డు అంది వుంటుంది. ఇవాళ నాకు జరం. కాని ఓ 15 ఉత్తరాలు, కొన్ని పెద్దవి. షౌ వొళ్ళు బాగాలేక షికార్లు వెళ్ళలేదు ఇన్నాళ్ళూ. ఇప్పుడు వెడుతున్నాము.

నర్తకి పెంచుతున్న గోరింక ఎగిరిపోయి, తిరిగి వొస్తోంది ఇవాళంతా! రేపటికి వెళ్ళిపోతుందనుకుంటూ Final good-bye చెప్పి.

అవును మీరూ దిగులుగా రాయాలి. నేనూ దిగులుగా రాయాలి. ఎంత వొదిలించుకున్నా, ఎవో కొత్తవి (పాతవి) మనం కట్టుకున్న illusions భగ్నమౌతో వుంటాయి. ఆ illusions వుండిన కొంతే, మన పురోగమనానికి, తోవ చూపే light All this pain is only to end pain finally.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-11-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. సుధని ఆ సాంబారు Prescription తొరగా పంపమనండి. లేదా మీరన్నా ఆయన భార్య నించి విని రాసి పంపండి.

నా ఆరోగ్యం బాగా వుంటుంది. మళ్ళీ ఏదో చిన్న బాధ పుడుతో వుంటుంది. ఈశ్వరుడు చూస్తున్నారు కద! కాని సౌరిస్ ఆరోగ్యం ఏదో వొక విధంగా నన్ను బాధపెడుతోంది.

భగవద్గీతకి Intro రాయవలసిన సమయమయింది. B.P. లేదుగాని మెదడు పని చేశానా వొస్తుంది. ఒక్క 10 రోజులు మెదడుశక్తి నిమ్మని, నాచేత రాయించమని ఈశ్వరుణ్ణి అడుగుతున్నాను.

ఆ పత్రిక పంపారా మీకు (సౌజన్య). జీవన్ ఉత్తరాలు ప్రజా మతలో అచ్చవుతున్నాయి.

నేను చదవలేక పోవడం వల్ల నాకేం ఇబ్బందిగా లేదిప్పుడు. ఎందుకు వైద్యం? చదివిన చదువులు చాలు. మీ ఉత్తరాల అక్షరాలు చక్కగా చదవ గలుగుతున్నాను.

ఈశ్వరుడిపైన attitudes లో మీకూ నాకూ చాలా పోలిక ఉన్నట్టుంది. సుఖంగా ఉంచుతున్నంత సేపూ, నేను Thankful గా feel ఐ ఎన్నోసార్లు దగ్గిరికి తీసుకుంటాను ఆయన్ని. కష్టపెట్టారా విరోధం రేగుతుంది. కాని ఇప్పుడదంతా మారిపోతోంది నాలో, ఆయన శిక్షణ వల్ల.

మనలోని చేదు విరిగి పోవాలి. బలమున్న వాళ్ళలోనే వుంటుంది తిరగబాటు. ఆ తిరగబాటుని విరక్కొట్టరు ఈశ్వరుడు. ఎంత సేపు ఆయన మనని ఏడిపించి, నలిపెయ్యడం! కాని ఆ బలమే ఆయనకి విలవైనది. ఆ తిరుగబాటు బలాన్నే తన భక్తిగా మార్చుకుంటారు, తన ప్రేమ భావాన్ని భరించలేకండా చేసి.

రోజు రోజూ ఉత్తరాలెక్కువవుతున్నాయి. అలిసిపోతున్నాను. నడుం లాగుతోంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

మీ ఉత్తరాలు చదివి నాకిప్పుడు ఓ కొత్త భక్తుడు చేరాడు.

*

23-11-65

వీరేశలింగంగారికి,

మీరీసారి వొచ్చేప్పుడు, మీరు కాని, మీవల్ల authorisation పొందిన వారు కాని—

పలకల దొండకాయలూ, ఆకాకరకాయలూ తెండి.

అంతే కాదు— సుధ Baby కి స్నానాలు ఇత్యాదులు చేయించి తీరుబడి లేకుండా ఉన్నాడు. కనక మీరు ఆయన సమాన భాగస్తురాలినించి కాకరకాయ కూర చేసే విధమూ బిస్లీబేళాహుళి చేసే విధమూ రాసుకుని పంపండి.

బోలెడు ఉత్తరాలు నిన్నా, ఇవాళ.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

27-11-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మెంటాడ అంత అందంగా వుంటుందన్న మాట.

ఇవాళ నీరసం. ఏం రాయలేను.

ప్రజామతలో ఓసారి ఓ issueలో పడ్డాయి ఉత్తరాలు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

2-12-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీ పూర్ణో ఇడ్లి వాన్నెల్లో తయారు చేస్తారా? ఎట్లా?

కూరలకోసం, దాదాపు 8 నెలలు ఆగాలా! సరేలే. ఏం చేస్తాను?

మీరు జ్ఞానప్రభలో రాసింది చదివాను. బావుంది.

ప్రజామతలో మళ్ళీ వేశారు జీవన్ ఉత్తరాలు.

ఆ బెజవాడ పత్రిక ఏమయిందో తెలీనే లేదు.

పన్ను నెప్పిలోంచి వాన ముసురుల్లోంచి నా ముసలి ముఖ చంద్రు డిప్పుడే ఉత్తరాల వేపు తొంగి చూస్తున్నాడు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

3-12-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు. Graceful disintereste giving అనేది ఎన్నడో మరిచింది ప్రజ. అట్లాంటిది వుంటుందని కూడా ఆలోచించుకోలేదు.

అంతేకాదు.

Graceful taking కూడా చాతకాకండా పోతోంది. చివరికి ముష్టి వాళ్ళలో కూడా.

మా....ఉత్తరం రాసింది. నిన్నటి నా కార్డు అందివుంటుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10-12-65

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఇడ్లీ చేసి చూస్తాము.

తను ఎవరికి ఉత్తరాలు రాయడానికి ఎవరికి అభ్యంతరం లేదనీ, భర్త తనని చలానికి ఉత్తరాలు రాయనని వొత్తిడి చేస్తున్నారని రాసింది ఆమె.

ఏలు కాగానే ఇక్కడికి వొస్తారుట.

జనవరి 15 కి 800 పేజీల చలం భగవద్గీత అచ్చునించి వెలువడు తుందిట.

ఈశ్వరాదరణలో బావున్నాము.

మళ్ళీ U.F.D. Hall నిండింది మిత్రులతో.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-12-65

వీరేశలింగంగారికి,

కొంతకాలం నించి ఎడ తెరిపిలేని వర్షాలు. వాటికింకా పోవాలని లేదు. మబ్బుల్ని తరుముతోనే ఉన్నాయి.

వొచ్చిపోయే మిత్రులు, వారి సమస్యల్ని మోసుకుంటో వాటిని ఇక్కడవాణ్ణి నా మీదకీ, అందని ఈశ్వరుడి మీదికి తొయ్యాలని చూస్తో. ఇంకా వొస్తామని రాస్తున్నారు.

'క్రీస్తోపనిషత్తు' అందింది. పేరు ఇదివరకే విన్నాను. నాకు అక్ష రాలు కనపడవుగా. ఎవరన్నా చదివి పెట్టాలి. ఎడతెరిపి లేని ఈ పనులు,

రాతలు, వంటలు-వీటిలో ఎవరికి తీరుబడి! భగద్గీత Intro రాసే యత్నంలో చాలా busyగా tiredగా ఉన్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

22-12-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు, ఉత్తరమూ. ఇడ్లీ నూక అంటే ఏమిటి? పచ్చిబియ్యం నూకా, or ఉప్పుడు బియ్యం నూకా?

మాఘం (సోమర్ సెట్) తాను భగవాన్ వద్ద పొందిన అనుభూతిని అప్పుడే మరిచి పోయినట్టున్నారు. తానో గొప్పరచయితననీ, తనకే ఈ ఆధ్యాత్మిక విషయాలు తెలుసుననే అహమ్మత, ఆయనని మాయలో కప్పి నట్టుంది. భగవాన్ వేదాంతాన్ని విమర్శించారు. వేదాంతం ఏమైతేనేం, తాను పొందిన అనుభవం అసత్యం కాదు కద! అదో అనుభవమని అని పించినట్టేలేదు ఆయనకి.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

29-12-65

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నా వొళ్ళు బాగాలేదు. భగవద్గీత intro రాయడంతో. ఆ intro ఆగిపోయింది.

మున్మడ త్వరలో అక్కడికి బైలుదేరతా నంటోంది.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

4-1-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. సౌజన్య వారికి రాశాను. సౌజన్య రెండో పత్రిక నాకందలేదు. పంపుతారేమో లెండి.

'చలం ఉత్తరాలు వేస్తే ఆ పత్రికని కొనము' అని మన శ్రేయోభిలాషులు రాసివుంటారు ప్రజామతకి.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

15-1-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మున్మడ మద్రాసువెళ్ళి అక్కడినించి హైద్రాబాదు రైలెక్కిందట.

అవును, ఆ ధ్యాన సుఖం అట్లా సాగనివ్వదు మన పాత స్వభావం కాని మనం Persist చేస్తే క్రమంగా అలవాటవుతుంది.

మీ Prophecies సరదాగా ఉన్నాయి. గంటల పంచాంగం అంటారే, తారీఖులూ తిథులూ వుంటాయి- అట్లాంటి Calender, ఒకటి పంపండి. అవును ఇక్కడా మబ్బులూ చినుకులూ. అందుకుని మా గిరి ప్రదక్షిణం ఆగిపోయింది.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

22-1-66

వీరేశలింగంగారికి,

మీ Prophecie అప్పుడే నిజమౌతున్నాయే.

సరస్వతిని (సుధగారి భార్య) సాంబారు ఎట్లాచేస్తుందో ముఖ్యం దాంటో వేసే కొబ్బరి etc. రాయండి.

ఈశ్వర్తాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

25-1-66

వీరేశలింగంగారికి,

మీ నించి కార్డు వొచ్చింది ఇవాళ. భగవద్గీత ఇంకా కాలేదు. ఓ నెలన్నా పడుతుందేమో. నాకు B. P. కదా! నేనింక ఏం రాయననుకుంటాను.

"ప్రేమ ఎందుకు ?" అని ప్రశ్నించిన వారికి, ప్రేమ సంగతి ఏమీ తెలీదు. వారెవరు ప్రశ్నించడానికి. ఒకరు ఇంకోరిని ప్రశ్నించేది కాదుప్రేమ.

ప్రేమ ఎట్లా వ్యక్తం కావాలో ప్రేమించే వారికే ఏ ఆలోచనా లేకండా తెలియాలి. మీరిక్కడికి రావాలంటే డబ్బు వుండదేమో అంటారుట, ఏమిటి ? మీరిక్కడికి పంపే డబ్బు-మీరు నిలవ చేసుకుని రండి. మీరిక్కడికి రావడం ఎక్కువ ముఖ్యం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

28-1-66

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఎందుకు వెంటనే సమాధానం రాయమన్నారు ?

కాలెండరు మొదలైనవి అందాయి. ఆ సౌజన్య, ఆ పత్రికలూ వాటి సంగతి మాట్లాడకండి.

మీరు కూడా పెద్ద ఉత్తరం అడుగుతున్నారా ?

నాకు B. P. కదా !

అయినా రాయప్రయత్నిస్తాను. మా 'చే' బాంబే నించి వొచ్చి కొత్త వంటలు నేర్పుతోంది.

నర్తకి చుట్టూ వూరి రోగులు చేరి, మందులు పుచ్చుకుపోతున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10-2-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఈ పాటికి నాయనగారితో మాట్లాడుతో వుంటారు కాంతంగారు. జ్ఞానప్రభలో రాంరాం గారి సంభాషణలు చదువుతున్నారా ?

ఎడారిలో పడ్డ చినుకుల వల్ల లాభం లేకపోవడమేమిటి ? ఆకాశం మీద మబ్బులు బోలువికావనీ, ఈనాడు చినుకులు పడ్డా, సమయం వొచ్చేప్పటికి 'ఎన్నో చలువ జల్లులు' పడతాయని అభయహస్తం ఇయ్యవా ఆ చినుకులు ! తిరువన్నామలై వొచ్చి మంచి టీ కోసం వొచ్చి నర్తకిని అడిగి టీ తాగి, నాతో కబుర్లు చెప్పి వెళ్లేవారు. మీకక్కడ ఒక్క కాంతంగారే.

ఇక్కడ శ్రీ రమణాశ్రమంలో నెలకోరిని సాగనంపుతున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18 - 2 - 66

వీరేశలింగంగారికి,

మీ కార్డు. రాంరాం గారి సంభాషణలు సరదాగా చదువుకోడానికే. అంతకన్న అర్థంలేదు వాటిల్లో. కాని ఓ చాయ నిజమూ వుంది. ఈశ్వరుడు ఇట్లాంటివి discuss చెయ్యరు. అన్నీ.

రాంరాం గారిని contact చెయ్యడం సులభంలాగే వుంది. కాని కాంతంగారిని తీసుకొచ్చినా, ఆయన కాంతంగారని రూఢి ఏముంది ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

28-2-66

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఆ సౌజన్య వాళ్ళు క్షమాపణలు చెప్పుకుంటూ రాశారు.

అవును. ఆ Spirits వ్యవహారం ఓ గొడవ. ఉన్నవి చాలు. వాటి జోలి ఎందుకు మనకి !

ఈ ఎండలతో నా B. P. హెచ్చుతుంది. ఈ 4 నెలలు ఎట్లాగో !

మీ స్కూలు శలవలు సమీపిస్తున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7-3-66

వీరేశలింగంగారికి,

మీకో జాతక చక్రం పంపుతున్నాను. కొంచెంగా నన్నా ఈ గ్రహాల సంగతి తెలిసినవాళ్ళ చేత, rough గా ముందు జీవితం ఎట్లా వుంటుందో, అడిగి నాకు రాయండి. ఈకాలంలో గ్రహాల సంగతి తెలీని వాళ్ళు లేరు.

మార్చి వొచ్చింది. శలవలకి వొచ్చే Plans వేస్తున్నారా ?

మరి ఆ పలకల దొండకాయలు, ఆకకారకాయలూ ఇంకా ఎప్పుడు? చలం భగవద్గీత పుస్తకాలు బైటికి వొచ్చాయి.

బావున్నారా ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

పార్థివ నామ సంవత్సర చైత్రశుద్ధ పంచమి మంగళవారం. 8 గం. వుద.

| శు | రబు | చం | శరా ల |
|---|---|---|---|
| కు | మిధునము లగ్నం. | | |
| | | | |
| కే | | | గు |

*

8-3-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం M. O. కూడా. నిన్న నేను కార్డు రాశాను. అందిందా!
ఆ జాతకం ఓ చలం భక్తురాలు అమ్మాయిది.

ఈ Points కావాలి-

పెళ్ళి.

ఆధ్యాత్మిక భవిష్యత్తు.

general గా భవిష్యత్తు

ఆరోగ్యం-

మీరన్నట్టు, నేనూ నా B.P. సురక్షితంగా ఉన్నాము.

వొస్తున్నారా!

చాలా బావుంది.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

17-3-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం జాతకం వంటి విషయాలపై ఈశ్వరుణ్ణి చెప్పమని
నేను కోరను. అది ఈశ్వరుడి పేరుకే అవమానం.

ఏంలేదు జాతకురాలు ఏమౌతుంది? అనే curiosity. పైగా ఆమె
నన్ను అడుగుతోంది. నాకు జోస్యం తెలుసు ననుకుని.

భగవద్గీతకి సుదీర్ఘమైన Intro రాసాను. చివరి భాగం, (B. P.
వల్ల) చాలా roughగా పూర్తి చేశాను. కాని నేననుకున్నట్టుగా తృప్తిగా

రాయలేకపోయాను. నన్ను తొందర పెట్టి నాకు B.P. ఎక్కువచేసి బాధలు పెట్టి, ఈనాటికీ నాకు కాపీ లివ్వడు ఆ పబ్లిషరాధముడు.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

25-3-66

వీరేశలింగంగారికి,

జాతకం సంగతేమయింది? భగవద్గీత కాపీలు వొచ్చాయి మీ కోసం ఓ కాపీ ఇక్కడే వుంచేస్తున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

28-3-66

వీరేశలింగంగారికి,

మీ కార్డు, కవరూ. ఏమిటా జాతకం సంగతి అంతపెద్ద చేస్తున్నారు? మీ టీచర్ల table దగ్గిర ఆ గ్రహాల సంగతి శాస్త్రం తెలిసిన ఓ టీచరుకి చూపిస్తే సరిపోయేదే! నాకు వెంటనే కావాలి ఆ information. ఆ జాతకంలో పదింట శుక్రుడు, శుక్రుణ్ణి గురువు చూస్తున్నాడు. ఈ అసాధారణ combination వల్ల general గా ఫలితమేమిటి? ఆ ప్రశ్నకి జవాబు చాలు. వెంటనే రాయండి. మీరడిగిన వన్నీ రాసి కనుక్కునే ప్పటికి చాలా కాలం పడుతుంది.

భగవద్గీత కాపీలు వొచ్చాయనీ, మీకో కాపీ దాచి వుంచాననీరాశాను కదా!

ఇంక చలం భగవద్గీత సంగతి—

1. ప్రతి శ్లోకానికీ తెలుగు వచనం. అవసరమైనచోట
Note-

వీటిల్లో ప్రతి వారికీ అర్థమయ్యే తెలుగు, అందం చెడుతుందన్న చోట మాత్రం భగవద్గీత మాటలే వుంచాను.

2. ఇదివరకు ఎవరూ చెప్పని, ఎవరికీ తెలీని రహస్యాలెన్నో ఈశ్వరుడు చెప్పి రాయించారు.

తెలీని చోట తెలిసినట్టే మాటకి మాట అర్థం రాసి వొదిలేశారు మహా మహా పండితులు. నేను ప్రతిదాన్ని ప్రశ్నించి ఈశ్వరుడిని అడిగి, తెలియ చెప్పేదాకా వాదించి, అర్థం చేసుకుని ఆ అర్థం చేసుకున్నదాన్ని అందరికీ అర్థమయ్యే మాటలతో రాసి ఈ B.P. తెచ్చుకున్నాను.

ఈ పని శంకరాచార్యుల నించి రాధాకృష్ణ వరకు (తిలక్ గాంధీ గార్లతో సహా) ఎవరూ చెయ్యని చెయ్యలేని పని.

గీతాంజలి మల్లేనే ఇక ముందు వొచ్చే భగవద్గీతలన్నీ చలాన్ని చల్లగా కాపీ కొట్టి తాము చేసినట్టే రాసుకుంటారు.

కాని ఇది చలం చేసిన మహత్కార్యం కాదు. ప్రతి అక్షరం ఈశ్వరుడు చెప్పి రాయించినవి.

మాటలే చలంవి.

అదీ విశేషమే. ఈశ్వరుడి మౌనభావాన్ని, మాటల్లో పెట్ట గలగడం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-4-66

వీరేశలింగంగారికి,

మీ express కార్డూ. మీరు పంపిన జాతకం అందిందని అప్పుడే రాశానే! ఎందుకు అందలేదో. నా వొళ్ళు బావుంది. ఇంతవరకు ఎండలు ఎక్కువ బాధించడంలేదు. ఈశ్వరుడు చూస్తున్నారు.

మీరు వొచ్చేప్పుడు కొండలు వెతికించి, పిండెలైనాసరే, పలకల దొండకాయలు, ఆకాకరకాయలూ తీసుకురండి. ఇప్పుడిక్కడ దోసకాయ మహాయుగం నడుస్తోంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

26-4-66

వీరేశలింగంగారికి,

మీ కార్డు. విశేషాలు ఏంలేవు రాయడానికి. మే నెల 5 తెల్లారితే గురువారమనగా మేము గిరి ప్రదక్షిణం పెడుతున్నాము.

మీరు రాసినది. పత్రికలో చూశాను. ఆమని రాసిన భావలహరి బావుందా!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

5-5-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఏమీ కనపడదు జవాబు రాయడానికి. నా B. P. వల్ల ఇవాళ ప్రదక్షిణం వెళ్ళలేదు. రేపు వెడదామనుకుంటున్నాము.

అక్కడా వానలు కురిశాయా? ఏమన్నా కూరగాయలు కొండల మీద కాశాయా?

జీవన్ ఉత్తరాలు తిరిగి వేశారు ఎందుకో ప్రజామత వాళ్ళు.

ఈశ్వరాశీర్వాదలతో

చలం

*

9-5-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నేనే అనుకుంటే, నాకన్న ఏమీ సహించ లేరు మీరు. ఈనాడు మీ భార్యగారికి జబ్బుగా వుందని దూకుతున్నారు గాని, ఆమె ఇక్కడికి వొచ్చి చూసికూడా, ఈశ్వరుడిపై విరోధించిన దంతా మరుస్తున్నారు.

నాకు B. P. ఎక్కువగా ఉంది. ఏమీ రాయకూడదు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-6-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరు వెళ్ళి ఎన్నో రోజులైనట్టుంది. నా B. P. తగ్గింది. మీ రిక్కడ ఉన్నన్ని రోజులూ ఎక్కువగానే వుంది. ఒక గట్టి వాన కురిసింది. దాంతో తగ్గిందని పై కారణంగా చెప్పుకోవాలి.

గొట్టాల ప్రభావం వల్ల మూడు రోజులుగా షా వొళ్ళు బాగాలేదు. రెండు రోజులు భజనలు లేవు.

అవును. కావలిసింది ఈశ్వరానుగ్రహమే. కాని భగవద్గీత వంటి

పుస్తకాలు చదివి, మనసు శుభ్రమైన కొద్దీ ఆ అనుగ్రహం మనలో నిల వడం సులభమౌతుంది. ఔనా ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

24-6-66

వీరేశలింగంగారికి,

మీ కార్డు. షౌకి ఇప్పుడు వొళ్ళు కులాసాగా వుంది. నేనూ బావు న్నాను. కృష్ణ, మేము తప్ప ఎవరూ U. F. గాళ్ళులేరు. కాని ఓ వారంలో దిగుతున్నారు. ఓ U. F. పెళ్ళి జరగబోతోంది June 30, July 1 ల్లో.

జీవితానికి అక్కడే కాదు ఎక్కడా అర్థం లేదు.

మీరున్నంత కాలం నాకు B. P. Alas !

నాకు పంపడానికి ఏమన్నా కూరలు వొస్తున్నాయా ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

12- 7 - 66

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నాకు B. P. అని మర్చిపోకండి. రాయలేదేం జవాబు అని కోప్పడకండి. పొద్దుణ్ణించి యత్నిస్తూవుంటే, ఇప్పటికి కొంత వోపిక వొచ్చింది ఉత్తరాలు రాయడానికి.

మీరు కస్తూరిని చూశారుగా ఆ అమ్మాయి వధువు.

ఇంతకుముందు ఒకే పెళ్ళి జరిగింది. ముందురోజు పెళ్ళి అనుకు న్నారు. మర్నాడు జరిపేశారు. అంతే

కస్తూరి భర్తని మీరెరగరేమో! కురంగేశ్వర్రావు బంధువు. అతని కోసం ఎదురు చూస్తోనే ఇక్కడ వుంది ఆమె. Bose compound లో gate దగ్గిర గది లేదూ అది వాళ్ళ bridal room ప్రస్తుతానికి. భోజనం ఇక్కడే.

'ఎవరెవరు పెళ్ళి చేసుకుంటే మా కెందుకు!' అంటున్నారు కాని, ఓసారి వాళ్ళ స్నేహం మీకయిందా వాళ్ళని వొదల గలరా మీరు ?

సుధ ఆకాకరకాయలు పంపిస్తున్నా నంటున్నాడు. అతను పంపిన కొన్నాళ్ళకి మీరూ పంపండి. పలకల దొండకాయలు కూడా.

అదిగాక ఆ రెండు కూరగాయల వొరుగులూ తయారుచేయించండి.

సరేనా.

పెళ్ళికొడుకు తెచ్చిన దోసకాయలు ఇవాళతో ఆఖరయ్యాయి. పెళ్ళికి చేయించిన మిఠాయిలు ఇంకా తింటున్నాము.

ఇంకేం రాయను ?

జవాబు కోసం ఇంకా ఉత్తరాలు ఎదురు చూస్తున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

22-7-66

వీరేశలింగంగారికి,

తారీఖు చూడండి. నా కార్డు అంది వుంటుంది. Cancer మందు

సంగతి తెలిసిన వాళ్ళకి చెప్తున్నాము. మామాట మీ అంత దూరం ఎవరు వొస్తారో అనుమానమే. మా ఇంటి పక్కనే వుంది case.

అంతకన్న ఆ remedy తయారు చేసి, నర్తకి అధీనంలో కొన్ని doses వుంచితే, ఇక్కడే treatment ఇయ్యవొచ్చు. కొంచెం గుణం కనపడ్డా గంతేసి మెంటాడ వొస్తారు. అది Practical అవునో కాదో !

Very busy,

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

26-7-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఎందుకా టెలిగ్రాం. P. master కి ఓ 3రూ. అన్నా అయివుంటుంది. ఆ రూపాయలతో నాకు కూరలు పంపివుండవొచ్చును కదా!

ఈశ్వరుడు నా B. P. ని తగ్గించి, తాను జబ్బుపడ్డారు రెండు రోజుల నించి.

అవును. డబ్బు పోగయింది. ఇంక fair copy ఆలిస్యం. ఇది వరకటిదీ fair గానే వుంది. కాని fairer కాపీ తయారు చేస్తున్నారు.

గట్టి నిశ్చయంతో వుండండి ఇద్దరూ ఇక్కడికి రావడానికి.

అగస్టు ఉత్సవ ప్రయత్నాలు ప్రారంభించాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

29—7—66

వీరేశలింగంగారికి,

మీ కార్డు. నా కార్డు అంది వుంటుంది.

కస్తూరిగారి భర్త సహాయం మనకెట్లాగూ భారీగా లభిస్తుంది అను కుంటున్నారు.

నేను బహుశా నా బాధలతో చాలా busy గా వుండి వుంటాను. బాధలంటే వొంటి బాధలు, అంతే.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

5–8-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం, President దగ్గిర్నించి ఇంకేం జవాబు expect చేశారు ? ఈశ్వరుడి అనుమతి లేకండా ఆయనకు ఎందుకు రాశారు ?

గుడిపూడినించి ఒకాయన ఈమధ్య వొచ్చారు. 10 రోజులున్నారు. ఏం మాట్లాడలేదు. తిరిగి వెళ్ళి 15 ఉత్సవానికి వస్తానంటో, ఆత్మహత్య చేసుకున్నారు. ఎందుకో ?

ఈ 15 కి ఎంతమందో మిత్రులు బైలుదేరుతున్నామని రాస్తున్నారు. వారిని ఎక్కడ విడిది చెయ్యాలో తెలీడం లేదు.

మీరు సుధా సరస్వతి శర్మిష్టా వుంటే !

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

16-8-66

వీరేశలింగంగారికి,

ఉత్సవం బాగా జరిగింది. ఎన్నో కూరలు తెచ్చారు. ఇదివరకెన్నడూ రానంతమంది మిత్రులు వొచ్చారు.

పండగ భోజనం upset చేసింది. బద్ధకంగా ఉన్నాను.

ఇప్పుడు అందరూ గిరి ప్రదక్షిణం బైలుదేరుతున్నారు.

కూరలు ఏదన్నా T. V. S మొదలైన Road Transport లో పంపించండి Urgent Parcel కి ఏదన్నా ఎక్కువ ఇయ్యాల్సి వుంటే ఇచ్చి. మిత్రుడితో మాట్లాడుతో మిమ్మల్ని 'అండి' అనడం మరిచి పోతున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

26-8-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. Myectins వల్ల temperature వొస్తోంది. నన్ను కరవడమా-అంతే ఆ సంగతి. ఈశ్వరుడు జాగ్రత్తగా చూస్తున్నారు-ఎక్కువ బాధలు రాకండా.

పలకల దొండకాయలు పంపండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

మీ ప్రేమకు నేనేమి బదులు రాయగలను.

Note : చలంని పిచ్చికుక్క కరిచింది.

4-9-66

వీరేశలింగంగారికి,

మీ కార్డు. injuctions పూర్తి ఐనాయి. అవి నన్ను బాధించ కండా జాగ్రత్తగా కాపాడి గట్టెక్కించినారు ఈశ్వరుడు. అంతకన్న ఏం చెయ్యాలి?

నాకి వొళ్ళు బాగాలేదు. ఇవాళ కొంచెం నయం.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

కూరలు దొరికినప్పుడే పంపండి.

*

12-9-66

వీరేశలింగం గారికి,

మీ కార్డు. మీ M.O. Thanks.

నేను చాలా వరకు కోలుకొన్నట్లే కనపడుతోంది. కొంచెం దగ్గు మిగిలిపోయింది.

మీ ఉత్తరాలకి జవాబు రాస్తోనే ఉన్నానే, మీకు ఎందుకు అందటంలేదో !

మీరన్నట్టు 'Xmas' నాటికి శుభవార్తలు బైటికి వొస్తాయని నేనూ ఆశపడుతున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-9-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నేను బావున్నాను.

కృష్ణశాస్త్రిది నేనేమీ చదవను. అతనిలో Originality ఎన్నడో పోయింది. మీరు చదవమన్నారని చదివాను.

అదంతా ఓ Pose. తర్వాత ఇంకో Pose— తనని తాను పొగుడు కోడం తప్ప ఇంకేం లేదు. కాని ఈనాడు కావలిసింది అంతకన్న ఇంకేం లేదు.

శుభవార్తలు బెజవాడలో అచ్చుకి ఏర్పాటు అయింది.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

15–9-66

వీరేశలింగంగారికి,

సుధ పంపాడు కూరలు. అంటే మీరు కూడా పంపారన్నమాట.

ఆ దొండకాయలు కాదు నేనడిగింది. పలకల దొండకాయలు. మీకేమన్నా గుర్తుకు వొస్తున్నాయా? లేక అవి పుస్తకంలో దొండకాయలా!

ఆరోగ్యం కొంత కుదట పడుతోంది.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

14-11-66

వీరేశలింగంగారికి,

మీ M. O. మీ కార్డు. అవును. విన్నాను. ఆంధ్రుల అల్లరులు. ఇక్కడ ఓ పెద్ద తుఫాను వొచ్చింది. కొంత చిరాకు పడ్డాము.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

19-12-66

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీకూ, ముమ్మడకీ ఆహ్వానాలు అంది వుంటాయి.

మీ ఉత్తరాలకి సమాధానాలు రాస్తోనే ఉన్నానే. మీ M. O. అందింది.

శుభవార్తల కాపీలు అందుతాయని ఎదురు చూస్తున్నాము.

రెండు రోజులుగా వొళ్ళు బాగలేక ఇవాళే బావుంది.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

మీ సొద చెప్పుకోడానికి బలే అమ్మాయిని ఏరుకున్నారు— ముమ్మడని. తన సొద మీకు వినిపించడం లేదా ముమ్మడ మీకు.

మీ ప్రార్థనల్ని పెడచెవిని పెట్టినందుకు కరుణామయుడైన భగవాన్‌కి ఎంత కృతజ్ఞత తెలుపుతారో!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

4-1-67

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. సుధ family. ముమ్మడా ఆమె కొత్త కోడలు,

మాధురీ, ఇక్కడ కలుసుకున్నారు. ఆ కథ ఎట్లా జరిగిందో సుధని కనుక్కో, కాని సరిగా వర్ణించి చెప్పగల వోపిక అతనికి ఉన్నట్టు కనపడదు.

నా బంధువులలో నేను ఇష్టపడే వాళ్ళు చాలా కొద్దిమంది. సుధని ప్రత్యేకమైన ఓ వ్యక్తిగా చూడ్డం ఇదే మొదటిసారి అసలు నేను ఇష్టపడే మనుషులే కొద్దిమంది-అంటే ప్రత్యేకమైన ఇష్టంతో- బంధువుల్లో మరీ

కొద్దిమంది నాకు ఇష్టులు. బంధువుడు అనేప్పటికి Prejudice తోనే స్టైలు చేరుతుంది నా మనసు. అయితే సుధని చాలా ఇష్టపడ్డాను. సరస్వతి, ఉన్నత అందరూ, ముగ్గురే ఎంతో నాకు ప్రియులైనారు.

ముఖ్యం సుధ. exceptionally nice man. ఇక్కడజయంతికి వొచ్చి వుండిపోయిన మిత్రులందరూ అదే అంటున్నారు.

రెండు మూడు రోజుల కింద షాకి అర్ధరాత్రి ఓ Lung attack వొచ్చింది. ఆ అర్ధరాత్రి సుధ లేకపోతే డాక్టరుకి తంటాలు పడాల్సి వొచ్చేది. డాక్టరు ఆ అర్ధరాత్రి ఫోన్కొంచి ఇంత దూరం వొచ్చినా, ఓ injuction ఇచ్చి పోయేవాడు. కాని సుధ మాతో మేలుకుని వుండి ఎంత సహాయపడ్డాడో. వ్యతిరేక ప్రోద్బలం ఉండకపోతే, షా ఆరోగ్యం కోసం తానీ ప్రయాణం మానుకొని వుండిపోయేవాడే.

ఇంక మీ సమస్య-భగవాన్ సంగతీ, భగవాన్ భక్తుడికీ వుండే సంబంధం సంగతీ నాలోనూ, నాదీ, మీదీ (మీదీ ముమ్మడదీ) different attitudes లాగున్నాయి. కనక నేనేం రాయలేను. మీరు చూస్తున్నట్టు చూడను భగవాన్ని నేను. అట్లాంటి వ్యవహారాల్లో ఆయన సహాయాన్ని అర్థించను. పైగా సిగ్గుపడతాను. అంతకన్న సహాయపడలేదని కోపగించను. ఏది ఏమైనా ఆయన "భక్తపరాధీనుడు" మీకు శ్రేయస్కరమైన సహాయం తప్పక లభిస్తుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

9—1—67

వీరేశలింగంగారికి,

మీ కార్డూ M.O. కూడా. మీకు జవాబు అప్పుడే రాశానే! అందలేదా? పోనీ సుధా వాళ్ళూ తిరిగి రాలేదా? నా ఉత్తరం అందకపోతే రాయండి. తిరిగి నే రాసిన సంగతులు జ్ఞాపకం తెచ్చుకుని రాస్తాను.

అందరమూ Flue (influenja) పడి లేస్తున్నాము పక్కల మీద నించి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

12-1-67

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అడగడంలో తప్పేముంది?

వొచ్చిన అనర్థం-మనం అడిగింది ఆయన ఇవ్వలేదు గనక, ఇంక ఆయనతో మనకేం పని, ఆయన ప్రయోజన మేముంది? అనడం.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

17-1-67

వీరేశలింగంగారికి,

ఈ ఉత్తరం అందగానే, వెంటనే జవాబు రాయండి. సుధ ఆ వూళ్ళో వున్నాడా లేదా? ఇక్కడ మెట్టను అనే ఆమెకి మందు పంపుతానని వెళ్ళాడు. వెళ్ళినప్పటినించి ఉత్తరం లేదు. నిన్న ఓ V.P. వొచ్చింది ఎవరి దగ్గిరినించో, ఏదో వూరినించి. అది తీసుకోవాల్నో లేదో తెలీదు.

కనక అతన్ని కలుసుకుని వివరాలన్నీ వెంటనే రాయండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-1-67

వీరేశలింగంగారికి,

నాకు Peralysis Stroke వొచ్చింది. కలం పట్టుకు రాయలేను.

మీ ఉత్తరం, M.O. అందాయి. సుధకి చెప్పండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

19-1-67

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఆ Inland blue మీద మీరు రాసిన అక్షరాలు నాకేం కనపట్టంలేదు.

ఏం జవాబు రాయను?

నిన్న మీకో కార్డు రాశాను

ఆ Parcel mystery ఏదో తేల్చరూ?

ఆ మందు dose అదీ కూడా కనుక్కొని రాయండి.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈ చలికి వొళ్ళంతా నొప్పులు నాకు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

20-1-67

వీరేశలింగంగారికి,

మీ కార్డు. సుధ కూడా రాశాడు.

అక్కడ దొరుకుతాయనుకున్నాను రాజుల చిక్కుడు. దొరకవా !
మీరు ప్రయత్నించకండి. నేను తెప్పించుకుంటాను.

సుధకి రేపు రాస్తాను.

ఈశ్వరాశీర్వాలతో
చలం

*

3 - 3 - 67

వీరేశలింగంగారికి,

నాకు కొంచెం నయంగా వుంది.

ఈశ్వరుడు నయం చేస్తున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

14-3-67

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఈశ్వర దయలో క్రమంగా బాగౌతున్నాను.

పైద్యానికి మీరు తెచ్చిన రకం కొండతేనె కావాలి.

ఎండాకాలం వొస్తున్నారు కదూ !

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

23-3-67

వీరేశలింగంగారికి,

మీ M. O. పిల్లల పుస్తకాలు. ఇవాళ ఉత్తరం. చాలా Thanks.

సూర్యనారాయణగారి పాటలు ఇక్కడ పాడతామే! మీరు విన లేదా? అవును అవి చాలా గొప్పపాటలు.

మీరు వొచ్చేప్పుడు తెండి తేనె. చాలు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

22-4-67

శ్రీ వీరేశలింగంగారికి,

చలంగారికి ప్రస్తుతం వొంట్లో బాగాలేదు. నడుం పట్టుకుపోయింది. నయం కాగానే సమాధానం రాస్తారు. నాన్న గురించి గొడవ పడకండి.

మీరు ప్రార్థిస్తూంటే తప్పక యిక్కడికి వొస్తారు అని రాయమన్నారు. ఈశ్వరుడు.

*

15-6-67

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మిమ్మల్ని miss అయ్యాను మీరు వెళ్ళాక.

మీరు వెళ్ళగానే, తక్కిన అతిథులూ వెళ్ళారు. చివరి అతిథి గిరిక, వెళ్ళిందో లేదో, కొత్త మిత్రులతో guest house నిండింది.

ఇంకా వొస్తున్నారు. శ్రీరమణాశ్రమ కుంభాభిషేక మహోత్సవాల్ని చూడకండానే వెళ్ళారు మీరు. నేనూ చూట్టంలేదనుకోండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

8-7-67

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. పలకల దొండకాయలు మరవకండి.

నే నెప్పటి నించో చెపుతున్నా మాటను చెవులోకి తీసుకోరు, ఇక్కడికి వొచ్చి, కష్టంగావున్నా సుఖంగావున్నా పట్టుమని ఓ నెలరోజులు వుండమని. అట్లా వుంటే, ఏనాది పొడుగునా ఈ అశాంతి తగ్గుతుంది.

సరే, బస్సు ఎక్కి ఇక్కడికే రండి.

తాగుడువల్ల కాని ఇంక దేనివల్ల కాని, మనం అనుభవించవలసిన దాని నించి తప్పించుకోలేము. వాయిదా వేసుకుంటాము అంతే.

అసలు ఈ జీవితంలో అడుగుపెట్టడమంటే ఇట్లాంటి బాధలకి వొప్పుకునే అడుగు పెట్టామన్నమాట. ఈ తోవే అంత. తోచకపోవడం. తలిచింది నెరవేరక పోవడం, అన్నివిధాల అవమానాలు అపజయాలు, అన్నీ ఈ మార్గపు మైలురాళ్ళు. వోర్చుకోడం, వోర్చుకోలేనప్పుడు భగవాన్‌తో మొరపెట్టుకోడం.

భగవానెక్కడ వొదిలారు మిమ్మల్ని. ఆయనే వొదిలితే ఈ అశాంతి ఎందుకు కలుగుతుంది? తక్కిన టీచర్ల మల్లే ట్యూషన్లూ, లంచాలూ, తక్కిన లాభాలూ ఎదురు చూస్తో తృప్తిగా వుండేవారు మీరూను. భగవాన్ పక్కగానే నిలబడి చూస్తున్నారు ఈ తమాషా.

ఇదంతా పడవలసిందే. ఇప్పుడు ఆయననించి తప్పించుకోనూలేరు. It is too late.

కొండమీదికి షికారుపోయి దొండకాయలు కాశాయేమో చూడండి. అదే మీకు ప్రయాణం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

20-7-67

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరమూ, మనిఆర్డరున్నూ. ఈశ్వరుడిలో తప్ప ఇంక మనశ్శాంతి దొరికితే, ఇంక ఈశ్వరుడి వేపు ఎందుకు చేతులు జాస్తాము. బాధలూ, అశాంతీ, అతృప్తీ ఇవే మనని ఈశ్వరుడికోసం తపన పడేట్టు చేస్తాయి. కనక మీ అశాంతిని పరమ మిత్రుడి కింద ఆలింగనం చేసుకోండి.

**Inland blue** కాయితం మీద మీ అక్షరాలు సరిగా కనపట్టం లేదు నాకు.

ఆశలూ, ఆశయాలు ఏమీ వృధా కావు. వాటిని పట్టుకుని మనం గమ్యస్థానానికి చేరేది.

అప్పుడే ఆగస్టు ఆహ్వానాలు బైటికి తీశాము. శోభ వొచ్చేసింది మా దగ్గిరికి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

23-7-67

వీరేశలింగంగారికి,

చివరికి ఆలిస్యంగా నిన్న అందాయి దొండకాయలు. **Parcel** లోంచి ఒకటే కుళ్ళు కంపు. తెరచి చూస్తే కుళ్ళిన కాయలు కొంచెమే. తక్కిన వన్నీ పనికి వొచ్చాయి. సాయంత్రానికే కూర చేశాము. బావుంది కూర. దొండ, బీర, ఆకాకర వీటి రూపాలూ రుచులూ అన్నీ కలిసి ఒక కూరగా తయారైనట్టున్నాయి. వీటిలో గింజ ముదరని కాయలు అసలురుచి.

ఏమైతేనేం, చివరికి పలకల దొండకాయలు నాకు రుచి చూపించారు మీరు.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

29-7-67

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీరు 24 న పంపిన పార్సెలు ఇవాళ అందింది. రాశానుగా! ఈ దొండకాయలు బావున్నాయని! ఎంత బావున్న రుచి చూశాం అయిపోయింది. ఇంక పంపకండి. ఈసారి అన్నీ కుళ్ళి పోకుండా చేరాయి. వీటిలో లేతవి చాలా రుచి, గింజలు పట్టిన ముదురువి బాగాలేవు నాకు.

మీరు ఆగస్టు పండగకి వొస్తారా ? తప్పక రండి. నాలుగు రోజులు వుండేట్టు రండి. నాలుగంటే నాలుగే కాదనుకోండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

1-8-67

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఇంకా అశాంతేనా ? మీ వ్యాక్యూకహాడా ఈ కంటి దోమలు వున్నాయా ? కాకపోతే ఆ అశాంతి ఏమిటి ?

కష్టాల్లో వున్న ఆమెని భగవాన్ పటానికి రోజూ పూజ చెయ్యమని చెప్పమన్నారు ఈశ్వరుడు.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము. దొండకాయకూర చాలా బావుంది.

మీరు ఆగస్టులో రాబోతున్నారుటగా. రండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

2-9-67

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. అవును. ముమ్మిడా వాళ్ళు ఎట్లా ఉంటారు ఇక్కడ! ఎన్ని పనులో వాళ్ళకి? ఎందరు దేవుళ్ళని మొక్కి ఆ వరాలు తీసుకోవాలో!

ఈ Inland cover మీద మీ అక్షరాలు స్పష్టంగా తెలీడంలేదు, జవాబు రాయడమెట్లా ?

ఆగస్టు 15 పండగ గొప్పగా జరిగింది. చాలామంది వొచ్చారు. రెండు రోజులకిందటే వెళ్ళారు. ఈసారి పొరుగూరి అతిథులకి U. F హాలు చాలలేదు.

ఈశ్వర కృపలో అందరం బావున్నాము.

నిన్ననే అనుకుంటున్నాను. మీరు రాసి చాలాకాలమయిందని.

భగవాన్ పటం పంపుతున్నాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

12-9-67

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మనం కోరేది మామూలు శాంతి కాదు గనక. మనం దీర్ఘకాలమే ఎదురు చూడాలి.

ఈశ్వరాదరణలో అందరం బాపున్నాము.

ఇవాళ మాకొకరు feast పంపుతున్నారు.

ఓ పది రోజుల్లో గిరి ప్రదక్షిణం పడేట్టుంది.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

30-9-67

వీరేశలింగంగారికి,

[124]

మీ కార్డు. జగ్గారావుగారు ఇక్కడే ఉన్నారు. ఈశ్వరుడు మిమ్మల్ని కావిలించుకునే ఉన్నారు. అందుకనే ఆ పాడుజీవితం మీకంత దుర్భరంగా వుంది.

ఆలోచనలు కలగకండా ఇప్పుడప్పుడే పోతాయా ? ఆలోచనలు లేకండా అక్కడ ఎట్లా బతక గలరూ? ఆశలు పోతేగానిషై ఆలోచనలు పోతాయా?

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

7-10-64

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరమూ, M.O. అందాయి. మీ కల చదివి ఈశ్వరుడు ఏమీ అనలేదు. కాని అనుకోదం ఏదో మంచి మార్పు మీ మనసులోనో, జీవితంలోనో రాబోతోందని.

Any how it is high time.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

14-11-67

వీరేశలింగంగారికి.

మీ కార్డూ, మీ ఉత్తరమూ పుస్తకాలు అందాయి.

మనం యత్నించేది చాలా ఎత్తున ఉన్నదాన్ని అందుకోవాలని.

అది మీ పట్టాన అందదు. నిరుత్సాహ పడకండి.

మన వెంట మన చెయ్యి పట్టుకుని గురువు ఉన్నారు కద!

ఆ విశ్వాసంతో మీ despair నించి బైట పడండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

24-11-67

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. you will come here when you are ready మిమ్మన్ని సిద్ధం చెయ్యడానికే ఈ ఘోష అంతా.

విభూతి పంపుతున్నాను.

ఈశ్వరాశ్వీరాదాలతో

చలం

*

22-1-68

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. కాలం అంతేనే అంత. ఒకప్పుడు సుఖంగా ఒకప్పుడు కష్టంగా గడుస్తుంది. ఉదాహరణకి, మీరిక్కడికి ఇన్నేళ్ళూ రాస్తున్న ఉత్తరాలు చూస్తే చాలు— కాలం ఆగిపోయిన వారికి తప్ప తక్కిన వారందరికీ ఇంతే. దానికి తల వొంచవలసిందే మనం.

మిమ్మన్ని ఆ పూరు ఏమన్నా చేసిందా, పూరువొదలితే శాంతి వొచ్చేందుకు? ఏది ఏమైనా. అలాగే మిమ్మన్ని బదిలీకి ప్రయత్నం చెయ్య మన్నారు ఈశ్వరుడు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7-2-68

వీరేశలింగంగారికి,

ఎట్లావున్నారు? మీకూ, సుధకూ జీతాలు ముట్టాయా?

నాకోటి కావాలి. తూర్పు ఆవకాయ అని కాయకాయా ఆవకాయి పెడతారు. బెల్లంకూడా వేస్తారు.

ఆ కాయలు ఓ మూడు కావాలి. సంపాయించగలరా?

పార్వతీశంగారి సంగతులు మీకేమన్నా తెలుసునా? ఎవరన్నా కన పడితే దర్యాప్తు చెయ్యండి. సరదాఐన సంగతులు బైట పడవొచ్చు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

27-2-68

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీ M. O. అందిందని రాశాను కదా!

కొద్ది ఏళ్ళ కింద ఇక్కడ నాకు జాతకంలో అదేదో (ఏడేళ్ళదే నేమో) శని పట్టింది. 'నిన్నేం చెయ్యదు, పో' అన్నారు ఈశ్వరుడు. అది వొచ్చినట్టే, పోయినట్టే తెలీలేదు నాకు. ఈశ్వరుడిపై విశ్వాసంతో వుండండి.

తూర్పు ఆవకాయ ప్రతి ఇంటో ఆ దేశంలో పెట్టుకుంటారని విని రాశాను. కష్టసాధ్యమైతే పంపకండి.

బాబాగారి మహాద్భుతం సంగతి, ఈశ్వరుడు ఏమి మాట్లాడలేదు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

26-3-68

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీ దేశపు పత్రికలు ఏం రాస్తాయో నాకనవసరమండీ అని రాశాను మీకు చాలాసార్లు. అయినా నాకా బురద తెలియ చెయ్యడంలో మీకీ తృప్తి, సంతోషం ఏమిటో నాకు అర్థం కాదు.

ఈశ్వరాదరణలో అందరం బాపున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

12-4-68

వీరేశలింగంగారికీ,

మీ M. O. మీ ఉత్తరం, అసలు లోకంలో U.F లు కనపడ్డం లేదు. భక్తులూ, ఆర్తులూ, అందరూ ఏ కొంత డబ్బో సంపాయించుకుని ఉల్లాసంగా కాలం గడుపుతున్నారు.

పిల్లనిచ్చాడని ఒకరూ, డబ్బునిచ్చాడని ఒకడూ, పడుచు నిచ్చాడని ఒకడూ, ఉద్యోగ మిచ్చాడని ఒకడూ, ఈశ్వరుణ్ణి కొనియాడుతూ ఎవరి దోవనవారు పోయారు. మీరూ, నేనూ, శ్రీరమణస్థాన్ మిగిలాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-4-68

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఇవాళ సౌరిస్ పుట్టినరోజు. మంచి మంచి వంటలు తయారౌతున్నాయి.

వొస్తున్నారా మీరు? రమ్మని రాయాలని అనుకుంటున్నాను.

సుధ బదిలీ ఆగిపోవడమూ, మీకోసమూ, సుధ పెద్ద కూతురు కోసమూ, సంతోషపడుతున్నాను.

ఇక్కడ ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

కృష్ణరావు తన దేశం వెళ్ళాడు. మీరు వొచ్చేప్పటికి వుండడు. అతనికి మామిడి పళ్ళు తీసుకు రానక్కర్లేదు. మంచిపని చేశారు, ఆ పత్రికకి రాయడం.

సుధ బదిలీ రద్దయిందా? ఇంకా బదిలీ కావాలంటారా మీరు?

'గొడవలు పడకంటా శాంతంగా బతకడం ప్రతి వారికీ సాధ్యమౌతుంది. కాని అట్లా బతకడం ఇష్టం వుండదు. పూర్వ వాసనలు మనని శాంతంగా కూచోనీవు.!

అవును. మీరన్నట్టు బతుకనేదే, అంటే మనసనేదే మన పరమ శత్రువు. మనసంటే కామం అన్నాడు భగవద్గీతలో. 'కామం నీ పరమ శత్రువు' అన్నాడు (కౌరవులు కాదు).

మన మనసు గొదని ఓ నిమిషం ఆపి వింటే తెలుస్తుంది ఈశ్వరోద్దేశ్యం.

శోభ కూడా వెళ్ళిపోయింది. ఆమెకి కూడా మామిడిపళ్ళు తేనక్కర్లేదు.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

1-5-68

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఏం లేదు రాయడానికి, కాని మీరు జవాబు లేదని గొడవ పడతారని రాస్తున్నాను.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

నరసింహారావు ఇక్కడే ఉన్నాడు.

వైశాఖ పౌర్ణమికి కొందరు కూడేట్టున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

22-6-68

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరిక్కడ ఉన్నకాలం అంత సద్వినియోగం అయినందుకు, సంతోషంగా వుంది.

సుధ నించి నిన్న టెలిగ్రాం. సరస్వతికి నెమ్మదిగా వుందని తెలుస్తాను.

వెంటనే ఆ జబ్బు వివరాలు రాయండి,

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-7-68

వీరేశలింగంగారికీ,

మీ కార్డు. ఏమిటా నిరాశ?

సుఖంగా వుండండి. మీతో మీవాళ్ళో ఈశ్వరుడు లేరా?

అంత నిరాశ ఐతే ఓ మూల కూచోక అన్ని వూళ్ళెందుకు తిరుగుతున్నారు? ఆలోచించుకోండి.

చే (నిర్మల) 15 కి రావటం లేదు. ఆగస్టు నెలాఖరులోగా వొస్తుందిట.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

6-8-68

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీ జబ్బు సంగతి విని ఏమైపోయినానో? చూశారా- మెంటాడ నించి బదిలీ కావాలన్నారు. ఎందుకు మిమ్మల్ని అక్కడే వుంచారో ఈశ్వరుడు, తెలుస్తోందా?

మీ చిత్తభ్రమకి కారణ మేమంటాడు సుధ? పెద్ద డాక్టరుకి చూపించుకోవాలేమో కనుక్కోండి అతన్ని. లేకపోతే ఏవన్నా tests చేయించుకోవాలేమో?

15 కి వొస్తున్నారా?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7-8-68

వీరేశలింగంగారికి,

మీ కార్డు మీరు బావున్నందుకు సంతోషం.

నిన్న విభూది పంపాము. వినాయకపూజ పుస్తకము ఒకటి పంపించండి.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

14-8-68

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఇంటి నిండా 40 మంది. జనం. ఇంకా దిగబోతున్నారు ఇవాళా రేపూ. మీరే వొచ్చేట్టు లేరు.

చలం ఉత్తరాలు సంగతి, మీకు రాసిన కార్డు చేరివుంటుంది. వెంటనే తయారు చెయ్యండి.

రుక్మిణీనాధశాస్త్రిగారికి నేను రాసిన ఉత్తరాలు కొన్ని చేతికివొచ్చాయి.

మాకేమో, మీరూ. సుధా కలిసి అపూర్వో వుండడం, మీ క్షేమం కోసం, దైవ నిర్ణయమనిపిస్తుంది. మీరిద్దరూ మీ భార్యలూ గుంజుకుంటో మరి ఎప్పుడు అపూరు వొదులుదామా అని. మీమధ్య ఉన్న స్నేహాన్ని కూడా అంత సులభంగా తెంపుకోగలరా? ప్రేమకన్న ఏది విలవైనది?

మొన్మడ రాత్రి వొచ్చింది రైలు ప్రయాణబాధలకోర్చి.

బాపూజీ చౌదరీ ఎవరు?

మీ ఉత్తరాలు ఈశ్వరుడు చదువుతోనే వున్నారు. విభూది పంపుతున్నాము. ఎవరేం చేసినా, ఆ మాత్రం మీకూ చిత్తభ్రమ కలగకపోతే, విరోధులు చేసినట్టూ, ఈశ్వరుడు కరుణతో నయం చేసినట్టూ మీకెట్లా తెలుస్తుంది? మీరు విశ్వాసంతో వుంటే మిమ్మన్ని ఎవరేం చెయ్యగలరు?

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

15-8-68

వీరేశలింగంగారికి,

వొస్తున్నారా ? రాకపోతే వినండి. నేను మీకు రాసిన ఉత్తరాలు పుస్తకరూపంలో వొచ్చే అదను కనిపిస్తోంది. కనక మీ దగ్గిర వున్న ఉత్తరాల నన్నిటినీ Date వారీగా arrange చేసి వుంచండి నేను పంపమన్నప్పుడు పంపుదురుగాని.

వొళ్లు బావుందా ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

21-8-68

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. వినాయకవ్రత పుస్తకం, మనిషిని పంపి విజయనగరం నించి తెప్పించారా ? ఏం పని అది ! వ్యవధి వుందికద ! విశాఖపట్నం నించి, లేదా దగ్గిర చిత్తూరునించి, సులభంగా తెప్పించుకునేవాణ్ణి కద !

పండగకి వొచ్చిన మిత్రులు కొంతమంది వుండిపోయినారు. ఈశ్వరుణ్ణి వదలలేక.

పబ్లిషర్ల నించి నేడో రేపో ఉత్తరం expect చేస్తున్నాను. మీరు ఉత్తరాలు సిద్ధంగా ఉంచండి.

ఈశ్వరాధరణలో అందరం సుఖంగా ఉన్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

22-9-68

వీరేశలింగంగారికి,

బావున్నారా ? నేనెంతో యత్నించాను. కాని చివరి నిమిషాన ఆ పబ్లిషర్లు ఉత్తరాలు వెయ్యమన్నారు.

బొంబాయినించి నిర్మల (చే) guest house వొచ్చి కొనేసింది రెండు రోజులకిందటే వెళ్ళింది. పకపకా వాళ్ళూ ఇక్కడే ఉన్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

25-9-68

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరాలు, మీ M. O. ఇన్ని ఉత్తరాలకీ నాకు జవాబు రాయ డానికేమీ కనపట్టం లేదు.

ఆ మా....మీలో ఆమెకై వున్న మార్దవత్వం కనిపెట్టి ఉపయోగించుకుంటోంది Detestable Woman ?

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

23-10-68

వీరేశలింగంగారికి,

మీ కార్డు. B. P. కి కారేణమంటో లేదు. ఎక్కువ, తక్కువలు దాని సహజగుణం. ఎవరికన్నా ఉత్తరం రాసేప్పుడు, ముఖ్యం డాక్టరుకి,

నా B. P. ఎక్కువయిందని రాస్తాను, అంతకన్న ఏం లేదు. బాగానే ఉన్నాను.

మీరు బావున్నందుకు సంతోషం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

30-11-68

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. రేవలచిన్ని తొందరలేదు. సుధా మీరూ జనవరిలో వొస్తున్నారుగా ! అప్పుడు తీసుకురావొచ్చు.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము. నా ఆరోగ్యమూ బాగుంది.

మీరింకా బాగా కాలిపోవటం లేదన్నమాట. పూర్తిగా కాలిపోయిన నాడె ఈశ్వర దర్శనం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

1-1-69

వీరేశలింగంగారికి,

కొత్త సంవత్సరంలో మొదట నేను రాసే ఉత్తరం మీకు.

మీ కార్డు. ఈశ్వరాదరణలో నేను బాగానే వుంటున్నాను.

మీరు పంపింది రేవలచిన్ని అవునో కాదో మాకు మాత్రం ఏం తెలుసు ? పైగా దాని అవసరం కూడా లేదిప్పుడు. అట్టానే దాచి పెట్టాము.

మీరూ రమణ జయంతి ఉత్సవం చెయ్యడం సంతోషం.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10-3-69

వీరేశలింగంగారికి,

క్రిష్ణ వెళ్ళిపోయినాడు. అప్పటినించి ఈ గుడ్డివాడికి వొచ్చే వుత్తరాలు అటూ ఇటూ పోతున్నాయి. మీ 24 ఉత్తరం నిన్న చూశాను. ఇన్నాళ్ళు నానించి జవాబు లేక మీరేం మధన పడుతున్నారో. ఈశ్వరుడు విన్నారుగా మీ బాధ. ఈపాటికి అన్నీ సద్దుకుని వుంటాయి.

రంగనాయకమ్మగారు Heart attack తోమంచి danger లో వున్నారు. ఇన్నాళ్ళూ దినదిన గండంగా వుంది. ప్రస్తుతం కొంచెంనయం. ఈశ్వరుడు జాగ్రత్తగా కనిపెట్టి చూస్తున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

11- 4 - 69

వీరేశలింగంగారికి,

మీ కార్డు. వొస్తున్నారా? సంతోషం.

నా ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుతున్నారు ఈశ్వరుడు.

చిత్ర కాలు నయంగానే వుంది. మీరు పంపిన దుంపల గంధం వాడుతోంది.

బంగారమ్మగారూ మీరు పంపిన M. O. అందింది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-5-69

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీ ఇద్దరూ వొస్తున్నారా, సంతోషం. నిన్ననే ఒక నవలలో సరదా ఐన ఓ పాత్రని చదువుతో షౌ "ఇతను సరిగా సుధాకర్ లాగున్నాడు కదూ?" అంది.

ఇక్కడ ఒక్క వర్షం ఓసారి కురిసి పూరుకుంది.

నీళ్ళు లేవు.

మనుషులు ఎక్కువవుతున్నాము.

కాని తన భక్తులకి నీళ్ళు కరువు కానీరు ఈశ్వరుడు

మీరు రావడం మానకండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

29-6-69

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఎంత కరుణ చూపారో భగవాన్ మీ ప్రయాణం పైన, మరి అభ్యంతరాన్ని ఎదుర్కొని ఆయన సన్నిధికి వచ్చారు కద మీరు? తిరుగు ప్రయాణంలో నైనా, ఆయన దయా హస్తం మీకు కనిపించేట్టు చెయ్యకపోతే ఎట్లా!

మీరిక్కడ వున్నప్పుడు అమెరికన్ స్త్రీలు వొచ్చేవారు కద భజనకి. వాళ్ళు వారి దేశాలకి వెళ్ళిపోయారు. వారిలో ఒకామె రాసిందిట ఆశ్రమానికి. తోవలో ఎన్ని ప్రయాణం (Pass port etc) చిక్కుల నించి అద్భుతంగా ఆమె యత్నం లేకండా భగవాన్ ఎవరో ఒకరి రూపాన ఆమెకి సాయపడ్డారో !

మీ వాంఛ. ఏదో వొదలక మీరు భగవాన్ పైన అలిగిన రోజున ఇదంతా మరిచిపోతారు.

సుధాకర్ కుటుంబం ఏర్పాటు బావుంది.

మీరు రాసిన నిద్ర, పని, తిండి-ఇట్లాంటి వాటి మీదనే నడుస్తోంది మానవ జీవితం. ఈ చక్రంలో ఓ అభయ హస్తం చిక్కింది మనకి.

ఆ అదృష్టం తటస్థించక ఆ చక్రంలోనే తిరిగే కోట్ల కొలది మనుషుల సంగతి ఆలోచించుకోండి.

చెయ్యి అందింది కద ! ఆచెయ్యి మనని వొదలంది, ఏమైనాసరే. నిశ్చితంగా వుండండి. మీ చుట్టూ ఈశ్వరుడు ఆడే మాయా నాటకాన్ని కులాసాగా వీక్షిస్తో-

ఎంత గొప్ప హృదయమో సుధది ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

2-7-69

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును. సాధన విసుకుగానే వుంటుంది. దానికి మందు లేదు. భగవద్గీతలో చెప్పారు కద, మొదట్లో విషతుల్యంగా వుండి, చివరికి అమృత తుల్యంగా మారుతుందని.

ఇక్కడ ఒకటే ఎండలు ఏ పనీ, ఆలోచనా తోచనీటంలేదు.

ఓ అడివి పిచికా, ఓ ఉడత పిల్ల మాత్రో చేరాయి.

కృష్ణారావు ఇంకా రాలేదు.

ఇక్కడేదో మీకు occount ఉందని వొచ్చారు Bank వాళ్ళు.

సుధ ఉత్తరం అందింది. జవాబు రాయడానికేం లేదు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-7-66

వీరేశలింగంగారికి,

మీ కార్డు. పుస్తకాలు అందాయని ఎప్పుడో రాశానే !

అదిగాక మీ ప్రతి ఉత్తరానికీ జవాబు రాస్తోనే ఉన్నాను. ఫలసేకరణ చదవడం ఏ ఖర్మం. టాగూరుగారి Fruit gathering చదవరాదా ?

ఇక్కడ వర్షాలే లేవు.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

11-9-69

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీరు విడిపోవాలని అనుకుంటున్నారని కాదు. విడిపోతే మీకు అంత బాధలేదని నా తాత్పర్యం.

అవును. బదిలీ ఆపు చెయ్యండి. నేనంటున్నాను ఆ మాట. ఈశ్వరుడనలేదు;

ఇక్కడ చాలామంది మిత్రులం చేరాము. సరదాగావుంది.

మీరూ వొస్తున్నారుగా తొరలో !

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-10-69

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీకు బదిలీ ఐన సంగతే రాయలేచే ఇన్నాళ్ళూ ? రాయకపోతే ఏం లేదు. ఈ సంగతి ముందెప్పుడన్నా మీ జ్ఞాపకానికి తేవలసిన అవసరం వొస్తుందేమోనని mention చేస్తున్నాను.

నా imagination ఏ కాని, మీరు దూరం కావడం. మీకుగాని, సుధకిగాని ఏ మనస్తాపమూ కలిగించినట్టులేదు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

17-1-70

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నిన్న విభూది పంపాము.

ఈశ్వరకృపలో నేను ఆరోగ్యంగానే వుంటున్నాను. మీ మిత్రులు దిగుతోనే వున్నారు. వెడుతోనే వున్నారు.

సుధ చిన్న కూతురుకిpolio వొచ్చిందనుకున్నారు, గొడవపడి ఈశ్వరుడికి నివేదించుకున్నాడు. అది పోలియో కాదన్నారు డాక్టర్లుఅప్పుడు.

మీరు మీ ప్రియురాలికి రాసిన ఉత్తరం సంగతి విని సంతోషిస్తున్నాం. ఈశ్వరుడు ఏమంటారో తెలీదు. అయినా ఆయన్ని అడగమన లేదుగా మీరు !

ఆమె మీ దగ్గిరికి వొచ్చేస్తే complicationsతో మీ బతుకుభారం కావొచ్చు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

26-1-70

వీరేశలింగంగారికి,

ఈశ్వరుడు మీ కిట్లా రాయమన్నారు.

ఆ అమ్మాయిని రక్షించమని నన్ను కోరుతున్నావుకదా ! సరే, ఆమెని నాకు వొదిలెయ్యి. ఏం చెయ్యాలో నేను చూస్తాను. మధ్య నువ్వేదో చేస్తానంటా వెందుకు ?

ఆమెని నాపై విశ్వాసముంచి పూజ చేసి, రక్షించమని నన్ను వేడుకోమని ప్రార్థించమను.

రంగనాయకమ్మగారు చచ్చిపోయినారు.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-2-70

వీరేశలింగంగారికి,

మీ కార్డు. M. R. N. సంపాయించిన matter భగవాన్ విషయమై చాలా intersting matter సంపాయించారు.

B. Russel చాలా sincere man. తన అనుభవంలోకి వొస్తేనే కాని దేనినీ నమ్మరు. చాలా గొప్ప మేధస్సు ఆయనది. కాని మేధస్సు

భూమికి గజం ఎత్తునకూడా లేవదు చాలాసార్లు. ఆ మేధస్సే అభ్యంతర మౌతుంది, సత్య దర్శనానికి. ఇంతలో పోయిందేమిటి ? ఈపాటికి ఏకాంతి లోకాలలో విహరిస్తున్నాడో! అతనంటే నాకు ఎంత గొప్ప గౌరవమో ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

6-7-70

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఆ కొత్తపూళ్ళో మీకు చాలా హాయిగా వున్నట్టు తెలుస్తోనే వుంది.

ఆ గట్టు చేరడానికి ఎన్ని కష్ట సముద్రాలు ఎన్నేళ్ల ఈదాలో !

తోట బావుంది. వానే లేదు. నీళ్ళు పొయ్యడం కష్టంగా వుంది.

కొత్తమిత్రులు దిగుతోనే వుంటారు ఎప్పుడూ కొత్త సమస్యలతో.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10-8-70

వీరేశలింగంగారికి,

మీ కార్డు. మీరు పంపిన 20 రూ. M.O. కూడా అందింది. Homeo వైద్యం సంగతి నాకేం తెలీదే.

Tissue Remedies సంగతీ తెలీదు.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము. మీకు తెలుసు కదూ చలం tourist bus ఆంధ్రనించి బైలుదేరుకోందని. వారందరికీ స్థలం

కావాలని guest house extension, దాని ప్రారంభించి ఆ పనితో సతమత మౌతున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

20-9-70

వీరేశలింగంగారికి,

మీరు పంపిన M.O. అందింది. మీరు ఉత్తరాలు రాయటం లేదు. అంటే బావున్నారన్నమాట.

మీకు రాసిన ఉత్తరాలు పత్రికలో వేసుకుంటానంటున్నారు ఒకరు. చలం రాసిన ఉత్తరాలు ఏదన్నా పత్రికలో పడగానే, వొత్తిడిచేసి ఆపిస్తున్నారు ఎవరో!

10 వో తరగతి తెలుగు పుస్తకాలు మూడు కాపీలు పంపండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-11-70

వీరేశలింగంగారికి,

మీరు పంపిన M.O. అందింది. రమణవాణి మీకు వొస్తుందా!

జనవరిలో గుడివాడలో భగవాన్ జయంతి బ్రహ్మాండంగా జరిపిస్తారట.

గుంటూరునించి రమణస్థాన్ Sp. bus బైలుదేరుతుందిట.

మీ రేమన్నా ఇటు వొస్తున్నారా? మీ కొండల నించి దిగి!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

23-11-70

రేశలింగంగారికి,

మీ ఉత్తరం. నేను విభూది అప్పుడే పంపాను. ఆ కవరులోనే త్తరం కూడా పెట్టాను. Closed covers లో విభూది పంపితే ఆదేకో ని పోస్టువారు కాజేస్తున్నారు. చాలా మందికి అందలేదు ఈమధ్య. మీ ఃలీ సంగతి ఈశ్వరుడు చదివారు.

ఇవాళ మళ్ళీ విభూది పంపాను.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

5-12-70

రేశలింగంగారికి,

మీ కార్డు. ఇక్కడ కూడా బాగా చలి బైలుదేరింది.

సుధని కూడా మీ వూరికి బదిలీ చేయించుకోమనండి.

ఏమీ కారణం లేకండా మాలో మేము చాలా హడావిడిగా న్నాము. పైగా జీవన్ మా అందరికీ బాంబే sweets పెట్టించాడు వాళ్ళ మ్మగారి చేత.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

28-12-70

వీరేశలింగంగారికి,

మీ కార్డు. బుద్ధుకి అతను ఇక్కడ వున్న వారం రోజుల్లో ఎంత మార్పో అతనికి ఈశ్వరుడిపై (అంటే సౌరిస్‌పై) ఎంతో విశ్వాసంలా కనపడుతోంది. ఇక్కడికి వొచ్చినప్పుడల్లా నమ్మడని ఈశ్వరుడు రాచి రంపాన పెడుతున్నట్టు కనబడుతుంది. ఆయనతో పడలేక "నువ్వు ఇస్తావని వొచ్చిన వరాలకి ఓ నమస్కారం" అని వెళ్ళిపోతుంది.

ఎప్పుడూ 30 వ జయంతి అని తెలీదా మీకు!

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10-2-71

వీరేశలింగంగారికి,

ఎనిమిదో లెఖ్ఖల పుస్తకం రెండు కాపీలు పంపుతారా!

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

మీరు రంగని ఎరుగుదురా?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

22-2-71

వీరేశలింగంగారికి.

మీరు పంపిన పుస్తకాలూ, M. O. అందాయి.

రంగ మొన్న వొచ్చి వెళ్ళాడు. అందుకని అడిగాను. అతనిప్పుడు

Nepal లో వున్నాడు. ఆ brother Canada లో ఉన్నాడు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

18-5-71

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఇక్కడికి, ఈశ్వరుడి దగ్గిరికి రావాలనుకుంటే అన్నీ 'కుదురుతాయి'

ఆ పట్టు తగ్గినప్పుడే అన్నీ ఆటంకాలు కనపడతాయి.

అందరికీ విరోచనాలు మాకు పట్టి విడవకండా వున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

10-6-71

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. సుధ family తో వొచ్చి ఓ వారంపైగా వుండి, మెంటాడ వెళ్లాడు. ముమ్మడ రాలేదు.

N. G. O లు surrender తలుచుకుని సిగ్గుపడుతున్నాను.

ఓ నెలరోజులుగా జబ్బుగా వుండి ఇప్పుడే తేరుకున్నాను ఈశ్వరుడి దయవల్ల.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7-9-71

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరు సుఖంగా ఉన్నందుకు సంతోషం. ఈశ్వరాదరణలో మేమందరం బావున్నాము.

అవును. మీరు విన్న ప్రళయం వార్తనే మేమూ విన్నాము. మా కన్నా మీకే ఎక్కువ తెలుసును లాగుంది. Xian propagandists కాక అంతకన్న విశాలంగా చూసే వారే కొందరు గట్టిగా prophesy చేస్తున్నారు. 1977 నించి (ప్రళయం కాదుగాని) లోకంలో ఉత్తమ స్తితికి పరివర్తన వొస్తుందని. అదిగాక Pondichery Mother మొదలైన వారు కూడా 20 సంవత్సరాలలో లోకం మారబోతోందని శిష్యులకు చెప్తున్నట్టు వినికిడి. 1972 నించి శ్రీ రమణస్థాన్‌లో మార్పులు వొచ్చేట్టు సూచన లగుపిస్తున్నాయి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

17-9-71

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరనుకున్నట్టే నేనూ అనుకుంటాను. మీ ఉత్తరం చదివి-సౌరిస్ ఇట్లా అంది. "ప్రళయం దగ్గిరలోనే వుంది. కాని నేను తేదీలూ, సంవత్సరాలు చెప్పను." అంది.

ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

ఈశ్వరాశీర్వాదాలలో

చలం

*

15-10-71

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఈశ్వరాదరణలో బాగానే వున్నాము.

శ్రీరమణస్థాన్‌లో వొచ్చే మార్పులూ, ఏవో మార్పు అనే సూచనే కాని, అవేవో నాకూ తెలీదు.

ఈశ్వరుడు 'దగ్గిర' లోనే అంటే-ఆ దగ్గిరలోనే అనే మాటకి అర్థం ఒక రోజు కావొచ్చు, వెయ్యి ఏళ్ళు కావొచ్చు. మీ సంగతి ఈశ్వరుడిట్లా అన్నారు.

"నేను అతనికి ఆత్మ సాక్షాత్కారం ఇస్తానని అనలేదు. ఏ సందర్భంలో ఏమంటే అతను అట్లా అర్థం చేసుకున్నాడో ?"

మీరేం దిగులు పడకండి. మనం ఈశ్వరుడి హస్తాలలో ఆయన దృష్టిలో వున్నాము. మనని వొదలరు. ఏనాటికి మనకి ఏది జరగాలో అది జరిపిస్తారు.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

11-1-72

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఈపాటికి చాపమల్లు బాధ వొదిలివుంటుంది.

మీ M. O. అందింది ఇవాళ.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

11-4-72

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరు ఆరోగ్యవంతులైనారని తెలిసి చాలా సంతోషం వొచ్చింది.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

20-9-72

వీరేశలింగంగారికి,

మీ కార్డు. ఏదైనా వ్యాధి రావటమనేది వుంటే, విరోచనాలంత బాధ, హీనమైన వ్యాధి లేదు. అది కేవలం గురుకృప. బాధలేకంటా ఈశ్వరప్రేమ వొస్తుంది. కాని మనకి ఆయనపై రాదు. ఔను. మీరన్నది సత్యం. ఈ జీవితాన్ని సంతోషంగా భరిస్తున్నాము గదా. ఈ సాధనా, తపస్సు అంతాకూడా నిజమైన మరణానికే కదా: మీ కన్నీ తెలుసు. నామీద ప్రేమవల్ల, నా విరోచనాలమీద మీకంత ఆగ్రహం కలిగింది. అన్నం కూడా మానేసి చాపలు మాత్రమే తింటూ వుండేప్పటికి విరోచనాలు వెంటనే ఆగిపోయాయి.

నాకు చాపలు మిగిలిపోయినాయి. మీరు పంపిన నూరు రూపాయలు నేను చాపలకే వినియోగిస్తాను. ఐపోతూవుంటే మళ్ళీ రాస్తా లేండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

7-2-74

వీరేశలింగంగారికి,

నీ ప్రార్థనా లేఖని ఈశ్వరుడు విన్నారు.

మీరు సుఖంగా వున్నందుకు సంతోషం.

నేను అట్లానే కునికిపాట్లు పడుతో వున్నాను.

అప్పుడప్పుడు మీ వూరినించి ఎవరో ఒకరు వొస్తోనే వుంటారు. మీగురించి అడిగితే తెలియదంటారు.

హైదరాబాదులో అత్తవారింటో నిద్రపోతున్నాడు సుధ.

*

16-11-74

వీరేశలింగంగారికి,

అవును. చాలాసార్లు అనుకున్నాను, మిమ్మల్ని రమ్మని రాయాలని కాని హాయిగా వున్నారే, మిమ్మల్ని disrurb చేయడమెందుకని వూరుకున్నాను. తప్పకండారండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

13-12-74

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరు రానందుకు చాలా disappoint అయాను. ఇన్నాళ్ళకైనా చూస్తాననుకున్నాను. మీ మొదటి ఉత్తరం చూసి మీ జబ్బు అంతా నయమైందనుకున్నాను. అయితే ఇంక చాలా జాగ్రత్తగా వుండమని రాస్తున్నాను. రోజూ భగవాన్ పూజ చేయండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

14-12-74

వీరేశలింగంగారికి,

గుండెనెప్పా మీకు? సరైనటువంటి వైద్యం జరుగుతోందా? జాగ్రత్తగా వుండండి. డాక్టరు ప్రయాణం చేయవొచ్చంటేనే కాని చేయకండి. విభూది పంపుతున్నాము.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

3-1-75

వీరేశలింగంగారికి,

నాకు డాక్టర్ check-up చేసినప్పుడల్లా భయం, నా heart సంగతి ఏమంటాడోనని. సరైన rest తీసుకుని త్వరలో "you can forget your heart" అనిపించుకోండి డాక్టరుచేత. మీ బడికి ఎక్కువ దూరం లేదు కదా? మీ ఇల్లు.

నిన్ను బతికించి వుంచి నందుకు కృతజ్ఞత చూపిస్తాన్నావు. నన్ను బతికిస్తే, నన్ను బతికించావు, Thanks అనేందుకు కారణం కనపడదు. నా బాధ తప్పిపోతుందని యీ కుర్చీ Thanks చెపుతుందేమో:

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

1-3-75

వీరేశలింగంగారికి,

చచ్చిపోయిన వాళ్ళ సంగతి నాకేం తెలియదు. మీరు ఎట్లా వున్నారో అది తెలుస్తోంటేచాలు, ఈ బాధలనించి తప్పించుకున్నారని సంతోషించక దిగులు పడతారేమిటి ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

6-9-75

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం అందింది. ఈశ్వరాదరణలో అందరం బావున్నాము.

మీ వాళ్ళు ఎట్లావుంచో, ముఖ్యం మీ గుండెజబ్బు ఎట్లావుందో ఆ వివరాలన్నీ రాయండి. ఎందుకంటే, ఇక్కడ ఒక మంచి హోమియోపతి

మందు వుంది. మీరు తీసుకుంటానంటే దాని వివరాలు రాస్తాను. అక్కడ డాక్టరు మీ గుండె ఇంకా Normal గా అయిందని అనలేదా ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

30-9-75

వీరేశలింగంగారికి,

మీ Heart-Trouble నయమైనందుకు సంతోషం. మీదగ్గిర వున్న హోమియో మందు చాలా Powerful drug. డాక్టరు దగ్గిర వుంటేనే వేసుకోవాలి. అందుకని దానికన్న బాగా పనిచేసేందుకు ఇంకో వైద్యం చెపుతున్నారు ఈశ్వరుడు. మీగుండె మీద అనేట్టు మన్ను మూట మీద పడుకోండి. ముందర ఒక అరగంటతో ప్రారంభించండి. భోజన మయ్యాక ఒక గంట తర్వాత వైద్యం చేయాలి. మన్నుమూట తీసేసిన తర్వాత అరగంట తర్వాత గాని భోజనం చేయకూడదు. ఎట్లావుందో రాయండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

8-11-75

వీరేశలింగంగారికి,

మట్టి కట్టుకుంటున్నారా! ఏమైనా మార్పు కనపడుతోందా ?

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

14-11-75

వీరేశలింగంగారికి,

అయ్యో! ఇంకా మట్టి కట్టుకోనేలేదా? పొడిమట్టి లేకపోతే తడి మట్టి కట్టుకోండి. పోనీ ఆ తడి మట్టినే ఎండపెట్టి కట్టుకోండి.

ఈశ్వరాశీర్వాదాలతో
చలం

*

6-12-75

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం అందింది. మీరు ఇక్కడికి రాదలుచుకుంటే మార్చి, ఏప్రిల్ మధ్యలో రండి. ఎండలు ముదిరిన తర్వాత వద్దు. ట్రెయిన్‌లో రండి.

ఏదైనా, ఈశ్వరుడిలో విశ్వాసం వుంచుకుని బయలుదేరండి.

ఈశ్వరాశీర్వాదాలతో
సౌరిస్

*

4-6-76

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం అందింది. ఆ విధంగానే పరీక్షకి విశ్వాసంతో కూచోండి.

ఈశ్వరాశీర్వాదాలతో
సౌరిస్

*

4-6-76

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీ బాధలు అట్లానే ఉన్నాయా పాపం. సూర్య స్తోత్రం చదివితే చాలామందికి వ్యాధులు నయమయినాయి.

అందుకే మీకు పంపాను. ఇన్నాళ్ళూ మీ విశ్వాసమే మీరు అనుకున్న వన్నీ చేసింది. నాకు సంకల్పమనేది లేదు. నాన్న కంటిచూపు సరిగ్గా లేదు. మరినేనేమయినా సరిచేయగలిగానా. నడవలేడు- నడిపించ గలిగానా. అసాధ్యమయింది ఈశ్వరుడికి లేదు. కానీ ఎవరికి ఏది మంచిదో ఆయనకి తెలుసు. అట్లా వొదిలేయండి.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

9-6-78

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం అందింది. నాన్న కండిషన్ బాగుంది. భోజనం అంతే చేస్తున్నారు. అంతకన్నా ఎక్కువలేదు. నాన్నకి దుఃఖాశ్రవులు కాదు. ఎమోషన్ పట్టలేక అట్లా కన్నీళ్ళు వొస్తూ వుంటాయి. అవును శిలవపై క్రీస్తు స్థితే ఇది. ఏ బాధవొచ్చినా తీసేస్తున్నాను. మీకు చెప్పినా మాత్రం ఏమి అర్థమవుతుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

19-6-78

వీరేశలింగంగారికి,

నాన్న Condition అట్లానే వుంది. మీరు వెళ్ళిన తర్వాత చిత్ర కూతురు మిశ్రీ పెళ్ళి జరిగింది ఇక్కడ. అదికాక రెండు పెళ్ళి పార్టీలు. మీకు అక్కడ వర్షాలు పడి చల్లగా వుందా?

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

30-6-78

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం అందింది. పెళ్ళికొడుకు తొందరపడ్డాడు, త్వరగా పెళ్ళిచేసుకుని ఆ అమ్మాయిని తీసుకుపోతానని. పెళ్ళికొడుకు ఎవరి శిష్యుడూ కాదు. అతని పేరు దేవీప్రసాద్. ఆంధ్రా యూనివర్శిటీలో లెక్చరర్. యూ. జీ. నాకు బావ అవుతారు. అవును భగవాన్ ఆజ్ఞపైనే నేను వెళ్ళాను బెంగుళూరు. జ్ఞానంలో ఎక్కువ తక్కువ అని లేదు. జ్ఞానం అంతా ఒకటే; ఆయనా గొప్ప జ్ఞాని. అంతే నాకు తెలుసు. ఆయన బోధ వేరు, నా బోధ వేరు. ఇంతే నాకు తెలిసిన సంగతులు ఆయన గురించి. చివరికి అసలు సంగతికి వొస్తే ఎవరేం బోధించినా అదంతా ఒకటే.

నాన్న పరిస్థితి అట్లానే వుంది. మీరెట్లా చూశారో అట్లానే వుంది.

జ్ఞానమే అంతిమం. ఆ స్థితికే ఆయన చేరుకుంటున్నారు. అది ఏమిటంటే ఎట్లా తెలుస్తుంది? ఇప్పుడు మాత్రం మీ గురువు కాదా?

మీరన్నదంతా తప్పకుండా సత్యం. ఇప్పుడు కూడా Chalam is divine love. ఆ దృష్టితోనే చూడండి.

ఈశ్వరాశీర్వాదాలతో

చలం

*

15-7-78

వీరేశలింగంగారికి,

నాన్న ఆ విధంగానే ఉన్నాడు. కానీ అప్పుడప్పుడు సంతోషంగా మాట్లాడుతున్నాడు. బాధలేం లేవు. సుధ, మా మేనత్త వొచ్చారు. సుధ నాన్నదగ్గిర డాక్టరుగా నిలబడ్డాడు. నాన్నచాలా cheerful గానే ఉన్నాడు.

ఎవరైనా ఏనాటికో ఓ నాటికి face చేయవలసిందే కదా.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

24-7-78-

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. నేను రాయించిన కార్డు అందివుంటుంది. నాన్నకి కాన్షస్‌నెస్ వొచ్చి కొంచెం సాలిడ్ ఫుడ్ తింటున్నాడు. కాన్సర్ అచ్చు సంగతి ఆ ప్రెస్ వాళ్ళు నిర్లక్ష్యం చేస్తున్నారు. కానీ కొన్ని ఫార్మ్స్ పంపించారు. త్వరలోనే వొచ్చేట్టుంది. నాన్నకే బాధలు లేవు. అవును నాన్న ఫొటో మీద మీరు రాయించిన వాక్యం ఎంతో బావుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

2-8-78

వీరేశలింగంగారికి,

మీరు బావున్నందుకు సంతోషం. నాన్నగారు మెల్లిగా కోలుకుంటు న్నారు. సుధ వారం రోజులుండి వెళ్ళిపోయినాడు. మా అత్తయ్య ఇక్కడే వుంది.

మీ కల చాలా బావుంది.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

12-8-78

వీరేశలింగంగారికి,

నాన్న రోజురోజుకి కోలుకుంటున్నాడు. సుధ వాళ్ళఅమ్మ ఇక్కడే వుంది. మీ స్నేహితుడు పంపిన M. O. అందింది. ఈ సంవత్సరం

ఆగష్టు 15 ఉత్సవం చేయడం లేదు. ఆ సొమ్ము ఆరోజు పూజ నిమిత్తం ఖర్చు చేస్తాము!

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

19-9-78

వీరేశలింగంగారికి,

నాన్న ఆరోగ్యంగా వున్నాడు. మాట్లాడుతూనే వుంటాడు అప్పు డప్పుడు. అవి సరిగ్గా వినపడవు. ఒక్కొక్కప్పుడు అర్థంకావు. నవ్వుతో కూడా వుంటాడు.

'కాన్క' అచ్చయింది. ఏదైనా విశ్వాసం వుంచుకోండి. విశ్వాసమే అన్నింటికన్నా ముఖ్యమైనది.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

23-11-78

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం అందింది. ఇట్లాంటి గంతులేస్తున్న స్పిరిట్‌తోనే చాలా ఏళ్ళ కిందట ఉత్తరాలు రాస్తూండేవారు మీరు. కాన్క మిమ్మల్ని అంత గొప్పగా ఇన్‌స్పైర్ చేసినందుకు సంతోషంగా వుంది. నాన్నగారు బాగు న్నారు. ఆరోగ్యం బాగుంది కూడాను. చలిగా లేనప్పుడు కొంచెం బయట చిన్న చిన్న షికార్లు కూడా చేస్తున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

26-12-78

వీరేశలింగంగారికి,

మీరు రాసిన ఉత్తరం అందింది. మీరు రాసిన అ. సు. రా. వ్యాకాలు నాన్నకి చదివి వినిపించాను. నా చుట్టూ, ఉన్న మిత్రులు కూడా చాలా సంతోషించారు విని. చాలా వొరిజినల్‌గా రాశారాయన. మీరు బాగున్నారా? ఇక్కడ క్రిస్మస్ పండగ అయిపోయి జయంతి హడావిడిలో వున్నాం.

నాన్న ఆరోగ్యం బాగుంది. బాగా మాట్లాడుతున్నాడు. మనిషి పట్టుకుంటే నడుస్తున్నాడు.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

4-1-79

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం అందింది. నాన్నగారి ఆరోగ్యం బావుంది. నర్తకి అనారోగ్యం వలన పాండిచ్చేరి వెళ్ళింది చూపించు కోవడానికి. తక్కిన వారందరూ బాగున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

29-1-79

వీరేశలింగంగారికి,

మీ కార్డు అందింది. మీరు బాగున్నందుకు సంతోషం. నర్తకి అనారోగ్యం నించి కోలుకుంటోంది. ఇక్కడ విశేషాలేముంటాయి. కొత్త రచన ఒకటే అదే సూర్యనారాయణ రాసిన సౌరిస్-2 అదే ఇంకా రివైజ్ చేస్తున్నాం. నాన్నగారు బాగున్నారు. అప్పుడప్పుడు తనంతట

తను తింటారు. ఒకొక్కప్పుడు తినిపిస్తారు. కొంచెం నడుస్తున్నాడు. బాధలు ఎవరికైనా తప్పవు. మార్గం లేదనేదేముంది. బాధలేందే మన వునికి మనకి ఎట్లా తెలుస్తుంది. ఈ భూమిమీదే కాదు ఎక్కడున్నా దేని నన్నా అనుభవించాలంటే బాధతో కూడిగానీ రాదు.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

20-2-79

వీరేశలింగంగారికి,

మీరు కులాసాగా ఉన్నందుకు సంతోషం. నాన్నగారు బాగున్నారు. నాన్నగారు రాలేరు గనక నాన్న బదులు బసవరాజు గారిని ఆహ్వానించారు తిరుపతి యూనివర్సిటీ వారు.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

8-5-79

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. అవును-మీరు అన్నదంతా నిజమే! *ఆయన బ్రహ్మైక్యం పొందారు-అంటే అరుణాచలంలో ఐక్యమైనారు.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*చలం-చనిపోయారు

*

28-6-79

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం అందింది. మీరు పంపించిన cuttings చదివించు కున్నాను.

ఇంతవరకు ఏ మార్పులూ లేవు రమణస్థాన్‌లో. పెద్ద మార్పల్లా నాన్న మంచం లేకపోవడమే,

తోటలో అస్తులు తీసుకువొచ్చి సమాధి చేశాం. ఏమైనా మార్పులు వొచ్చి నట్లయితే తప్పకండా రాయిస్తాను.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

10-9-79

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం మీరు రిటైరైనారన్నమాట. యాభై ఐదేళ్ళు మిమ్మల్ని ఈశ్వరుడు కాపాడుతూ వొచ్చారు కదా ! ఇంక మీదట కాపాడరా !

మీరు ఏమివ్వాలి ?

ఏమీ ఇవ్వఖ్కర్లేదు, మీలోనీ ఆ ప్రేమని నిలబెట్టుకోవడమే-మీరు చేయవలసింది. ఇంతకు ముందే కదా మీరు రాశారు ఈశ్వరుడు కాపాడుకుంటూ వొచ్చారు-నా జీవితమంతా అని. ఇప్పుడు ఒంటరిగా-నిస్సహాయుణ్ణి చేసి పంపించారు-అంటున్నారేమిటండీ ? వెంట లేరా ? ఆమెని కనిపెట్టుకుని వుండటం అనే దాన్ని సాధనగా చూసుకోండి.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

18-12-79

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం అందింది, తప్పకండా ఈశ్వర కటాక్షం మీయందు వుంది సందేహించకండి.

సౌరిస్ జీవిత చరిత్ర రెండవ భాగం అచ్చు కాలేదు. నర్తకి పూటీలో వుంది ప్రస్తుతం. ఇక్కడ అందరం క్షేమంగా వున్నాం.

ఈశ్వరాశీర్వాదాలతో
సౌరిస్

*

24-8-81

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. బాధలు తప్పవండీ.

ఎందుకు దిక్కులేదని అంటారు మీరు. తప్పకండా భగవాన్‌ని ప్రార్థించండి. వింటారు. నాకు రాస్తే నేనూ వింటాను. మీ ఆరోగ్యం బావుంది కదా.

ఇక్కడ అందరం బాగున్నాం.

ఈశ్వరాశీర్వాదాలతో
సౌరిస్

*

24-11-81

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మీరు ఇప్పుడు బావున్నందుకు సంతోషం. సూర్య స్తోత్రాన్నే సాధన చేసుకోండి. శరీరబాధలు, మనస్సుబాధలు అన్నీ మనస్సు మీద ఆధారపడినవే. మనస్సు అణిగిన కొద్దీ బాధలూ అణుగుతాయి.

అందరం బావున్నాం.

ఈశ్వరాశీర్వాదాలతో
సౌరిస్

*

5-12-81

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. మనస్సుని శాంతింపచేసుకునే ప్రయత్నంలోనే ఉండండి. పోన్లెండి మీరు సాధన చేస్తున్నారు- ఎక్కడవుండి చేస్తే ఏం? మీరు ఉన్న చోట్లోనే ఉండండి. మీ జీవితం ఏమీ వృథా కావడంలేదు.

ఎక్కడున్నా సాధన జరగడం ముఖ్యం. ఇక్కడందరం బావున్నాం.

ఈశ్వరాశీర్వాదాలతో
సౌరిస్

*

అరుణాచలం
31-8-82

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. ఇక్కడికి వొస్తే హాయిగా ఉండవండీ. వొంటికి ఏదో ఒకటి చేస్తోనే ఉంటుంది. కానీ అందరం బాగానే ఉన్నాం.

మీ ఉత్తరాలు నాన్నరాసినవి 1952 నించి 1964 వరకు ఉన్నాయి.

అసలు అవే ఉన్నట్టు నా జ్ఞాపకం. ఆ తరవాత నాన్న రాసినట్టు నాకు గుర్తులేదు. ఇక్కడ మామూలుగానే ఉన్నాం ఎప్పటిమల్లేనే. నేను సెప్టెంబర్ నెలాఖరుకి ఢిల్లీలో ఉంటాను. ఇక్కడ అందరూ బావున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో
సౌరిస్

*

భీమ్లి

5-10-82

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. అనుకున్న ప్రకారం భీమ్లికి వొచ్చాం. నాతో వొచ్చే వారంతా వొచ్చేశారు.

హాయిగానే ఉన్నాం. తప్పకంగా రండి ఇక్కడికి.

నా రేడియో ఇంటర్వ్యూ ఈనెల 8వ తేదీన రాత్రి 7-45 గం.లకి ప్రసారం చేస్తున్నారు వైజాగ్ స్టేషన్ నించి.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

సాగరసంగమం

భీమ్లి

6-1-84

వీరేశలింగంగారికి,

మీ కార్డు. అవును. అందరూ అదే అంటున్నారు- క్రిస్మస్-జయంతి-న్యూఇయర్ అన్నీ బాగా జరిగాయని,

అవును మా మేనత్త వ్యాసం చూశాను. చాలా బాగా రాసింది. ఇక్కడ అందరం బావున్నాం. చాలావరకు అతిథులందరూ వెళ్ళిపోయారు. కృష్ణారావు, సూర్యనారాయణ మాత్రం వున్నారు.

ఈశ్వరాశీర్వాదాలతో

సౌరిస్

*

సాగరసంగమం
భీమ్లి
**15-5-84**

వీరేశలింగంగారికి,

మీ ఉత్తరం. పాపం మీరు రాలేక పోయినారన్నమాట.

మీ డ్రాఫ్ట్. **Thanks.** మేరీమాత చిత్రం ఎంతో బావుంది. అది ఒక ఫేమస్ పెయింటింగ్.

నర్తకి ఇవాళ సాయంత్రం వొస్తుంది చిత్రతో కలిసి.

ఈశ్వరాశీర్వాదాలతో
సౌరిస్

*

